# యండమూరి వీరేంద్రనాథ్

# గ్రాఫాలజీ



చేతి వ్రాత బట్టి
మనస్తత్వం తెలుసుకునే
శాస్త్రం

## మీకు తెలుసా ?

- లక్షమందిలో ఏ ఇద్దరి వేలిము ద్రలూ ఒకలావుండనట్టే - చేతి వ్రాతలూ వుండవు.
- మనిషి వ్యక్తిత్వాన్నీ, మానసిక స్థితినీ, అంతర్గత అర్హతల్నీ, కళల్నీ చూపించే దర్పణం 'చేతివ్రాత'.
- మన బలహీనతలు మన చేతివ్రాత లలో బయటపడతాయి.
- ఉద్యోగాలకీ, ఎన్నుకునే వృత్తు లకీ, వివాహాలకీ, స్నేహాలకీ

చివరికి.... మానసిక వ్యాధులు కనుక్కోవటానికీ చేతి వ్రాత వుపయోగపడుతుంది.

**గ్రాఫాలజీ నేర్చుకోండి!**

**మిమ్మల్ని మీరు తెలుసుకోండి!!**

**స్నేహితుల్నీ - ఆత్మీయుల్నీ**

**అలరించండి!!!**

మీ అభిమాన రచయిత

# యండమూరి వీరేంద్రనాథ్ రచనలు

| | | |
|---|---|---|
| 1 | ధ్యేయం | 40/ |
| 2 | 13 14 15 | 36/ |
| 3 | ది డైరీ ఆఫ్ మిసెస్ శారద | 50/ |
| 4 | ప్రియురాలు పిలిచె | 50/ |
| 5 | వెన్నెల్లో ఆడపిల్ల | 30/ |
| 6 | మంచు పర్వతం | 35/ |
| 7 | భార్యా గుణవతి శత్రు | 35/ |
| 8 | నల్లంచు తెల్లచీర | 36/ |
| 9 | స్వరబేతాళం | 30/ |
| 10 | సంపూర్ణ ప్రేమాయణం | 30/ |
| 11 | ఒక రాధ ఇద్దరు కృష్ణులు | 30/ |
| 12 | అతడు ఆమె ప్రియుడు | 36/ |
| 13 | అంతర్ముఖమ్ | 36/ |
| 14 | డబ్బు మైనస్ డబ్బు | 40/ |
| 15 | లేడీస్ హాస్టల్ | 36/ |
| 16 | స్టూవర్టుపురం పోలీస్‌స్టేషన్ | 33/ |
| 17 | అగ్ని ప్రవేశం | 36/- |
| 18 | రుద్రనేత్ర | 40/- |
| 19 | చీకట్లో సూర్యుడు | 36/- |
| 20 | రాక్షసుడు | 50/- |
| 21 | ఆఖరి పోరాటం | 36/- |
| 22 | మరణ మృదంగం | 50/- |
| 23 | తులసిదళం | 36/ |
| 24 | ప్రార్థన | 36/ |
| 25 | డబ్బు ! డబ్బు !! | 36/ |
| 26 | ఆనందో బ్రహ్మ | 33/ |
| 27 | రాధా కుంతి | 15/ |
| 28 | అభిలాష | 30/ |
| 29 | రక్తసింధూరం | 30/ |
| 30 | తులసి | 36/ |
| 31 | అష్టావక్ర (2 Parts) | 50/ |
| 32 | థ్రిల్లర్ | 30/ |
| 33 | వెన్నెల్లో గోదారి | 20/ |
| 34 | చెంగల్వపూదండ | 20/ |
| 35 | దుప్పట్లో మిన్నాగు | 20/ |
| 36 | పర్ణశాల | 30/ |
| 37 | క్షమించు సుప్రియా | 15/ |
| 38 | యుగాంతం | 15/ |
| 39 | ఋషి | 15/ |
| 40 | నిశ్శబ్దం నీకూ నాకు మధ్య | 15/ |
| 41 | ఆ ఒక్కటీ అడక్కు | 15/ |
| 42 | గ్రాఫాలజీ | 30/ |
| 43 | మీరు మంచి అమ్మాయి కాదు | 18/ |
| 44 | విజయంవైపు పయనం | 18/ |
| 45 | మిమ్మల్ని మీరు గెలవగలరు | 18/ |
| 46 | మిమ్మల్ని మీ పిల్లలు ప్రేమించాలంటే ? | 18/ |
| 47. | పాపులర్ రచనలు చేయటం ఎలా ? | 30/ |

యండమూరి వీరేంద్రనాథ్

# గ్రాఫాలజీ



నవసాహితి బుక్ హౌస్
ఏలూరు రోడ్ • విజయవాడ-520 002

# GRAPHALOGY

By :
YANDAMURI VEERENDRA NATH
36, Jayanagar, Road No 3, Banjarahills,
Hyderabad 500 034

*First Edition :* **1993**

*Second Edition :* **1994**

***Publishers :***
**NAVASAHITHI BOOK HOUSE**
Eluru Road, Vijayawada 520 002

*Composed on D T P by*
**'ALAKANANDA'**
Vijayawada 2

*Printed at*
**Sri Panduranga Offset Printers**
Vijayawada - 2




***Price :***
**Rs. 30-00**

# విషయసూచిక

# ఉపోద్ఘాతం

మనం ఏదేనా చేతి వ్రాతను చూడగానే 'ఇది అమ్మాయి వ్రాతలావుందే' అంటాం. అమ్మాయి అయినా, అబ్బాయి అయినా చేతికి అయిదువేళ్ళే వుంటాయి. బొటనవ్రేలు, చూపుడువ్రేలు, మధ్య వ్రేలు నడుమే ఎవరైనా పెన్ను పెట్టుకొని వ్రాస్తారు అయినా కూడా అబ్బాయి చేతివ్రాతకీ, అమ్మాయి చేతి వ్రాతకి సాధారణంగా తేడా వుంటుంది. మరి, ఎవ్వరు వ్రాసినా అది చెయ్యే అయినపుడు వ్రాతలో తేడా ఎందుకుంటుంది?

సాధారణంగా మనం వ్రాతను చూసి 'ఇది అమ్మాయి వ్రాసిన వ్రాత' అని అనుకున్నపుడు తొంభైశాతం వరకూ మన అభిప్రాయం కరక్ట్ అవుతూ వుంటుంది

మీరు గమనించారో లేదో 1970 ముందు అమ్మాయిల చేతి వ్రాతలు ఎక్కువశాతం గుండ్రంగా వుండేవి. ఇటీవల కాలంలో అమ్మాయి చేతి వ్రాతకీ, అబ్బాయి చేతి వ్రాతకీ తేడా పట్టుకోవటం కొంచెం కష్టం అవుతోంది దీనికి కారణం ఏమిటంటే, ఒకప్పుడు స్త్రీ అభిప్రాయాలలో పురాతన సంస్కృతి పట్ల గౌరవం, పొందిక, నెమ్మదితనం ఇవన్నీ రంగరించి వుండేవి ఇటీవల కాలంలో అమ్మాయిల్లో తనపట్ల తనకి నమ్మకం, ఆర్థిక స్వాతంత్రత, ఎక్కువ వ్యక్తిత్వం కనబడుతూ వుంటాయి. ఈ పరిణామాలన్నీ చేతివ్రాతల్లో కూడా మనం గమనించవచ్చు

అలాగే పదహారేళ్ళ అమ్మాయి వ్రాసిన చేతి వ్రాతకి, అదే అమ్మాయి ముప్పై సంవత్సరాల తర్వాత వ్రాసిన చేతివ్రాతకి తేడా వుంటుంది దీనికి కారణం ఏంటంటే, వయసు పెరిగేకొద్దీ మానసికమైన

వత్తిళ్ళు ఎక్కువ కావటం, ప్రపంచ జ్ఞానం పెరగటం కారణాల్ల వుంటాయి.

అదే విధంగా, నేనేదైనా నవల వ్రాసేటప్పుడు, అందులో డ్రామా, టెన్షన్ సీన్లు వ్రాయవలసి వచ్చినప్పుడు నాచేతి వ్రాతలో మార్పు వస్తూవుంటుంది.

పైన చెప్పిన ఉదాహరణలన్నీ గమనిస్తే మనకోవిషయం బోధపడుతూ వుంటుంది. మనిషి స్వభావానికీ, మూడ్ కి చేతివ్రాతకి చాలా దగ్గర సంబంధం వుందని! ఆ సంబంధమేంటో తర్వాత ఛాప్టర్లలో పరిశీలిద్దాం.

## చరిత్ర :

గ్రాఫాలజీ ఈ యుగానికి సంబంధించింది కాదు. మానవుడు గుహల్లో వ్రాయడం మొదలుపెట్టిన దగ్గర్నుంచీ వుందని శాస్త్రజ్ఞులు చెప్పారు మానవుడు రాతిపై వేసిన గుర్తులన్నీ అతని మనస్తత్వాన్ని తెలియజేస్తాయి. ఉదాహరణకి, ఒక బాణం తగిలిన జింక ఎంతో భయవిహ్వలతతో దీనంగా చూడటం ఒక చిత్రకారుడు చిత్రిస్తే అతడియొక్క మనస్సు విలుకాడిదారుణానికి గురైన జింక స్థితి పట్ల జాలిని, ఆర్ద్రతనీ చూపుతుంది ఇదే చిత్రాన్ని విలుకాడు మనకి దగ్గరగా వుండేటట్లు, జింక ఎక్కడో దూరంగా వుండేటట్టు చిత్రిస్తే విలుకాడి కళ్ళల్లో క్రౌర్యాన్ని ప్రస్ఫుటింపజేస్తుంది. ఇదేవిధంగా చేతి వ్రాత కూడా.

ఆరువేల సంవత్సరాల క్రితం ఈ శాస్త్రం ఆవిర్భవించిందని శాస్త్రజ్ఞులు చెబుతారు చేతివ్రాతబట్టీ మనస్తత్వాన్ని పరిశీలించే విద్యను మొట్టమొదట కనుగొన్నవాళ్ళు చైనీయులు తర్వాత అరిస్టాటిల్ ఈ శాస్త్రాన్ని మరింత విస్తృత పరిచాడు కొంతమంది ఫ్రెంచి శాస్త్రజ్ఞులు ఈ శాస్త్రానికి నియమాలు ఏర్పరచారు

అమెరికాలో సైన్సులో ఒక భాగంగా ఇది గుర్తింపబడింది యూరప్‌లో దీన్ని పాఠ్యాంశంగా విశ్వవిద్యాలయాల్లో బోధిస్తున్నారు

కొన్ని వేలవేల వేలి ముద్రలు పరిశీలించాక 'ప్రపంచంలో ఏ ఇద్దరి వేలిముద్రలూ కూడా సరిపోవు' అన్న నిర్ణయానికి శాస్త్రజ్ఞులు వచ్చారు. అదేవిధంగా ప్రపంచంలోని ఏ ఇద్దరి చేతివ్రాతలూ కూడా సరిపోడానికి అసలు ఆస్కారంలేదు.

ప్రొఫెషనల్ గ్రాఫాలజిస్టులు చేతివ్రాతలను పరిశీలించటానికి కంప్యూటర్‌లను ఉపయోగిస్తున్నారంటేనే ఇది చాలా అద్భుతమైన శాస్త్రమని మనకి తెలుస్తోంది.

ఈ గ్రాఫాలజీ నేర్చుకోవాలంటే అన్నిటికన్నా ముందు 'కుతూహలం' కావాలి. మిగిలిన సైన్సు లాగే దీనికి కూడా ప్రత్యేకమైన సాంకేతిక నామాలు, పారిభాషిక పదాలూ వున్నాయి.

ఫోర్జరీ లాంటి నేరాలను కనిపెట్టడానికే కాకుండా, ఉద్యోగనియామక విషయాల్లో కూడా ప్రస్తుతం ఈ గ్రాఫాలజీ ఉపయోగపడుతోంది. ఉదాహరణకి అభ్యర్థులు స్వంతదస్తూరీతో అప్లికేషన్లు వ్రాయాలి అనే కండిషన్లో, అలా పంపిన దరఖాస్తు ఫారాలని పరిశీలించినప్పుడే గ్రాఫాలజీలో పరిచయమున్న అధికారులు, అభ్యర్థి ఎటువంటివాడో తెలుసుకోగలుగుతున్నారు. ఈ గ్రాఫాలజీ మీద సరియైన పట్టు సంపాదించినట్లైతే, జాతకాల కన్నా ఇదే అవతలి మనిషి యొక్క మనస్తత్వాన్ని కరక్ట్‌గా తెలియజేస్తుందనటంలో ఏమాత్రం సందేహం లేదు. ఎందుకంటే, జాతకం దేవుడు వ్రాసింది. చేతివ్రాత మనిషి వ్రాసింది.

ఈ పుస్తకం గ్రాఫాలజిస్టుల కోసం వ్రాస్తున్నది కాదు. ఎందుకంటే ఇందులో అన్నీ బేసిక్ విషయాలే చర్చించబడ్డాయి కొత్తగా గ్రాఫాలజీ నేర్చుకునేవాళ్ళకి, లేదా తమ చేతి వ్రాత చూసి తమ గురించి తెలుసుకుందామనుకునే వాళ్ళకి, ఈ పుస్తకం ఉపయోగపడుతుంది. అంతేకాక, ఈ పుస్తకం చదివి ఒక నిర్దిష్టమైన అవగాహన ఏర్పరచుకుంటే స్నేహితులకీ, అపరిచితులకీ కూడా వాళ్ళ వాళ్ళ చేతి వ్రాతలు బట్టి వారి మనస్తత్వాన్ని తెలియజెప్పి, ఒక ప్రత్యేకమైన వ్యక్తిగా స్థానం సంపాదించుకోవచ్చు.

ఎటువంటి పరిస్థితుల్లోను అవతలి వారి చేతివ్రాతను అధ్యయనం చేసేటప్పుడు ఏ రెండు మూడు లక్షణాలనో పట్టించుకొని, మిగిలినవి విడిచిపెట్టి తెలిసీ తెలియని విశ్లేషణ చేయకండి. ఆమూలాగ్రం చదివి, అన్ని లక్షణాలను దృష్టిలో పెట్టుకుని, అప్పుడు మీరేమనుకుంటున్నారో చెప్పడం ప్రారంభించండి.

## గ్రాఫాలజీ యొక్క పరిమితులు

ఎవరైనా ఒక శాస్త్రం గురించి అధ్యయనం చేసేటప్పుడు, ఈ శాస్త్రం చాలా గొప్పది, దీనికన్నా మించింది మరోటిలేదు అంటూ వుంటారు కానీ ప్రతీశాస్త్రానికి కొన్ని పరిమితులుంటాయి. అలాగే గ్రాఫాలజీకి కూడా కొన్ని పరిమితులున్నాయి. ఉదాహరణకి, చేతివ్రాతను చూసి ఒక మనిషి యొక్క వయసుచెప్పలేం. అదే విధంగా ఇంతకు ముందే చెప్పినట్లు ప్రస్తుత సంక్లిష్ట పరిస్థితుల్లో ఆడా, మగా చేతివ్రాతల తేడాను చెప్పడం కష్టమౌతోంది. గ్రాఫాలజీ మనిషి మూడ్ పట్టి కూడా మారుతూవుంటుంది. కాబట్టి నార్మల్ కండిషన్‌లో వున్నప్పుడు వ్రాసిన వ్రాతనే ప్రామాణికంగా తీసుకోవాలి.

గ్రాఫాలజీ బట్టి వయసు చెప్పటం పెద్ద కష్టం కాదుగానీ, కొందరు వృద్ధులు కూడా చిన్న పిల్లల మనస్తత్వం కలిగి వుండొచ్చు. అలాగే కొందరు చిన్నప్పుడే వైరాగ్యంతో వృద్ధులైపోవచ్చు. అలాగే ఆడవారు ఇంటిబాధ్యత వహించినప్పుడు వారిలో, పురుషలక్షణాలు కనిపించవచ్చు. స్త్రీ మనస్తత్వం వున్న పురుషులు కూడా వుండవచ్చు

ఏది ఏమైనా, ఈచేతివ్రాత సాయంతో మనం ఎనభైశాతం వరకూ మన (లేదా) అవతలివాళ్ళ మనస్తత్వాన్ని తెలుసుకోవచ్చు.

# ముఖ్యగమనిక

ఈ పుస్తకాన్ని చదవబోయేముందు మీరు తప్పనిసరిగా ఒక విషయాన్ని గమనించాలి. లేకపోతే మీ యొక్క మనస్తత్వాన్ని తెలుసుకునే అవకాశాన్ని కోల్పోతారు.

1. ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ మీరు ఎప్పుడో వ్రాసిన రెండు కాగితాల్ని దగ్గర పెట్టుకోండి. రూళ్ళ కాగితం మీద వ్రాసిందయితే మంచిది. అది దొరకని పక్షంలో తెల్లకాగితం మీద వ్రాసింది దగ్గరుంచుకోండి.

ఒకలైను, రెండులైన్లు కాకుండా పది, పదిహేను లైన్ల మేటర్ దగ్గరపెట్టుకోవటం మంచిది. అదే విధంగా "ఎడమవైపు మార్జిన్ గీత" లేని కాగితం మీద వ్రాసిందయితే బావుంటుంది.

ఎట్టి పరిస్థితులలోనూ ఈ పుస్తకం కోసం మీరు వ్రాయడం ప్రారంభించవద్దు.

అలా వ్రాస్తూవుంటే మీరు ఒకవిధమైన ప్రభావంతో, బాగా వ్రాయాలి అన్న ఉద్దేశ్యంతో వ్రాయడం మొదలుపెడతారు. అందుకని ఎప్పుడో వ్రాసిన కాగితాన్ని దగ్గిరుంచుకోవడం చాలా ముఖ్యం.

2. ముందు పుస్తకాన్ని చదివి ఆ తరువాత మనస్తత్వాన్ని పరిశీలించుకుందాంలే అని అనుకోవద్దు.

అటువంటి పరిస్థితుల్లో ఏదైనా ఒకరకం చేతివ్రాతకి ఎదురుగా ఏదైనా చెడు వ్రాసి వుంటే అది మనకు

సంబంధించినది కాదులే అనుకునే ప్రమాదం ఉంది. అందుకని వివరణ చదవకుండా ముందే మీరు మీ చేతివ్రాత ఏవిభాగానికి చెందుతుందో గుర్తుపెట్టుకోండి.

3. రకరకాలుగా వ్రాసేవారి మనస్తత్వాలు ఈ పుస్తకంలో రకరకాల విభాగాలుగా విడగొట్టబడ్డాయి. వాటినన్నింటిని చదివి, అందులో అన్నిటికంటే ఏది బావుంటే, అది మీదన్న సంతృప్తితో తప్పు అంచనాకి రాకండి.

ఒక్కొక్క చాప్టర్‌లో చాలా చేతివ్రాతలు ఉదాహరణలుగా ఇవ్వబడ్డాయి. మీదగ్గర వున్న (ఎప్పుడో వ్రాసిన) మీ చేతివ్రాతలో - ఏ ఉదాహరణ సరిపోతుందో చూసుకుని ముందుగా 'టిక్' పెట్టుకోండి.

అన్ని ఛాప్టర్లలోనూ అలా టిక్ పెట్టుకున్నాక, ఒకేసారి మొత్తం అదంతా చదవండి. మీ మనస్తత్వం కరెక్టుగా తెలుస్తుంది.

4. మీ స్నేహితుల, స్నేహితురాండ్ర చేతివ్రాతలు పరిశీలించబోయేటప్పుడు కూడా ఆవిధంగానే చేయండి. ముందుగా, ఆ చేతివ్రాత ఏ 'విభాగానికి' చెందుతుందో నిర్ణయించుకొని 'టిక్' పెట్టుకోండి. పుస్తక మంతా ఆ విధంగా టిక్కులు పెట్టుకున్న తరువాత, ఆ విభాగానికి చెందిన గుణగణాలన్నీ చదివి వారిపట్ల మీరు ఒక అంచనాకి రండి.

మీకు స్కూల్లో ఏవిధంగా నన్నా నేర్పనీ, మీరు చిన్నప్పుడు ఎన్ని కాపీ పుస్తకాలైనా వ్రాసి ఉండనీ - మీ దస్తూరి మీ మనస్తత్వాన్ని బట్టే ఏర్పడుతుంది అది అప్పుడప్పుడు మీ టెన్షన్‌నీ, మీ చిరాకునీ, అన్నింటినీ ప్రస్ఫుటం చేస్తుంది.

మీరు ఊహించని సమయంలో అకస్మాత్తుగా మీ రూపాన్ని పట్టి బంధించినట్లే నిర్లక్ష్యంగా వ్రాసిన మీ దస్తూరి మీ ప్రవర్తన గురించి కరెక్టుగా చెబుతుంది. అందువల్లే మీరు ఎప్పుడో వ్రాసిన స్క్రిప్ట్ తీసుకోమన్నది। దీని కోసం ప్రత్యేకంగా రాయొద్దు.

చేతివ్రాతను బట్టి మనస్తత్వాన్ని కనుక్కోవటాన్ని పన్నెండు రకాలుగా విభజించవచ్చు. అవి

1. అక్షరాల సైజు
2. అక్షరాల వంకర
3. అక్షరాల పొడవు
4. వెడల్పు
5. ఒద్దిక
6. కూర్పు
7. కలం వత్తిడి
8. వాక్యాల గమనం
9. అక్షరాల వత్యాసం
10. మార్జిన్

ఇవిగాక ఇంకా అడ్రసులు వ్రాయడం, సంతకాలు పెట్టడం వీటన్నింటి గురించి కూడా ఈ పుస్తకంలో వివరణ ఇవ్వబడింది.

మరో ముఖ్యమైన విషయం।

ఈ విశ్లేషణలో గమనించవలసిన ముఖ్య అంశం మరొకటి వుంది. లోపలిపేజీల్లో వివిధ రకాల విశ్లేషణల్లో, చాలా రకాలుగా ఉదాహరణలు ఇవ్వబడ్డాయి. ఉదాహరణకి "కుడివైపుకి వంచి అక్షరాలు వ్రాసేవారు అవతలి వాళ్ళని సులభంగా ఆకర్షించే నైపుణ్యం కలిగి వుంటారు" అని మీరు లోపలి పేజీల్లో చూడవచ్చు. అప్పుడు మీకో అనుమానం రావచ్చు - "చేతి వ్రాతకీ, దీనికీ ఏమిటి సంబంధం?" అని.

ఈ సైన్సులో "ఒక వ్యక్తి చేతివ్రాత కుడివైపు వంగి వుంటే మనిషి Attractive" అని వుంది తెలుగు పాఠకులకి మరింత ఇంటరెస్టింగ్‌గా వుండేటందుకు, కొంత స్వంత వివరణ కలపటం జరిగింది. లిండా గుడ్ మన్ రాసి ఫలాల విశ్లేషణని ఈ సందర్భంలో బేస్‌గా చేసుకోవటం జరిగింది. చాలా వుదాహరణలు అక్కడి నుంచి తీసుకున్నవే. పరిశోధకుడు ఒక్కపదం ఇస్తే దాన్ని తెలుగు పాఠకుల కోసం మరింత సోదాహరణంగా వివరించటం జరిగింది.

నిజానికి గ్రాఫాలజీ పుస్తకాల్లో ఇంత వివరణ కానీ ఉదాహరణలు కానీ, విశ్లేషణ కానీ లేవు. కేవలం గుణగణాలు మాత్రమే ఇవ్వబడ్డాయి. ఉదాహరణకి "'అక్షరాలు పెద్దగా వ్రాసేవారు 1. గుర్తింపు, 2. విలాసవంతమైన జీవితం, 3. ఆత్మ విశ్వాసం కలిగి వుంటారు" అని సింపిల్‌గా వ్రాయబడింది. ఇలాంటి గ్రాఫాలజీ పుస్తకాలు నాలుగయిదు చదివి, అన్నింటినీ క్రోడీకరించి స్వంత విశ్లేషణ చేర్చటం జరిగింది. మనిషి గుణగణాలు పాయింట్ టు పాయింట్ కాకుండా దానికి వీలైనన్ని ఉదాహరణలు చేర్చటం ఆసక్తికరంగా వుంటుందని భావించి, ఈ విధంగా వ్రాయటం జరిగింది.

మొదట, పైన చెప్పిన పది అంశాలని ఒకటి తరువాత ఒకటి పరిశీలిద్దాం.

## 1. అక్షరాల సైజు:

ఇవి మూడు రకాలు పెద్ద అక్షరాలు, చిన్న అక్షరాలు. మీడియం సైజు అక్షరాలు.

న పుట్టిన పాపానికి 10 ఏళ్ళకో నూరేళ్ళ
వాళ్ళ జీవితాల పై నాకేం అధికారముంది
మళ్ళీ వాళ్ళని ఈ దుర్భర పరిస్థితుల్లో ఏం
ఉంపిస్తుంది నన్ను ఏం చెయ్యమంటారు
ఉత్తరం వ్రాసావని తెలిస్తే ఊరుకు ఒప్పు

[illegible]

[illegible]

పైన మూడు రకాల చేతివ్రాతలను గమనిస్తే, చేతివ్రాతలని మూడు రకాలుగా విడగొట్టవచ్చని అర్థమౌతుంది. ఈ మూడిట్లో మీరు ఏ రకానికి చెందుతారో నిర్ణయించుకోండి. ఆ తర్వాత ఈ క్రింది విశ్లేషణని చదవండి.

## పెద్ద అక్షరాలు :

పెద్ద అక్షరాలు వ్రాసేవారు సాధారణంగా ఎక్కువ కోర్కెలు కలిగిన భోళామనుషులై వుంటారు. వీళ్ళు జీవితంలో గెలుపుని చవిచూస్తారు. చాలామంది సినిమా ఏక్టర్లు, రాజకీయ నాయకుల దస్తూరి ఈ విధంగా వుంటుంది. ఒక్క మహాత్మా గాంధీ తప్ప చాలా మంది ప్రముఖులు వ్రాసే అక్షరాలు పెద్దవే. గమనించి చూడండి.

— ఇలా పెద్దక్షరాలు వ్రాసేవారిలో చాలామంది సాధారణంగా ఆబ్జెక్టివ్ కన్నా ఎక్కువ సబ్జెక్టివ్‌గానే వుంటారు.
— వీళ్ళలో ఒక ఛాలెంజ్‌ని ఎదుర్కోవాలనే తపన ఎక్కువగా వుంటుంది.
— జీవితంలో గుర్తింపుని ఎక్కువగా కోరుకుంటారు. తమమీద తమకి ఎక్కువ నమ్మకం వుంటుంది.
— కాసింత గర్వం కూడా వుంటుంది.
వీళ్ళు సాధారణంగా ఆశావాదులై వుంటారు.
కొంచెం దానగుణం కూడా కలిగివుంటారు.
— ప్రతీ విషయాన్ని నిర్మోహమాటంగా మాట్లాడ గలిగి వుంటారు.
అవసరమైనదాని కన్నా ఎక్కువగా డబ్బు ఖర్చుచేస్తారు.
— ఆధునికంగా, విలాసవంతంగా జీవితాన్ని గడపడానికి ఇష్టపడతారు.
వీళ్ళలో కొన్ని మైనస్ పాయింట్లు కూడ లేకపోలేదు.
— వీళ్ళలో ఆబ్జెక్టివిటీ ఎక్కువగా వుంటుంది. అలాగే క్రమశిక్షణని ఎక్కువ ఇష్టపడినా వీళ్ళు మాత్రం క్రమశిక్షణతో మెలగరు.
ఒక విధమైన నిర్లక్ష్య భావంతో జీవితాన్ని గడుపుతారు.
స్వార్థం పాలు కూడా ఎక్కువగానే వుంటుంది.

జ్ఞాపకశక్తిపట్ల నిర్లక్ష్యంగా వుంటారు. అంటే, విషయాలని గుర్తుపెట్టుకొనేశక్తి వీళ్ళల్లో వున్నప్పటికీ, ఎందుకు గుర్తుంచుకో వాలి అనే ధోరణి వుంటుంది.

అలాగే వీళ్ళకి ఎక్కువగా 'ట్యాక్ట్' తెలీదు. అవతలి వాళ్ళని బుట్టలో వేసుకొనే విధానం అసలు తెలీదన్నా, అందులో ఆశ్చర్యం ఏమీలేదు

డబ్బు విషయంలో నిర్లక్ష్య మెక్కువ. చాలా విషయాల్లో ఒక నిర్దిష్టమైన అభిప్రాయం వుండదు. తమకున్న అభిప్రాయమే చాలా కరక్టనుకుంటారు. ఎదుటి వాళ్ళని గుర్తించటానికి వీళ్ళు ఇష్టపడరు

వీరి విషయంలో ఒకోసారి నిజమనిపించింది కలగాను, కలగా అనిపించింది నిజమని అనిపిస్తూవుంటుంది. వీళ్ళెప్పుడూ స్థిరంగా వుండటానికి ఇష్టపడరు. ఉద్యోగాలు, ఇళ్లూ తరచూ మార్చినట్లుగానే ప్రేమ వ్యవహారాలు కూడా మారిపోతూవుం టాయి.

వీరి స్వభావాన్ని ఒక్క వాక్యంలో చెప్పాలంటే పుస్తకంలోని చివరి పేజీలని ముందుగా చదివే స్వభావం అనొచ్చు

చెప్పినదాన్ని, విన్నదాన్ని త్వరగా అర్థం చేసుకొని అన్వయింపజేసు కొనే శక్తి వీళ్ళకుంది

ఇతరుల పట్ల స్నేహభావాన్ని చూపించి, త్వరగా జాలిపడ్డా, వారు అర్హులు కారు అని తెలిసిన వెంటనే దూరంగా వెళ్ళిపోతారు. వీరు చేసినంత త్వరగా, సమర్థవంతంగా ఇతరులు పనిచేయలేరు అనటంలో అతిశయోక్తిలేదు. చాలామంది కంటే అసలుసిసలైన తెలివితేటలు వీరికుంటాయి.

వ్యంగంగా మాట్లాడటం అన్నా, అల్లరి చేయటం అన్నా వీరికి చాలా ఇష్టం.

ఒకేసారి నాలుగైదు పనులు చెయ్యటంలో నైపుణ్యాన్ని ప్రదర్శించి, చూసే వాళ్ళని ఆశ్చర్య చకితుల్ని చేస్తారు.

ఎవరి మెప్పుకోలు కోసమో కాకుండా, తమకోసమే తమ జీవిత విధానాన్ని నిర్ణయించుకుంటారు.

— ఒకే చోట కదలకుండా కూర్చోవటమన్నా, యాంత్రికమైన పనులు చెయ్యటమన్నా వీళ్ళు చాలా అయిష్టత చూపుతారు.

— సాహిత్యంలో ఉత్సాహం వున్నవాళ్ళైతే, తెలివిగా పదాలను కూర్చి సందర్భోచితంగా వాక్యాల్ని నిర్మిస్తారు.

— వీరు శిల్పోనూ, సాహిత్యంలోనూ, మిగిలిన 'ఆర్ట్' సంబంధమైన విషయాల్లో బాగా పైకొస్తారు.

— క్షణక్షణానికి వీరి అభిప్రాయాలు మారుతూ వుంటాయి. వీరి మనస్సు వీళ్ళకి తెలిసినట్లుగా ఇతరులకు తెలిసే అవకాశం లేదు. వీరు తమను తాము ఒక పుస్తకంలా చదవటానికి ఎదుటివారికి ఇవ్వరు

— తమని తాము రక్షించుకోటానికి వీళ్ళు ఇతరుల సలహాలను పాటించరు. వాళ్ళ జాగ్రత్తలోనే వాళ్ళుంటారు.

— వాదనల్లోగానీ, మాటలలోగానీ వీళ్ళదే పైచేయి

— ఒక భాషకంటే ఎక్కువ భాషలు నేర్చుకోవాలనే ఆసక్తి వీళ్ళలో వుంటుంది

— వీరిలోవున్న అద్భుతమైన కళ ఏంటంటే, ఎస్కిమోలకు కూడా కిలో రెండ్రూపాయల చొప్పున ఐస్‌ని అమ్మగలరు. అలాగే నిరాశావాదులకు అందమైన కలలను కేజీలచొప్పున అమ్మగల సమర్థులు వీరు.

— వీరు ఇతరులకి ఎంతో బద్ధకస్తులుగా కనిపించినా, మానసికంగా ఎంతో ఉల్లాసంగా త్వరితగతిన పనులు చేయగలరు.

— వీరితో వచ్చే పెద్ద చిక్కేమిటంటే, క్షణక్షణానికి మారే వీరి అభిప్రాయాలని చూసి ఇతరులు వీళ్ళని అబద్ధాలకోరు అనుకొనే ప్రమాదం వుంది వీరు నిజంగా అబద్ధాలాడరు. మారే అభిప్రాయాలే వీళ్ళనావిధంగా ఎదుటివారి ముందు నిలబెడతాయి.

వీళ్ళలో కొంతమంది పచ్చి అబద్ధాలు చెప్పి, తమ పనులు చేయించుకొనే సామర్థ్యం కలిగివున్నా, ఎక్కువమంది చేదునిజాలు మాట్లాడి అందరికీ దూరం అయ్యేప్రమాదముంది. వీరు చేసేపనులు అందువల్లే కొందరికి చాలా విపరీతంగా అనిపిస్తాయి.

మారుతున్న కాలంతోపాటూ మనమూ మారాలి అనేది వీరి స్వభావం. తమమాటే నెగ్గితీరాలి అనే మొండి పట్టుదల కూడా వుంది.

— వీరికి గర్వం తక్కువ. వీరికి గర్వం వుందని, తెలిసిన వాళ్ళెవ్వరూ అనుకోరు. అవతలివాళ్ళ దగ్గర వీరు తమ భార్య / భర్త తెలివిలో తమ కంటే ఎక్కువని నిరూపింప బడాలని మనసులో కోరుకుంటూ వుంటారు.

## చిన్న అక్షరాలు :

రెండో రకం చేతివ్రాత చూడండి. మామూలు పేజీకి 30 35 అక్షరాలు వ్రాసేవారు ఈ కేటగిరీలోకి వస్తారు.

— చిన్న అక్షరాలు వ్రాసేవారు నెమ్మదస్తులు, మర్యాదతెలిసిన వారు అయివుంటారు. పబ్లిసిటీ అంటే వీరికిష్టం వుండదు. కొంచెం ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ కలిగివుంటారు.

— ప్రతీ విషయం మీద అమితమైన శ్రద్ధ చూపుతారు తమ శక్తుంని ఎక్కువగా ఆలోచించటానికే ఉపయోగిస్తారు తప్ప, ఆచరణలో పెట్టడానికి ఎక్కువ ఇష్టపడరు వీరు తెలివైనవారు. 'థీయరీ'ని ఎక్కువ నమ్ముతారు.

— వీరిలో గమనించే గుణం ఎక్కువగా వుంటుంది. ఎప్పుడూ వూహలోనే వుంటారు. 'తాము వూహలోవుంటూ, అవతల వాళ్ళని ఎక్కువగా గమనించటానికి ఇష్టపడతారు

— వీళ్ళు రియలిస్టులు. జీవితపువాస్తవాలని ఎప్పుడూ గమనిస్తూవుంటారు. వీరిలో వున్న ఒక గొప్ప గుణం ఏంటంటే 'ఓర్పు'

అవతలి వాళ్ళు ఎన్ని తప్పులు చేసినా ఓర్పుతో సహిస్తారు
అయితే, కాన్సరిజర్వ్‌డుగా వుండడం వల్ల మిగతా వాళ్ళెవ్వరూ వీరిని అర్థం చేసుకోలేక పోయే ప్రమాదం కూడా ఉంది
వీరికి ఏకాగ్రత అంటే ఇష్టం వ్యాపార లక్షణాలు కొద్దిగా ఎక్కువగానే వుంటాయి
వీరి ఆలోచనాశక్తి అద్భుతమైనది ప్రతీవిషయాన్ని తాము రక్తప్రసరణని పెంచుకోకుండా ఆలోచించగలిగే సమర్థులు
వీళ్ళు బాగాచదువుతారు మోడెస్ట్‌గా వుంటారు చిన్నవిషయాన్నైనా ఎక్కువగా విశ్లేషించుకొని, మంచిచెడులు నిర్ణయించుకోగలుగుతారు
వీరిలోవున్న మరో గొప్ప శక్తి ఏమిటంటే 'విమర్శనాత్మక' దృష్టి ఒక అభిప్రాయం తమకి రాగానే వెంటనే ఆచరించకుండా అందులోవున్న మంచిచెడులను గమనించగలుగుతారు

వీరిలోనూ కొన్ని లోపాలు లేకపోలేదు
తమ మీద తమకి నమ్మకం వున్నా, ఆ నమ్మకాన్ని ప్రకటించే శక్తితక్కువ
వీరి పరిధి చాలా చిన్నగా వుండాలని కోరుకుంటారు దాన్ని విస్తృత పరిచే ప్రయత్నాలు సాధారణంగా చెయ్యరు దీనికి కారణం, కొద్దిగా ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ వుండటం ఏ పనైనా చివరి వరకూచేసి సాధించాలనుకొనే పట్టుదలకన్నా, ఆ పని ఎలాగూ పూర్తికాదనే నిర్ణయానికి రాగానే వదిలేయటానికి సిద్ధపడతారు
ప్రతీ విషయంలోనూ అవసరమైన దానికన్నా ఎక్కువ జాగ్రత్త వుండటం వల్ల వీరు కొన్ని విషయాల్లో నష్టపోతారు
అవతలి వాళ్ళు డామినేట్ చేసేశక్తి కలిగి వున్నవాళ్ళైతే, సాధారణంగా వీళ్ళులొంగి వుండటానికే ఎక్కువ ఇష్టపడతారు
వీరు లొంగిపోవటమనేది అవతలవాళ్ళ గొప్పతనాన్ని ఒప్పుకొని

మాత్రం కాదు కేవలం, అవతలవాళ్ళతో మనకెందుకులే గొడవ అన్న ఆలోచనతో అయి వుంటుంది.

— తల్లిదండ్రులంటే వీరికి అపారమైన ప్రేమాభిమానాలుంటాయి. అయినా వాటిని ప్రదర్శించే పనులేంవీ చేపట్టరు వీరికి తల్లిదండ్రులంటే ఎంతటి అభిమానమంటే, ప్రియురాలిని కూడా తల్లిలాగ వ్యవహరించాలని కోరుకునే మనస్తత్వం వీరిది। అంత జాలి, క్షమ అవతలివాళ్ళ నుంచి కూడా ఆశిస్తూ వుంటారు అసలు వీళ్ళని చూసే సిగ్గనేది సిగ్గెలా వుండాలో తెలుసుకుంటుంది

— డబ్బు విషయంలో చాలా జాగ్రత్తపరులు. అవసరానికేతప్ప, అనవసరంగా ఒక్క పైసాకూడా ఖర్చు చెయ్యటానికి ఇష్టపడరు

— అద్భుతమైన కలలు కనటంలో వీళ్ళకి వీరే సాటి కలలకోసం చదువునీ, పనినీ కూడా వదిలివేసే సమర్థులు వీరు.

— తమకు తెలిసిన కళను, ప్రొఫెషన్‌నూ ఆత్మ సంతృప్తికోసమే కాకుండా, నలుగురి సంతోషానికి ఉపయోగించి ఎలా క్యాష్ చేసుకోవాలో వీరికి బాగా తెలుసు

— పొగిడితే పొంగిపోయే చంచల మనస్కులుగా కనిపించే వీళ్ళు, చాలా నెమ్మదస్తులుగానూ, బాధ్యతలను విస్మరించకుండాను వుండగలరు. హాస్యాన్ని వీరు ఇష్టపడినంతగా ఇంకెవ్వరూ ఇష్టపడరు ఈ కారణంగా చుట్టుపక్కల ఇళ్ళల్లో పిల్లలు కూడా వీరితో కబుర్లు చెప్పడానికి ఆసక్తి చూపిస్తే అందులో అతిశయోక్తి ఏమీలేదు

— పార్టీల్లోనూ, మీటింగుల్లోనూ, వీళ్ళు ఎదుటివారిని ఎక్కువగా గమనించే అలవాటుని కలిగివుంటారు నిజానికి వీళ్ళెంత గొప్పవారో అవతలవాళ్ళకి ఒక్కసారిగా అర్థంకాదు వీళ్ళని మొదటిసారిగా చూసిన అమ్మాయిలు/అబ్బాయిలు వీళ్ళల్లోవుండే గొప్పతనాన్ని గుర్తించలేక వీరిని కోల్పోతారు

— వీళ్ళు ఏ విషయంలోనూ తొందరపడి నిర్ణయాలు తీసుకోరు

వీళ్ళతో మాట్లాడిన వాళ్ళు, వీరియొక్క సంక్లిష్టతను అర్థం చేసుకోలేక వ్యంగ్యంగా మాట్లాడి గాయపర్చినా, తర్వాత వీరిలోవున్న అంతర్గతమైన శక్తిని గుర్తించి స్నేహితులౌతారు
వీరు, ఎంత ఒంటరిగా వుండాలని ప్రయత్నించినా జనం వీరి కంపెనీ కోరుకుంటారు వీరి మనస్సు చాలా మెత్తనైనది అనురాగం, సెంటిమెంటు, పోటీపడి వీరి మనసునుంచీ పెల్లుబకటానికి ప్రయత్నిస్తాయి
పైకి ఎంత మామూలుగా కనిపించినా, ఎప్పుడూ ఏదో ఒకదానికి రహస్యంగా చింతిస్తూ వుంటారు ఆ చింత కూడా వారికి ఆనందాన్నిస్తుంది
వీరితో వీళ్ళ బంధువులు తమ ఆప్తులకు కూడా చెప్పని రహస్యాన్ని చెప్పుకొని సంతృప్తి చెందుతారు వీరు ఒకరకంగా గాడ్ ఫాదర్‌లా ప్రవర్తించటానికి ఇష్టపడతారు
డబ్బు విషయంలో వీరియొక్క జాగ్రత్తని చూసి, ఎవరేనా వీళ్ళని పిసినారులని వేలెత్తి చూపిస్తే, కాదని నిరూపించటానికి ఎంతైనా ఖర్చుచేస్తారు
ఎటువంటి పరిస్థితుల్లోనూ వీరు దివాళా తీయటం అంటూ జరగదు లక్ష రూపాయలున్న వీరు దివాళా తీసారు అంటే, లక్ష నుంచి వేల స్థానంలోకి వచ్చారని మాత్రమే అర్థం
ఆడంబరంగా వుండటానికి వీరెప్పుడూ ఇష్టపడరు అతి సామాన్యంగా, సౌమ్యంగా కనిపించటమే వీరికిష్టం అయితే విలాస వస్తువులు వీళ్ళని బాగా ఆకర్షిస్తాయి
చిన్న చిన్న విషయాలే వీరికి ఎక్కువ సంతృప్తినిస్తాయి మేనమామ మొదటిసారిగా కొని ఇచ్చినపెన్ను, పదికి పది మార్కులు తెచ్చుకున్న మొదటిసారి డిక్టేషన్ పేపర్, స్నేహితుడు/స్నేహితురాలు ఇచ్చిన చిన్న పువ్వు వీటిని సైతం జీవితాంతం దాచుకోడానికి వీళ్ళు ఇష్టపడతారు

— వీరికున్న అబ్జర్వేషన్ శక్తివల్ల అంత త్వరగా ఎవ్వరిదగ్గరా మోసపోరు

— వీరిని ఏదైనా ఒక విషయంలో ఒప్పించాలంటే ప్రాచీనులపేర్లో, పెద్ద పెద్ద అంకెలో, ఎప్పుడో జరిగిన సంఘటన నో ఉదాహరణలుగా తీసుకొని ఒప్పించటం సులభం

అల్లరి చిల్లరగా తిరిగే అమ్మాయిలు/అబ్బాయిలతో అవకాశముంటే వీరు కూడాతిరిగినా చివరికొచ్చేసరికి తమ ప్రియురాలు/భార్య/ లేదాప్రియుడు/భర్తతోనే జీవితాన్ని, ఆలోచనలని పంచుకోడానికి ఎక్కువ ఇష్టపడతారు

## మీడియం సైజు అక్షరాలు : -

— పైన చెప్పిన మూడు ఉదాహరణల్లో మీరు మూడో కేటగిరీకి చెందిన వారైతే మీవి మీడియం సైజు అక్షరాలన్నమాట కేవలం మీ చేతివ్రాత అవతల వాళ్ళకి అర్థమవటానికి అవసరమైన దానికన్నా ఎక్కువగాకుండా, అలాగని మరీ చిన్నగా వ్రాయకుండా వ్రాసే చేతివ్రాత కలిగి వున్న మీరు, జీవితంలో కూడా అంతే బ్యాలన్సు కలిగి వుంటారు

— మీరు మీ మీద మరీ ఎక్కువ నమ్మకం లేనివారు అలాగని ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడేవారు కారు సాంప్రదాయం, సంస్కృతి, సాధారణ జీవితం ఇలాంటివన్నీ ఇష్టపడతారు.

సాధారణంగా కఠినంగా గానీ, మొరటుగాగానీ ప్రవర్తించటానికి ఇష్టపడరు

అస్తవ్యస్తంగా వున్నా ఏ పరిస్థితులైనా సరే మీ దృష్టిని ఇట్టే ఆకర్షిస్తాయి ఇటువంటి పరిస్థితులను చక్కబెట్టుకోవడంలో మీకు ఆత్మసంతృప్తి కలగడమే కాక, కొత్త కొత్త పనులు చెయ్యడానికి కావలసిన ఉత్సాహాన్ని కూడా పొందుతూ వుంటారు మనుషులతో కలిసి మెలిసి వుండటానికి ఇష్టపడ్డా, క్రిక్కిరిసిన సమూహంలో వీరు ఇమడలేరు

ఇతరుల మధ్య జరిగే గొడవలనీ, తలెత్తే సమస్యలనీ పరిష్కరిస్తూ ఒక్క జడ్జిలానో, శాంతి పావురంగానో వుండటానికి ఇష్టపడతారు మళ్ళీ మీ వరకు వచ్చేసరికి ఏదేనా అభిప్రాయం మీకు నచ్చకపోతే, మీరుకూడా ఒక న్యాయవాదిలా వాగ్యుద్ధానికి తలపడటాన్ని చాలా ఇష్టపడతారు

మామూలుగా ఉల్లాసంగా మంచి వారిలా కనబడేమీరు, .ఒకోసారి ఇతరులు చెప్పేపనులు నచ్చకపోతే, చెయ్యమని మొరాయించి, అయినదానికి కానిదానికి కూడా వారితో వాగ్వివాదానికి దిగుతూ వుంటారు

అమోఘమైన తెలివితేటలున్నాసరే ఒకోసారి చాలా మూర్ఖంగా మొసపోతూ వుంటారు.

మీరు ఒకోసారి చెవిలో ఊదరగొట్టేసే విధంగా మాట్లాడినా, మీ మాటల్లో ఏదో ఒక విధమైన లాజిక్ వుండటం వల్ల అవతలివాళ్ళు మీ మాటలను చాలా ఓపికగా వింటారు.

మానసికంగా ఎంత అశాంతి వున్నా పైకి కనబడనీయకుండా ఉల్లాసంగానే వుంటారు ఏ విషయంలో కూడా తొందరపడటం, ఉరుకులు పరుగులుగా చెయ్యటం మీకు ఇష్టం వుండదు

ఏ పనైనా అనుకున్న సమయానికే ఖచ్చితంగా చెయ్యటం మీకు ఇష్టం పరస్పర విరుద్ధంగా కనిపిస్తున్న ఇన్ని లక్షణాలు మీలో వుండటంవల్ల అది మీకే గందరగోళంగా వుంటుంది

మీ గురించి అందరూ ఒకే వాక్యం అనుకుంటారు ''అందం, ప్రేమ, సౌశీల్యం, మంచితనం, కోపం, విసుగు, కరకుతనం, పట్టుదల ఇన్ని గుణాలున్న వ్యక్తిని చూడటం నా జీవితంలో ఇదే మొదటిసారి ''

ప్రశాంతంగా సంతోషంగా తమ చుట్టూ వున్న పరిసరాలని కూడాఆనందమయం చేసే మీరు ప్రతీచిన్న విషయాన్ని కూడా పట్టించుకుంటూ, చుట్టు వున్న వాళ్ళతో గిల్లికజ్జాలు పెట్టుకుంటూ మొండిగా లేనిపోనివి ఊహించుకుంటూ కనిపిస్తారు

మీ జీవితంలో మిమ్మల్ని గొప్పగా స్పందింపజేసే వ్యక్తులుగానీ, విపరీతంగా మీరు అసహ్యించుకునే వ్యక్తులుగానీ ఎవరూ వుండరు అలా ఎప్పుడేనా వున్నా కాలక్రమేణా వాళ్ళ ప్రభావం నుంచి బైటపడి మీ స్వంతవ్యక్తిత్వాన్ని నిర్మించుకుంటారు హిమాలయ పర్వతాలలోని ఒక మంచి యోగి కనిపించినా, అమాయకంగా చిరునవ్వులు చిందించే పసివాడు కనిపించినా ఇద్దరినీ ఒకే దృష్టిలో మీరు పరికిస్తారు

పదిమందిలో మిమ్మల్ని చూడగానే ఒక ప్రత్యేకమైన వ్యక్తిగా మిమ్మల్ని ఎవ్వరూ గుర్తించరు కానీ, మీలో ఏదో తెలియని ఆకర్షణ వుందని ఒప్పుకుంటారు

కోపంతో ఉడికిపోతున్నా చాలా సమయాల్లో మాత్రం మీ మొహం చాలా ప్రశాంతంగా వుంటుంది అది మీరు కొనితెచ్చుకునేది కాదు స్వాభావికంగా మీలో వుండే లక్షణం

మీ స్వరంకుండా తియ్యగా, మధురంగా వుంటుంది ఒకవేళ అలా లేకపోయినా కంఠాన్ని పెంచి అరవటం, గొంతు చించుకోవడంలాంటి పనులు అమర్యాదకరమైనవిగా, అసభ్యకరమైనవిగా మీరు గుర్తిస్తారు.

మీరు ఒక వ్యక్తి మీద విపరీతమైన కోపం తెచ్చుకున్నప్పుడు కూడా ''నువ్వు అంటే నాకసహ్యం నేనిప్పుడు నీ ముక్కుపచ్చడి చెయ్యదల్చుకున్నాను'' అని చెప్పగలరు చిత్రం ఏంటంటే అలా చెప్తున్నప్పుడు కూడా మీ స్వరం ఎస్పీ బాలసుబ్రమణ్యం ప్రేమగీతం అంత మధురంగా వుంటుంది

గట్టిగా వుండే చక్కిలాలు కంటే, మెత్తగా వుండే జిలేబీలను ఇష్టపడటంలోనే మీ స్వభావాన్ని అంచనా వేసుకోవచ్చు

ఒకోసారి మీకు భరించలేనంత డిప్రెషన్ వస్తూ వుంటుంది సోమరితనంలో మునిగిపోవాలనిపిస్తుంది అయినా ఆ స్టేజినుంచి తొందరగానే బైటపడతారు విరామంలేకుండా పని చేయాలనేదే మీ స్వభావం కానీ శరీరతత్వం మాత్రం వేరేవిధంగా వుంటుంది

కొద్దిగ అనారోగ్యం వున్నా ఆశ్చర్యపోనవసరం లేదు పని చేస్తున్నంతసేపూ చైతన్యంతో నవనవలాడే జీవనాడులు బాగా అలసిపోయే స్థితికి తొందరగానే వస్తాయి మరి పనిచేయ్యమని మొరాయిస్తాయి దాంతో మీకు ఒక విధమైన విరాసక్తత ఏర్పడుతుంది అయినా తొందర్లోనే దాని నుంచి బైటపడతారు ఈ విస్పత్తువని అవతలివారు అపార్థం చేసుకునే ప్రమాదం కూడా వుంది

ఒకోసారి మీరు మహాయోగుల్లా కనిపిస్తుంటారు దానికి విరుద్ధంగా మీ మనసులో మాత్రం ఒకేసారి కొన్నివేల భావాలు చెలరేగుతుంటాయి వాటిలో చాలాభావాలు వజ్రాలంత విలువైనవిగాను, గట్టిగానూ వుంటాయి

సాధారణంగా మీరు మనషులని నమ్మరు నమ్మినట్లుగా నటిస్తారు అలా నటించడం వల్ల అవతల వాళ్ళు తమ ముసుగులు తియ్యగానే వాళ్ళ వ్యక్తిత్వం మీకు కనపడుతుంది చిత్రమేమిటంటే అది మీరేరకంగా ఊహించారో అదేవిధంగా కనబడుతుంది దానివల్ల మీ అహం సంతృప్తి చెందుతుంది ఇలాంటి స్వభావం వల్ల మీరు చాలా తక్కువమంది మనుషులకే మానసికంగా దగ్గరవగలరు

మీకు సెల్ఫ్ కంట్రోల్ తక్కువ మీరు కంట్రోల్ చేసుకోలేరని కాదు ఏదైనా ఒక కొత్త అనుభూతికి గానీ, అనుభవానికి గానీ తొందరగాలోనవుతారు అదెలావుందో పరిశీలించాలనే మనస్తత్వం మీకు ఎక్కువగా వుంటుంది కానీ, ఆ అలవాటు అభిరుచి మిమ్మల్ని డామినేట్ చెయ్యగలదని మీరు తెలుసుకున్న వెంటనే తొందరగా దాన్లొంచి మీరు బైటపడతారు

మీరు ఏ పని చేసినా నిజాయితీగా చేస్తారు గనుక ఒక పని చేసేటప్పుడు వేరేపని చెయ్యడానికి ఇష్టపడరు దీనివల్ల అవతలవాళ్ళకి కొన్ని ఇబ్బందులు కలిగే అవకాశం కూడా వుంది

# 2. అక్షరాల వంకర :

కొందరు వ్రాసే అక్షరాలు కుడివైపుకి వంగి వుంటాయి మరికొందరు ఎడమవైపుకి వంచి వ్రాస్తారు , మరికొంతమంది అక్షరాలను నిలువుగా వ్రాస్తారు ఇంగ్లీషులో ఇలాంటి వంకరలను పట్టుకోవటం చాలా సులభం తెలుగులో కాస్త కష్టం ముఖ్యంగా ఈ క్రింది అక్షరాలను గమనించండి





'స', 'న' అనే అక్షరాలని, తలకట్టని గుర్తించడం ద్వారా, మనం ఏ కేటగిరీలోకి చెందుతామో సులభంగా తెలుసుకోవచ్చు మీరు వ్రాసిన స్క్రిప్ట్‌లో ఈ రెండు అక్షరాలని గమనిస్తే, క్రింద చెప్పిన మూడు వర్గాలలో మీరు దేనికి చెందుతారో మీకే అర్థమౌతుంది మరికొంతమంది 'కో' 'లో' అనే అక్షరాలని వెనక్కి వ్రాయటం ద్వారా తమ యొక్క మనస్తత్వాన్ని తెలుపుతూ వుంటారు ఈ క్రింది చేతి వ్రాతని గమనించండి



ఇలా అక్షరాలు వ్రాసేవారు ఎడమ వైపుకి వంచి వ్రాసే కేటగిరీలోకి చెందుతారు

మీరు వ్రాసిన వ్రాతప్రతిలో అక్షరాలని గమనిస్తే ఈ క్రింది మూడు రకాల్లో ఏదో ఒక వర్గానికి చెందిన వారైవుంటారు.

త్మ్యతత ఉండాలని పదిమందిలో
లని ఆరాటపడుతూ ఉంటాను.
ల్లో చాలా శ్రద్ధ తీసుకుంటాను
వల్ల ఆకర్షణీయతను కోల్పో-

మీరు ఏ వర్గానికి చెందుతారు అనేది తెలుసుకోవాలంటే, అక్షరం మీద నిలువుగా పెన్సిల్‌తో గీతగీయండి. మీ అక్షరం కుడివైపునకు వంగివుంటే మొదటి రకం. ఎడమవైపునకు వంగి వుంటే

రెండో రకం. మీరు గీసిన పెన్సిల్ గీట్‌తో పాటూ నిలువుగా వుంటే అది మూడో రకం. ఇప్పుడు ఈ క్రింది ఆధారాలతో మీ మనస్తత్వాన్ని విశ్లేషించుకొండి.

## ఎ) కుడివైపు :.

కుడివైపునకు అక్షరాలు వంగివుండేలా వ్రాసేవారు నలుగురిలో బాగా కలిసిపోతారు. ప్రతీ విషయంలోనూ ఏక్టివ్ పార్ట్ తీసుకుంటారు. సాధారణంగా మనందరం మన అక్షరాలని కుడివైపుకే కొద్దిగా వంచి వ్రాస్తాం. మీరు ఈ కేటగిరీలోకి చెందిన వారైతే మిమ్మల్ని మీరు ఒక 'ఎక్స్ట్రావర్ట్'గా భావించుకోవచ్చు.

మీరు స్నేహమనస్కులై వుంటారు. ఆప్యాయతలకి ఎక్కువ విలువ ఇస్తారు. మానవ సంబంధాలపట్ల ఎక్కువ నమ్మకాన్ని కలిగి వుంటారు. సంఘంలో ఎక్కువ భాగానికి మీరు ప్రతినిధులై వుంటారు.

మీకు ఎమోషన్స్ ఎక్కువగా వుంటాయి. ఇవ్వటం, తీసుకోవటం అనేది సమాన స్థాయిలో వుంటుంది. ఈ విధంగా కుడివైపుకి వంచి వ్రాసే వాళ్ళు, ఇతరుల చేత ప్రభావితమైనా కూడా తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకొనే ప్రయత్నం చేస్తుంటారు. ప్రేమ, ద్వేషం, త్యాగం లాంటి పదాల పట్ల చాలా దృఢమైన అభిప్రాయాలుంటాయి. కానీ, ఒత్తిళ్లకు మాత్రం లొంగిపోతుంటారు.

(కొంతమంది అక్షరాలను కుడివైపుకి వంచి వ్రాస్తే, మరికొందరు పూర్తిగా పడుకోబెట్టి వ్రాస్తారు. ఈ ఛాప్టర్ లో చెప్పిన లక్షణాలన్నీ వారు కుడివైపుకి ఎంత వంచివ్రాస్తే అంత గాఢమైన గుణాలున్న వారుగా నిర్ణయించుకోవాలి.)

మీలో వున్న మంచి గుణాలని ఈ విధంగా గుర్తించుకోవచ్చు :

1. సాంఘిక బాధ్యతల పట్ల ఆసక్తి ఎప్పుడూ రిలాక్సింగ్‌గా వుండటం
2. కొత్త వాతావరణానికి తొందరగా అడ్జస్ట్ అవటం
3. మానవసంబంధాల పట్ల ఆకర్షణ

4. నిస్వార్థ పరత్వం
5. ఒక గమ్యం వైపు వెళ్ళాలనే తపన
6. భవిష్యత్తుపట్ల ధృఢనిశ్చయం
7. ఎప్పుడూ రొటీన్‌గా కాకుండా కొత్త విషయాలపట్ల ఆసక్తి
8. చిన్న విషయాలకే ఎక్కువ ఎక్సైట్ అవటం.
9. ప్రతీ పనిలోనూ ఉత్సుకత
10. అవసరమైన దానికన్నా ఎక్కువ సెంటిమెంటల్‌గా వుండటం.

నిరోధక శక్తి లేకపోవటం, మీ మీద మీకు అవసరమైనంత కంట్రోల్ లేక పోవటం, మీ దగ్గర వాళ్ళపట్ల విసుగు చూపటం, ఎమోషన్‌గా వుండటం. మీరు బాగా నమ్మిన వ్యక్తి మీద ఎక్కువ ఆధారపడటం, మీ గురించి ఎవరేమనుకుంటున్నారో అని నిరంతరం తపనపడటం, నిర్ణయం తీసుకోవాల్సి వచ్చినప్పుడు కంగారు పడటం, ఏదైనా పని తొందరగా చేయటం - ఇవన్నీ మీ బలహీనతలుగా పేర్కొనవచ్చు.

ఇటువంటి చేతిరాత కలిగిన వాళ్ళు గురించి ఒక ఉదాహరణ:

ఒక అమ్మాయి మీద అన్ని రకాల ట్రిక్కులు ప్రయోగించి, (అవి ట్రిక్కులు అని తాము నమ్మకుండా) ఆ అమ్మాయిని ఒప్పుకొనేటట్లు చేసి, (ఇందులో బలవంతం ఏమీ వుండదు. ఆ అమ్మాయే ఒప్పుకొంటుంది) ఆ తర్వాత ఏం చెయ్యాలో తెలియక సందిగ్ధంలో పడిపోయి, ఆ అమ్మాయి నిస్సహాయతని ఉపయోగించుకోవాలా, పెళ్ళి చేసుకుందామా అని అడగాలా, రెండూ మానేయాలా - ఇన్ని రకాలుగా ప్రశ్నించుకొని సతమతమై చివరికి ఆ అమ్మాయిని కోల్పోతారు. అయినా సరే ప్రేమ విషయంలో ఎన్ని దెబ్బలు తగిలినా డీలాపడిపోరు. విధి అనుకూలించలేదనుకొని అతిమామూలుగా, అతి సాధారణంగా వేరే అమ్మాయి కోసం ప్రయత్నాలు మొదలుపెడతారు.

ఇటువంటి చేతిరాత వున్నవాళ్ళు ఎవర్నీ అవహేళన చెయ్యరు. కామెంట్ చేసి బాధపెట్టరు. వీరు ఒకవేళ ఏ అమ్మాయినైనా

ప్రేమించినా, ఆ అమ్మాయి వ్రాసిన ప్రేమలేఖలన్నీ చివర్లో తీసికెళ్ళి ఇచ్చివేసి తాము మంచివాళ్ళని ముద్రవేసుకుంటారు.

## బి) ఎడమవైపు :

సాధారణంగా ఈ రకమైన చేతివ్రాత గలవాళ్లు తక్కువ.

1. వీళ్ళు చాలా వరకూ అంతర్ముఖులై వుంటారు.

2. ప్రపంచం గురించి బాగా తెలిసినా కూడా తాము అమాయకులని భావిస్తు వుంటారు.

3. ఎప్పుడూ స్పృహలో వుండటం వీళ్ళ దురదృష్టం ఒక పార్టీని గానీ, మంచి కంపెనీ గానీ సాధారణంగా అనుభవించలేరు

4. ముఖ్యంగా 16-25 మధ్య వయస్సులో వుండి ఇటువంటి చేతివ్రాత గలవాళ్ళు సెక్స్ పట్ల ఒక విధమైన నిర్లిప్తత వున్నట్లుగా పైకి కనిపిస్తారు. అంతర్గతంగా చాలాకోరికలుంటాయి.

5. వీరికి తమ బంధువులతోను, తల్లిదండ్రులతోను, తమని ప్రేమించే వారితోను గాఢమైన సంబంధాలుంటాయి. ఇవి మానసికమైనవి.

6. ప్రతీ చిన్న విషయాన్ని అత్యంత జాగ్రత్తగా చేయటం వీరి అలవాటు. అందువల్ల వీరిని చుట్టూవున్న వాళ్ళు అర్థం చేసుకోలేరు. వీరికున్నంత స్ట్రాంగ్ ఫీలింగ్స్ ఎవరికీ వుండవు.

7. జీవిత వాస్తవాల పట్ల దృఢమైన అభిప్రాయాలు, ఏ పనికైనా కంట్రోల్‌గా చేయడం, మంచి జ్ఞాపకశక్తి తనకుతాను నిజాయితీగా వ్యవహరించడం, అతిజాగ్రత్త, పట్టుదల, తనకి సంబంధించిన విషయాలన్నీ స్వతంత్రంగా ఆలోచించటం — వీరి మరిన్ని మంచి గుణాలు.

అయితే వీరిలో కొన్ని అభినందనీయంకాని గుణాలు కూడా వున్నాయి.

అప్పుడప్పుడు సినికల్‌గా ప్రవర్తించటం, అతిజాగ్రత్త చూపటం, అవతల వాళ్ళకి తానొక గర్విష్టి అనే విధంగా ప్రవర్తించటం, తమ

జీవితగతానుభావాల ప్రభావానికి ఎక్కువగా గురవటం, ఎక్కువ సెన్సెటివ్‌నెస్, తామెలా వుంటారో దానికి విరుద్ధంగా బయటకి కృత్రిమంగా కనబడటం.

## సి) నిట్టనిలువుగా :

అక్షరాలు నిట్టనిలువుగా వ్రాసేవారు తమమీద తమకి బాగా కంట్రోల్ వున్న వాళ్ళై వుంటారు. ప్రతీ విషయంలోనూ బాగా నిర్లిప్తంగా కనిపిస్తారుగానీ, లోలోపల దాని గురించి లోతుగా ఆలోచిస్తారు.

వీళ్ల హృదయాన్ని వీళ్ళ మెదడు ఎప్పుడూ కంట్రోల్ చేస్తుంది. ఏదేనా విషయాన్ని వీళ్ళు ఆనందించాలంటే దానికి వీళ్ళమెదడు ముందుగా గ్రీన్ సిగ్నల్ ఇవ్వవలసి వుంటుంది.

వీళ్ళు చాలాకూల్‌గా తమపై తాము నమ్మకంలో వుంటారు. ఏ విషయంలోనైనా వీళ్ళని ఒప్పించటం కష్టం. ప్రభావానికి ఎక్కువగా లోనవరు.

వీరు చాలా సాధారణంగా చాలా ప్రాక్టికల్‌గా జీవితాన్ని జీవిస్తుంటారు. ప్రతి విషయంలోనూ విమర్శనాత్మక దృష్టి ఎక్కువగా వుండటం వల్ల వీరిని అర్థం చేసుకోవటం కష్టం. ఒక స్వీట్‌ని వీరిముందు పెట్టినప్పుడు కూడా అది తింటూ ఇదెలా చెయ్యబడింది? ఇదెందుకింత రుచిగా వుంది? నేను చెయ్యగలనా? అనే ఆలోచనలతో ఆ స్వీట్ తినటంలో వుండే ఆనందాన్ని కోల్పోతారు. వీరి ఆనందం మళ్ళీ ఆ స్వీట్ తయారు చేయటంలోనే వుంటుంది తప్ప, వేరొకరు చేసినదాన్ని తినటంలో వుండదు.

ఇన్ని గుణాలుండటం వల్లే వీరు రాజకీయనాయకులుగానో, లీడర్‌గానో తయారవుతూ వుంటారు.

వీళ్ళ మంచి గుణాలని ఈ విధంగా నిర్దేశించవచ్చు. నమ్మకస్తులు, సలహాలు చెప్పే సామర్థ్యం గలవాళ్ళు, వాస్తవ దృక్పథం, ఎంత దగ్గరగా వుంటే అంత దూరం మెంటైన్ చెయ్యటం, కాస్త గర్వం,

సంపూర్ణమైన ఆనందాన్ని అనుభవించటం, నిష్పక్షపాతమైన గుణం, భవిష్యత్తుని ఊహించటం - గుణాలు కలిగివుంటారు.

అలాగని చెప్పి వీళ్ళలో కొన్ని బలహీనతలు కూడా లేకపోలేదు. మిగతావాళ్ళకి వ్యతిరేకంగా ఆలోచించడం, అవసరమైన దానికన్నా ఎక్కువగా ఆలోచనలు, ధృఢంగా వుండటం కన్నాఎక్కువ రిజిడ్ గా వుండటం, స్పందనలేకపోవటం - వీరి బలహీనతలు. అందరూ ప్రకృతిని ఆరాధిస్తుంటే వీళ్ళు న్యూటన్ గురించి ఆలోచిస్తారు. అలాగే వీళ్ళకి సెంటిమెంట్స్ కూడా తక్కువ. వీళ్ళని ప్రేమించడం అవతల వారి దురదృష్టం. ప్రేమని కూడా వీళ్ళు కేవలం ప్రాక్టికల్ గానే చూస్తారు. మిగతా ప్రపంచం వేరు తాము వేరు అనే భావన కలిగి వుంటారు. అహంభావానికి ఇది మొదటిమెట్టు.

పై మూడు వర్గాల్లోకి ఈ వర్గంలోని వారే చివరికి తమని అభిమానించే వాళ్ళకి, ప్రేమికులకి, సరియైన సలహాలు ఇవ్వటంలోనైతే నేమి, వాళ్ళతో ప్రేమించబడటంలో అయితేనేమి అగ్రగాములుగా నిలుస్తారు. ఎందుకంటే నిజం అనేది మొదట్లో బాధపెట్టినా, చివరికి గమ్యానికి చేరుస్తుంది కాబట్టి.

# 3. అక్షరాల పొడవు:

మనం ఏదైనా ఒక రచన చేస్తున్నప్పుడు లేదా ఒక ఉత్తరం వ్రాస్తున్నప్పుడు అది పూర్తవగానే ఒకరకమైన సంతృప్తి కలుగుతుంది. ఒక కార్యాన్ని పూర్తిచేసే మన్న సంతృప్తి అది. మొదట్లో ఎంతో బాగా మొదలుపెట్టిన అక్షరాలు చివరికొచ్చేసరికి చాలా గజిబిజిగా తయారవొచ్చు. ఇది మన తొందర తనాన్ని తెలియజేస్తుంది. అయితే ఇదే విధమైన తొందరతనం మనకి ప్రతీ వాక్యంలోను, ప్రతీ అక్షరంలోనూ కనిపిస్తుంది. ఒక అక్షరం వ్రాసినప్పుడు దానికి తలకట్టు ఇవ్వడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తే అది మన తొందరతనాన్ని తెలుపుతుంది. అదే విధంగా ఒత్తు బలంగా ఇస్తే అది మన యొక్క మనస్తత్వాన్ని మరోరకంగా సూచిస్తుంది. అందువల్ల తలకట్లు, ఒత్తులు బట్టి కూడా మన మనస్తత్వాన్ని మనం విశ్లేషించుకోవచ్చు.

ప్రతీ అక్షరానికి మూడు 'జోన్స్' వుంటాయి. ఉదాహరణకి 'భ' అనే అక్షరం తీసుకుంటే ఒకతలకట్టు, ఒక ఒత్తు, మధ్యలో 'బ' అనే అక్షరం వున్నాయి. తలకుట్టుని అప్పర్‌జోన్ అని, ఒత్తుని లోయర్‌జోన్ అని, 'బ' అక్షరాన్ని మిడిల్ జోన్ అని అంటారు. కొంతమంది అక్షరాలు మామూలుగా వ్రాసి తలకట్లుపెద్దవిగా ఇస్తారు. మరికొందరు అక్షరాలు పెద్దవిగా వ్రాసి తలకట్లని మాత్రం చిన్నవిగా ఇస్తారు. ఇదే విషయం ఒత్తులకు కూడా వర్తిస్తుంది. ఈ క్రింది మూడు చేతి వ్రాతలను గమనించండి.

తేటతెనుగు అనుపల్లవి కి పంపిన నా
రచనకి పడమటి కోయిల పల్లవి పుస్తకంలో

ఆనందం తో యుద్ధం చేసి గెలిచిన
విషాదం ... హృదయ వనాన్ని దహిస్తూ

భావనా స్ఫూరిత ప్రభావ స్ఫూర్త కార్యే

మీ చేతివ్రాత ఏ విభాగానికి చెందుతుందో తెలుసుకొని దాన్ని బట్టి మీ మనస్తత్వాన్ని అంచనా వేసుకోండి.

1. అన్ని విభాగాల్లోనూ సమంగా, చిన్నప్పుడు కాపీ పుస్తకాలను వ్రాసే విధంగా వ్రాసేవాళ్ళు సాధారణంగా నెమ్మదస్తులై వుంటారు. తమని తాము తక్కువ చేసుకొనే అభిప్రాయం కూడా కొంత వుంటుంది.

2. తలకట్లకి, ఒత్తులకి ప్రాముఖ్యత ఇవ్వకుండా మధ్య అక్షరాలకే ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చే వాళ్ళు సాధారణంగా తర్కానికే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చే వాళ్ళై వుంటారు. వీళ్ళు ఎక్కువ వర్తమానం, భద్రత, వాస్తవం, కృషి పట్టుదల మొదలైన మంచి గుణాలను ఆపాదించుకున్న వాళ్ళై వుంటారు. వీళ్ళకి మిగతా వాళ్ళని డామినేట్ చెయ్యాలనే గుణం వుంటుంది. విమర్శలను సాధారణంగా ఎదుర్కోలేరు. తాము నమ్మినదే మంచిదనే సిద్ధాంతం కలిగి వుంటారు. వీళ్ళ దృష్టి సామాన్యంగా నాలుగువేపులకు సాగకుండా తాము చేసే పని మీదే నిలిచివుంటుంది. ఒత్తులకు, తలకట్లకు ప్రాముఖ్యత ఎక్కువ ఇవ్వకుండా మధ్య అక్షరాలను మాత్రం ఎక్కువ గుండ్రంగా వ్రాసేవాళ్ళు ఎమోషనల్‌గానూ, కొంత ద్వైదీ భావం గల వాళ్ళగాను వుంటారు. ఈ ప్రపంచంలో గొప్పగొప్ప వాళ్ళందరూ సాధరణంగా ఈ విభాగానికే చెందినవాళ్ళు).

3. అక్షరం వ్రాసి దానికింద ఒత్తులు తలకట్లు బాగా పొడవుగా ఇచ్చేవారు న్యాయానికి, సమాజానికి, మంచికి ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చేవాళ్ళై వుంటారు. వీరికి కాసింత వేదాంత ధృక్పధం కూడా వుంటుంది. దానికి తోడు తమమీద తమకి అవసరమైన దానికన్నా ఎక్కువ నమ్మకం కూడా వుంటుంది. ఎప్పుడూ తమని తాము ఆత్మ విమర్శ చేసుకుంటూ గడపటానికి ఇష్టపడతారు. కొద్దికొద్దిగా వేదంవైపు మొగ్గుచూపుతారు. తలకట్లు గుండ్రంగా తిప్పడం అలవాటుగా వున్న వాళ్ళు ఎక్కువ కల్పనాశక్తి కలిగినవాళ్ళై వుంటారు.

తలకట్టుని కొంచెం కుడివైపుకి వంచి వ్రాసేవాళ్ళు ఒక ధృఢమైన గమ్యం వైపు సాగడానికి తగిన మానసిక శక్తి వున్న వాళ్ళైవుంటారు. అలాకాకుండా తలకట్టు పైకివెళ్ళి కాస్త ఎడమవైపుకి తిరిగితే, తమని ఎప్పుడూ ఎవరో ఒకరు ప్రేమించాలని వారికే తమ ప్రేమనంతా సమర్పించుకోవాలనే సున్నిత మనస్కులై వుంటారు.

తలకట్లకీ మధ్య అక్షరాలకి ప్రాముఖ్య నివ్వకుండా కేవలం ఒత్తులకి మాత్రమే ప్రాముఖ్యత నిచ్చేవాళ్ళు సాధారణంగా ఎంత సాధించినా సంతృప్తి చెందనివాళ్ళు, ఇంకా సాధించాలనే కుతూహలం కలవాళ్ళు అయివుంటారు.

వీరు ఎక్కువగా మెటీరియలిస్టులై వుంటారు. శృంగార పరమైన కోర్కెలు మనసులో ఎన్నివున్నా బైటపెట్టక తమలో తామే మధనపడుతూ వుంటారు. వీరు అక్షరాలకి పెట్టే ఒత్తులు ఎక్కువ ఎడమవైపునకు వంగితే, గత కాల జీవితపు ప్రభావం నుంచీ ఇంకా బైటపడని వారై వుంటారు. తమ గతాన్ని ఆధారం చేసుకొని భవిష్యత్తు నిర్మించటానికి కుతూహలం చూపిస్తారు.

(మీ చేతి వ్రాత పై మూడు విభాగాల్లో దేనికి చెందుతుందో తెలుసుకోవాలనుకుంటే, ఇంతకు ముందెప్పుడో వ్రాసిన మీ చేతివ్రాత కాగితం తీసుకొని పెన్సిల్‌తో మూడు గీతలు గీయండి. మధ్య అక్షరం మధ్యలో వుండేటట్లు, తలకట్టుపైన వుండేటట్లు, ఒత్తు క్రింద వుండేటట్లు మీజోన్స్ నిర్మించుకోవాలి. దాన్ని బట్టి మీరు ఏకేటగిరికీ చెందుతారో నిర్ణయించుకోవాలి)

# 4. అక్షరాల వెడల్పు:

పై రెండు చేతివ్రాతలను గమనించండి. కొందరు దగ్గరదగ్గరగా తక్కువ స్థలంలో ఎక్కువ మేటర్ పట్టేవిధంగా అక్షరాలను వ్రాస్తారు. మరికొందరు అక్షరాలని పాగదీసి వ్రాస్తారు. మీరు ఈ రెండిట్లో ఏ విభాగానికి చెందుతారో నిర్ణయించుకోండి.

## మొదటి రకం:

అక్షరాలు దగ్గర దగ్గరగా ముఖ్యంగా '' పొడవుగా '' వ్రాసేవారు క్రమశిక్షణగా వున్నావాళ్ళు, సిగ్గు ఎక్కువగా వున్నవాళ్లు, డబ్బు విషయంలో పొదుపరిగానూ అయి వుంటారు.

— చాలామందికి ఇంద్రధనస్సు అంటే ఇష్టం. అది కనిపిస్తే కేరింతలు కొడతారు. కొంతమంది చిత్రకారులు దానిని అద్భుతంగా గీస్తారు. ప్రకృతి ఆరాధకులు వాటి కోసం ఆకాశం కేసి చూస్తారు. కానీ, మీరు మాత్రం నివశించేదే ఇంద్రధనస్సుమీద.

— మీకులోకం ఆనందంగానూ, రంగురంగుల ఊయల గానూ కన్పిస్తుంది.

— వేరొకరికి జోలికి వెళ్ళకుండా మీ జీవితం మీరే జీవించాలనదే మీ తిరుగులేని అభిప్రాయం.

— తమాషా ఏంటంటే మీరు పూర్తిగా భావుకులు కారు. ప్రపంచంలోని మంచి చెడ్డలు మీకు బాగా తెలుసు. ఒక విషయాన్ని క్షుణ్ణంగా తెలుసుకోవటంలో మీకన్నా సమర్థులైన వారు లేరని చెప్పొచ్చు.

— సాంప్రదాయాలకు అనుగుణంగా నడవటానికి మీరు ఇష్టపడరు.

— సాంప్రదాయవాదులైన, పెద్దలను మీ అతినాగరికపు పనులతో ఆశ్చర్యపరచటం మీకెంతో సరదా.

— మీ చుట్టు పక్కల వాళ్లందరినీ మీరు స్నేహితులుగానే భావిస్తారు.

— మీరు ఎంత ప్రాక్టికల్ అంటే, మీ ప్రేయసి /ప్రియుడు నుండి శాశ్వతంగా విడిపోయే సమయంలో కూడా 'మనం స్నేహంగా వుండలేమా' అని అడిగే మనస్తత్వం మీది.

— మీ ప్రేమ ఫలించకపోతే అతి నిజాయితీ పరులుగా పార్వతో / దేవదాసులైపోరు. మీ పరిశోధనా జిజ్ఞాసను ఆకట్టుకొనే అమ్మాయి లేదా అబ్బాయి కనిపించగానే, పాతవిషయాలను మరిచిపోయి, మళ్లీ (నిజాయితీగా!) ప్రేమలోపడతారు.

— మీ ప్రేయసికి ఒక విషయంలో మీపై కోపం రావచ్చు. ఎందుకంటే మీరు ఆవిడపట్ల ఎంత ఆసక్తి చూపుతారో అంతే ఆసక్తిని మీ ఇంటికి న్యూస్‌పేపర్ తెచ్చే అబ్బాయిపైన, ధర్మం చెయ్యమని వచ్చే పేదరాలిపైన కూడా చూపుతారు.

— ఇష్టమైన అభిరుచి అంటూ ఏమీ వుండదు. రాజకీయాలు మిమ్మల్నెంతగా ఆకట్టుకుంటాయో, ఆటలు కూడా అంతే

ఇష్టపడతారు. ర్యాకెట్లో చంద్రమండలంకి వెళ్ళేవారు. గుర్రం నడిపేవాడు, ఒకనటుడు, సంగీతం వాయించేవాడు - ఒకటేమిటి ప్రపంచంలో అన్ని విషయాలు మిమ్మల్ని ఆకర్షిస్తాయి. మిమ్మల్ని ఇష్టపడేవారు సాధారణంగా మిమ్మల్ని అర్ధంచేసుకోడానికి చాలా కష్టపడతారు. మీకు ఏ అభిరుచిలో అయినా ఇమడ గలిగే శక్తి వుంది.

— కొద్ది మందికి చెడిపోవడం బాగా చేతనవుతుంది. కొందరికి బాగుపడటం తెలుస్తుంది. కానీ, మీకు చెడిపోవటం ఎంత బాగా తెలుసో బాగుపడడం కూడా అంతే బాగా తెలుసు.

— అపురూపమైన ఏదో ఒక గొప్పతనం మీ ప్రతి చర్యలోనూ ఏదో రూపంలో చోటుచేసుకుంటు వుంటుంది. (మీకు నచ్చిన విషయాలన్నిట్లో మీరు ప్రవేశించి, ఎందులో మీ ప్రజ్ఞను నిరూపించుకోగలరో నిర్ధారించుకొని ముందడుగు వేస్తే జీవితంలో మీరు కోరుకొన్న సుఖాలు, సౌఖ్యాలు మీ ముంగిట నిలుస్తాయి. మీరు చేయవలసిందల్లా మొహమాటం లేకుండా ప్రవేశించటమే)

— మీరు కొన్త పిరికివారే అయినా, దాన్ని ఎక్కడా బైటపడనివ్వరు. కాబట్టి వీలైనంతగా అదే రకమైన జీవితం గడపడం మంచిది.

— మీకు జ్ఞాపకశక్తి ఎక్కువగా వుంటుంది.

— విమర్శలని ఏమాత్రం సహించలేరు. ఉదాహరణకి ఒక పెద్ద పర్వతాన్ని ఎక్కి జెండా పాతబోయే సమయంలో "ఇంట్లో భార్యకు చీరకొనివ్వలేదుగాని, ఇక్కడకొచ్చి ఎవరెస్ట్‌మీద జెండా పాతుతున్నాడురా" అని మీ పోటీదారుడెవరైనా వెక్కిరిస్తే వెంటనే ఆ పర్వతం దిగడం ప్రారంభించేస్తారు. మీ విజయానికి గుర్తుగా జెండా పాతాలనే ఉత్సాహం అప్పుడే చచ్చిపోతుంది. మీరు ఆడవారైతే మీ స్నేహితురాలు 'ఈ చీరె నీకు బాగోలేదే' అంటే ఆ చీరె పెట్టె అడుక్కి వెళ్ళి పోవల్సిందే.

— వింత వింత కలలు కంటూ నిద్రపోవడం, వాటి గురించి దిగులు పెట్టుకోవటం కూడా మీ ప్రవర్తనలో సర్వసాధారణం.

— ఏదో జరగబోతుంది అని మీరు అనుకున్నారంటే, సర్వసాధారణంగా నూటికి ఏభైసార్లు అది జరుగుతుంది. ఉదాహరణకి మీ అబ్బాయి బైక్‌మీద బైటకు వెళ్తున్నప్పుడు మీరు వెళ్ళొద్దు అని చెప్తే వెళ్ళకపోవటమే మంచిది. ఎందుకంటే ముందే చెప్పినట్లు ఆక్సిడెంట్ అయ్యే ఛాన్సు ఏభై శాతం.

— మృదు సంభాషణలు కొనసాగించడానికి ఇష్టపడేమీరు, అపారమైన జ్ఞాన సంపదని మీ స్వంతం చేసుకోడానికి కృషి చేస్తారు.

— మీ న్యాయ నిర్ణయాలు తిరుగులేనివి. పక్షపాతం చూపెట్టైనా సరే ఇతరులకు అన్యాయం చేయలేరు.

— మీలో ఎంత విశ్లేషణా పటిమ వున్నప్పటికీ, పరిస్థితులకు వెంటనే స్పందించడం మీ మంచి తనానికి నిదర్శనం.

— ప్రతీ విషయాన్నీ విశ్లేషించి, ఆ తర్వాత నిర్ణయం తీసుకోవాలి అనే గుణం కాదు మీది.

— ఒక్కొసారి దగ్గర వాళ్ళకి కూడా మీకు సంబంధించిన విషయాలు తెలియకుండా మీరు జాగ్రత్తపడతారు. మరోసారి మీకెవరో తెలియని వ్యక్తుల దగ్గరకూడా మీరు చేసిన తప్పుల్ని నిజాయితీగా ఒప్పుకుంటారు.

## రెండవరకం :

అక్షరాలు వెడల్పుగాను తేలికగానూ వ్రాసేవారు తమమీద తమకి నమ్మకం ఎక్కువైన వాళ్ళయి వుంటారు. సాధారణంగా ఒక సీట్లోంచి మరోసీట్లోకి మారుతూ అందరిలోనూ కలివిడిగా మాట్లాడే వారై వుంటారు.

పేక ముక్కలతో సరదాగా పది అంతస్థులు కట్టి, చివర్లో చిటికెవేసి కూలదోసి ఆనందించాలనే మనస్తత్వం వీరిది. తమమీద తమకి అంత నమ్మకం అన్నమాట. మీరు జీవితాన్ని చాలా తేలికగా తీసుకుంటారు.

— మీలో గొప్పగుణం 'స్పాంటేనిటీ' ఎవరైనా ఏదైనా మాట్లాడినప్పుడు వెంటనే తడుముకోకుండా, ఒక జోక్‌గాని, హాస్యోక్తిగాని వెయ్యటం వెన్నతో పెట్టిన విద్య.
— మీతో స్నేహం చేసుకోవాలని చాలా మంది ఉవ్విళ్లూరుతూ వుంటారు.
— మీ వైపు సముద్రం ఉప్పెనలా వస్తున్నా ఇంకోవైపు తిరిగి చదరంగం ఆడుకోగల మనస్తత్వం మీది.
— మీ మృదువైన మాటలు నలుగురినీ ఆకర్షిస్తాయి. మీరు వీలైనంతవరకూ తెలివి తక్కువగా వుండటానికి ప్రయత్నిస్తారు. మీలో వున్న తెలివితేటలను (మిగతా వాళ్ళలాగా) అవసరం లేనప్పుడు కూడా, ఎల్లప్పుడూ ప్రదర్శించడానికి ఇష్టపడరు.
— మీరు సమయానికి చాలా మంచి విలువనిస్తారు.
— బస్సులో రూపాయిన్నర టికెట్టు కోసం రెండు రూపాయిలిచ్చి 'చిల్లర వద్దులే' అనే స్వభావం కాదు మీది.
— ఏ విషయంలోనైనా కచ్చితంగా వ్యవహరించటం మీకు ఇష్టం.
— శుభ్రంగా వుండటం కూడా మీ నిత్యావసరాలలో ఒకటిగా భావిస్తారు.
— ఒక సాయంత్రం పార్టీ వుంటే, ఆ పార్టీకి వెళ్లటం కన్నా ఆఫీసులో కూర్చొని పని పూర్తి చెయ్యటం మంచిదిగా మీరు భావిస్తారు.
— మీకు పగటిపూట కలలు కనడానికి తీరికుండదు. రాత్రిపూట అదృష్టదేవత కోసం ఆలోచించే ఓపికుండదు. స్వశక్తినే నమ్ముకుంటారు.
— మీరు దేని గురించో బాధపడుతునట్లుగానో, సమస్యలతో సతమతమైపోతున్నట్లుగా కనిపించడానికి ఆసలిష్టపడరు.
— విచారించడం అన్నది మీ స్వభావం కాదు.
— మీరెంతో విజాయితీ పరులు. మిమ్మల్ని నేను కూడానమ్ముతాను.
— మీకిష్టం లేని పనులు చెయ్యవలసివచ్చి నప్పుడు మాత్రం అబద్ధాలు ఆడటం గానీ, ఆఖరికి మీ అమ్మమ్మ, నానమ్మ తద్దినాలని చెయ్యడం గానీ చక్కగా నటించగలరు.

— ప్రేమ గుడ్డిది అన్నవిషయం మీకు వర్తించదు. మీ ప్రేమికుల తప్పొప్పులను చూపించటానికి మీరు వెనుకాడరు.
— స్నేహం అంటే ప్రాణం పెట్టేమీరు, స్నేహితులు మిమ్మల్ని నిర్లక్ష్యంగా చూడటాన్ని ఎన్నటికీ సహించరు.
— నిర్లక్ష్యం, తెలివిలేని తనము, చెడుస్వభావం మొదలైన వాటిని మీరు అసహ్యించుకున్నంతగా మరెవరూ అసహ్యించుకోరు.
— మీరు చాలా వరకూ నెమ్మదస్తులు, మర్యాదస్తులు. కానీ, ఒక పాయింట్ దాటిన తర్వాత చాల రెచ్చిపోయి నెర్వస్‌గా ప్రవర్తిస్తారు.
— మీలో జాలీ, సమర్థత సమపాళ్ళలో వుండటం వల్ల డాక్టర్లగానో, కామర్స్‌వైపో మంచి పేరుతెచ్చుకుంటారు.
— మీరు మొహమాటస్తులవటం వల్ల చిన్న విషయాలకి కూడా బాధతప్పదు.
— మీరు చాలా పొదుపరులనే చెప్పాలి. మీరు లేని వాటితో కష్ట పడటం కన్నావున్న వాటిలోనే జీవించడానికి ఇష్టపడతారు. అందువల్ల, ఎక్కువ ఖర్చుకి వెనుకాడతారు.
— "ఇతరుల తప్పులను గుర్తుపట్టేనంతగా మీరు మీ తప్పులను తెలుసుకోరు" అన్న గట్టివిమర్శ మీపై వుండనే వుంది.
— తెలిసీ తెలియకుండా ఇతరులు మీ గురించి విమర్శచేస్తే మీకు విపరీతమైన కోపమొస్తుంది. అయినా బయటపడరు.
— మీలో స్వతంత్రం పట్ల మక్కువ ఎక్కువ. విశాలమైన ఇళ్ళల్లో, హాయిగా జీవించాలనే మనస్తత్వం మీది.
— 'LACK OF TACT' మిమ్మల్ని తరచూ బాధపెడుతూ వుంటుంది. మీ యొక్క నిర్మొహమాటం అవతల వారిని బాధపెడుతుంది.
— ప్రతిదాన్ని తేలికగా నమ్మే స్వభావం మీది. ఇది కూడా మిమ్మల్ని అప్పుడప్పుడు ఇబ్బంది పెడుతుంది.
— నిర్లక్ష్యం, ఆడంబరత్వం, కంట్రోల్ లేకపోవటం, అవతల వాళ్ళ దృష్టి మీమీద పడాలన్న తపన, పొగడ్తలకి లొంగిపోవటం - మీరు అధిగమించవలసిన బలహీనతలు.

# 5. అక్షరాల ఒద్దిక :

ప్రతీ అక్షరాన్ని ఒద్దికగా వ్రాసి, పదాంకీ పదాంకీ మధ్య ఖాళీ సరిగ్గా వుంచి, పేజీకి సమాంతరంగా వాక్యాలు వ్రాస్తే వాళ్ళు నాయకత్వ లక్షణాలు కలిగి వుంటారు. అలాగని చేతివ్రాత సరిగాలేనివాళ్లు, మార్జిన్స్ సరిగా వదలలేనివాళ్ళు, తక్కువ అని కాదు. ఈ రెండు మనస్తత్వాలని, వ్యక్తిగత గుణాలని పరిశీలిద్దాం.

అక్షరాలని ఒద్దికగా వ్రాసేవాళ్ళు :-

— వీరు సమస్యని కూలంకషంగా పరిశీలించి నిర్ణయాలు తీసుకోగలరు.
— క్రమశిక్షణకి మారుపేరు. శుభ్రతపట్ల కూడా అవగాహన కలిగి వుంటారు.
— సాధారణంగా తెలివితేటలున్న వారైనా సరే, వాటిని బైటికి ప్రకటించటానికి ఎక్కువ ఇష్టపడరు.
— వీరికి నాయకత్వ లక్షణాలు ఎక్కువగా వున్నసరే, కొంత ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ వుంటుంది. అది విడిచి పెడితే మాత్రం తప్పకుండా గొప్పవాళ్ళైపోతారు.
— వీళ్ళు సాధారణంగా జీవితంలో తొందరగా ముందుకు చొచ్చుకుపోలేరు. కానీ, అత్యున్నత స్థాయికి చేరుకుంటారు. రిస్క్ తీసుకోవటం వీరికి అంత ఇష్టముండదు.

## అస్తవ్యస్థ చేతివ్రాత :

'అక్షరాల'కి ఇవ్వవలసినంత గౌరవం ఇవ్వకుండా, వాటిని కేవలం తమ మనసులో కలిగే భావాలని చెప్పడానికి మాత్రమే ఉపయోగించే సాధనాలుగా భావించేవారు ఈ చేతి వ్రాతను కలిగివుంటారు.

— వీలైనంత తొందరగా ఆ పనిని పూర్తిచేసుకుందాం అనే ఉద్దేశ్యంలో వుంటారు.
— సమయం చాలా ముఖ్యమైనదిగా భావిస్తారు.
— నిర్ణయాలు కూడా తొందర తొందరగా తీసుకుంటారు.
— ఏదో ఒక రకంగా పైకి వెళ్తే చాలు అనే అభిప్రాయాన్ని కలిగి వుంటారు.

జీవితం పట్ల ఒక విధమైన నిర్లక్ష్యం, ధీమా, స్వంత ఆలోచనలు ఎక్కువగా వుంటాయి.

## బేస్‌లైన్ :

తెల్లకాగితం మీద కాకుండా, గీతలున్న కాగితాల మీద

వ్రాయవలసి వచ్చేటప్పుడు, కొంతమంది అక్షరాలని గీతమీద వ్రాస్తారు. మరికొందరు లైనుకి లైనుకీ మధ్య వ్రాస్తారు. ఈ క్రింది చేతి వ్రాతను గమనించండి.

పైన సూచించినట్లు లైనుకీ లైనుకీ మధ్య వ్రాసే వాళ్ళు నిరంతరం ప్రేమ భావంలో వుంటారు. ప్రేమించటంగానీ, ప్రేమింపబడటం గానీ, ప్రేమలో తనకొక గుర్తింపు రావాలని గానీ వీళ్ళు ఊహిస్తూవుంటారు. ఒక గమ్యాన్ని సాధించటానికి అవసరమైన దానికన్నా ఎక్కువ కష్టపడతారు.

లైనుకి లైనుకీ మధ్య కాకుండా, ప్రతీ అక్షరాన్ని లైనుకి దగ్గరగా వ్రాసేవాళ్ళు ఎప్పుడూ ఒంటరితనం ఫీలవుతూ వుంటారు. వీరికి సమాజం పట్ల, జీవించేవిధానం పట్ల ఒక నిర్దిష్టమైన అవగాహనవున్నా, ఎవ్వరూ అర్థం చేసుకోవటం లేదు అని ఫీలవుతుంటారు. ఒకరిమీద ఆధారపడే మనస్తత్వం కొద్దిగా వుంటుంది.

తమ చేతివ్రాతకి లైనులున్న పేపర్లు కాకుండా తెల్లకాగితాలమీద

మాత్రమే వ్రాసే అలవాటున్నవారు ఆ మేన్‌స్క్రిప్ట్‌కి వాక్యాల క్రింద పెన్సిల్‌తో గీతగీస్తే, అది వాక్య గమనాన్ని తెలియజేస్తుంది. ఉదాహరణకి ఈ క్రింది రెండు చేతివ్రాతలను గమనించండి.



ఒక పదంలైను మీద వ్రాసి, ఒకపదం లైనునుంచి క్రిందకు దిగి, మళ్లీ ఇంకోపదం లైను మీదికి వస్తే ఆ వ్యక్తి జీవితంలో ఒక అభద్రతా భావంతో బాధపడేవాడై వుంటాడు. అలాగే పైన చెప్పిన రెండో ఉదాహరణలోలాగ అక్షరాలతో అక్షరాలు కలిపేసి వ్రాసేవాళ్ళు తొందర పాటు మనస్తత్వం కలిగివుంటారు. వీటి గురించి తర్వాతి ఛాప్టర్ (అక్షరాం కూర్పు) లో చర్చిద్దాం.

# 6. అక్షరాల కూర్పు:

దీన్ని రెండు రకాలుగా విభజించవచ్చు

కొందరు అక్షరాలని దూరదూరంగా లేదా పదాలని దూరదూరంగా విడివిడిగా వ్రాస్తారు. మరికొందరు వాక్యం మొదలు పెడితే అలా వ్రాసుకుంటూపోతారు. ఈపద్ధతిలో అక్షరానికి అక్షరానికీ మధ్య చిన్నలింక్ కూడా వుంటుంది. దస్తావేజులు వ్రాసేవారి చేతివ్రాతలు ఈ విధంగా వుండటం మనం గమనిస్తాం. పొద్దున్ననుంచి సాయంత్రం వరకు వ్రాసే పనినే వృత్తిగా పెట్టుకున్న వాళ్ళు వీలైనంత వరకూ తొందరగా తమ స్క్రిప్ట్ పూర్తి చెయ్యటానికి ఈ విధానాన్ని అవలంభిస్తూ వుంటారు. వీరు ఒక వాక్యం పూర్తి చెయ్యటానికి ఏ మాత్రం కష్టపడరు. అలాగాకుండా, అక్షరాలని, పదాలని దూరంగా వ్రాసేవాళ్ళు కొందరు పదాలని శిల్పం చెక్కినట్లుగా చెక్కుతారు.

అయిదోఛాప్టర్లో చెప్పిన 'ఒద్దిక' కీ ఆరోఛాప్టర్లో చెప్పిన - 'కూర్పుకీ ' తేడా వుంది.

కొంత మంది ఒద్దిక సరిగా లేకపోయిన కూడా అక్షరాలని దూరదూరంగా వ్రాస్తారు. అవి అందంగా లేకపోవచ్చు. ఇక్కడ ఈ ఛాప్టర్లో మనం గమనించవలసిందల్లా అక్షరానికి అక్షరానికీ మధ్యవున్నతేడా, పదానికి పదానికీ మధ్యవున్న తేడా, అలాగే వాక్యానికి వాక్యానికీ మధ్యవున్న దూరం అంతేతప్ప వ్రాత ఎలా వుందని కాదు.

ఈ క్రింది రెండు చేతి వ్రాతలూ గమనించండి.

నాకు వేరే భావాలు నాకు లేవు.
నాకున్న భావాలు నాకు లేవు.....
నీకున్నాయని నీవనుకునే భావాలు
నీకు లేవు. మన ఇద్దరికీ ఉండాలని

[illegible]

నోట్: మీ చేతివ్రాత ప్రతిలో ఏ రెండు అక్షరాలు కలిసివున్నా చాలు మీరు రెండో విభాగానికి చెందుతారు.

(1)

— అక్షరాలని విడివిడిగా వ్రాసేవాళ్ళు ఎప్పుడూ క్రిందివారిలో తప్పులు ఎంచుతూ వుంటారు.

— జీవితంలో పైకి వచ్చేవారుగాని, వచ్చినవారుగానీ అయి వుంటారు.

— ఒక అక్షరానికి మరో అక్షరానికి మధ్యఎంత తేడా మొదట్లో ఎంత వదులుతున్నారో, అలాగే స్క్రిప్ట్ పూర్తయ్యే చివరివరకూ వదిలితే, సాధారణంగా ఎటువంటి పరిస్థితులలోనూ బ్యాలన్సు తప్పిన మనుషులై వుంటారు. అలాకాకుండా చేతివ్రాత ప్రారంభంలో ఒక విధమైన స్పేసింగ్ ఇస్తూ, తర్వాత అది మారిపోతే, పనిలో ముందుకు సాగేకొద్దీ మరింత ఏకాగ్రతతో పనిచేసే వాళ్ళై వుంటారు. మరోరకంగా చెప్పాలంటే, చేతివ్రాతకన్నా కమ్యూనికేషన్ మీద మీకు ఎక్కువ ఇంట్రస్ట్

కలిగిందన్నమాట. అనవసరమైన విషయాలకి మీరు ప్రాముఖ్యతని వ్వని వ్యక్తులై వుంటారు.

— కొందరు వ్రాత ప్రారంభంలో లైనుకి లైనుకీ మధ్య ఎక్కువ ఖాళీ వదిలి చివరికి వచ్చేసరికి లైనులో లైనుని ఇరికించి వ్రాస్తారు. ఇటువంటి వాళ్ళకి కూడా పై విశ్లేషణే వర్తిస్తుంది.
— పదానికీ, పదానికీ మధ్య ఎక్కువ తేడా వదలడమనేది 16-25 మధ్యవయస్సు వాళ్లలో మనం ఎక్కువగా చూస్తూవుంటాం. 30 ఏళ్ళు దాటిన తర్వాత కూడా వాళ్ళీ విధంగా ఇంకా స్పేస్ వదిలితే, వాళ్ళు మనసులో ఇంకా చిన్న పిల్లలే అన్నమాట.
— ఈ విధంగా కాకుండా ఒక అక్షరంలోకి మరో అక్షరం చొచ్చుకు పోవటం. ఒక అక్షరం తాలుకా దీర్ఘం మరో అక్షరంలోకి కలిసి పోవటం మనిషి యొక్క అస్థిర భావాన్ని సూచిస్తుంది. ఇటువంటి వాళ్ళు అవతల వాళ్ళు ప్రభావానికి తొందరగా లోనవుతారు.

(II) గొలుసువ్రాత :

— మీరు లాజిక్ కి ఎక్కువ ప్రాముఖ్యతనిస్తారు.
— మంచి మాటకారి అయివుంటారు.
— ఏ విషయం పట్ల అయినా తొందరగా అవగాహనికి వచ్చే శక్తి కలిగి వుంటారు.
— అమాయకమైన నవ్వు అమితమైన స్నేహాన్ని ఆకాశించే స్వభావం మీ వ్యక్తిత్వానికి పట్టుగొమ్మలు.
— మీరు అన్యాయాన్ని, అక్రమాన్ని జరిగిన చోట ఖండించడంలో మొదటివాళ్ళు. అభిప్రాయాలను చెప్పటానికి మొగమాటపడరు. వీరు నమ్మిన సిద్ధాంతాన్ని వ్యతిరేకించేవాళ్ళను అతి భయంకరంగా ఎదుర్కోవటమే కాకుండా అవసరమైతే తెగతెంపులకి సిద్ధపడతారు.
— చేతిలో మిషన్‌గన్ పట్టుకుని వున్న మనిషైనాసరే, పట్టుపరికి ణీలోమెరిసి పోతున్న అమ్మాయి అయినా సరే మీకు ఇబ్బంది కలిగిస్తే మాత్రం 'మీ వల్ల నాకు కష్టం కలుగుతోంది' అని

స్పష్టంగా చెప్పేస్తారు. అలా చెప్పటం వల్ల వచ్చే కష్టనష్టాలకు తర్వాత బాధ పడ్డా అసహనాన్ని మాత్రం అణచుకోలేరు.

— ఉన్నది వున్నట్లుగా తెలుసుకోవటానికి, తిరిగి చెప్పటానికి మీరు ఇష్టపడతారు.

— చిన్న పిల్లలు ఎలాగైతే తమకు కావలసినది పొందటానికి అల్లరిచేసి అరిచి గీపెడతారో, మీరు కూడా వీరికి అవసరమైనవి పొందటానికి కొంచెం అటూఇటూగా అవే పద్ధతులిని అనుసరిస్తారు. అయితే కావలసినది పొందటానికి అడ్డదార్లు తొక్కటం మీ స్వభావం కాదు.

# 7. ఒత్తిడి:

కొన్నికలాలు మనకి విపరీతంగా నచ్చుతాయి. కొన్ని కలాలని మనతోపాటు జీవితాంతం వుంచుకోవాలను కుంటాం. కలం సరిగ్గా వ్రాయకపోతే రచన చేసే మూడ్ పోవడం కూడా నాకు అనుభవం. మనం ఎన్నుకున్న కలాల నిబ్ మీద కూడా మన మనస్తత్వం ఆధారపడివుంటుందంటే అందులో ఆశ్చర్య పోవలసిందేమీ లేదు. కొంతమంది లావుగా వ్రాసేకలాన్ని ఇష్టపడితే మరికొందరు సన్నగా వ్రాసే దాన్ని ఇష్టపడతారు.

అదే విధంగా కొందరు కలాన్ని బాగా ఒత్తి వ్రాస్తారు. మరికొందరు తేలికగా వ్రాస్తారు. బాల్‌పాయింట్ పెన్ వాడుకలోకి వచ్చాక ఈ వత్తి వ్రాయటం అనేది ఎక్కువైంది. మనం ఎంత ఒత్తిడితో వ్రాస్తున్నామనేది మనమే నిర్ణయించుకోవాలి. దాన్ని బట్టి ఈ గుణ గుణాలు ఆధారపడివుంటాయి. చాలా తేలికగా వ్రాసేవారి విశ్లేషణ, బాగా కలాన్ని ఒత్తి వ్రాసేవారి విశ్లేషణ ఈ ఛాప్టర్ లో ఇవ్వడం జరిగింది, ఇంతకు ముందే చెప్పినట్లు ఏరేంజిలో ఒత్తి వ్రాస్తున్నారో పాఠకుడే నిర్ణయించుకొని తన గుణగణాలని అంచనావేసుకోవాలి.

ఈ క్రింద రెండు ఉదాహరణలివ్వబడ్డాయి. ఒకటి ఉత్తర ధృవమైతే, రెండోది దక్షిణ ధృవం. అయితే, పాఠకులందరూ ఈ రెండు కేటగిరీలలోకి చెందరు అనేది నిర్వివాదాంశం. ముందు చెప్పినట్లు తమ రేంజి బట్టి వారే వారి మనస్తత్వాన్ని నిర్ణయించుకోవాలి.

(1) తేలికగా వ్రాసేవారు :

నా బాల్యం బట్టలు విడుస్తోంది
ఎవరో తలుపు తట్టుకొంది!!!

కలాన్ని తేలికగా ఉపయోగించే వాళ్ళు సాధారణంగా ఎక్కువ సెన్సిటివ్‌నెస్ (సున్నితత్వం) కలిగి వుంటారు, మరీ బలహీనంగా, అసలు కలం పేపర్‌కి అంటీ అంటకుండా వ్రాసుకుంటు పోయేవాళ్ళు ఆరోగ్యం విషయంలో కూడా అలాగేవుంటారు. జీవితంలో కూడా ఒక గమ్యం వుండదు, వీళ్ళు ఎక్కువ స్త్రీత్వపు గుణాలు కలిగి వుంటారు.

తాము అనుకున్న దాని పట్ల మొండిపట్టుదల లేకుండా, అవతలివాళ్ళు చెప్పేదాంట్లో ఏదేనా న్యాయం కనిపిస్తే, మార్చుకోడానికి సిద్ధంగా వుంటారు. రోడ్డు మీద వెళ్ళుతూ వుంటే ఎవరేనా బిచ్చగత్తె దానం అడిగితే, పక్కకొట్టుకి వెళ్ళి చిల్లర మార్చి, పదో, ఇరవయ్యో పైసలిచ్చే దానగుణం కలిగివుంటారు.

— వీరిలో గొప్ప క్వాలిటీ ఏంటంటే ప్రతీ చిన్న విషయానికి బాగా అలర్ట్‌గా వుంటారు. శారీరకంగా బలహీనంగా వున్నా మానసికంగా బాగా ఉత్తేజంతో వుంటారు. వాతావరణ మార్పులు తరచూ వీరి ఆరోగ్యం మీద ప్రభావం చూపిస్తూ వుంటాయి, వీరు ప్రతీది న్యాయం జరగాలని ప్రపంచమంతా న్యాయ మార్గంలో నడుస్తుందనే అభిప్రాయంతో వుంటారు.
— దురదృష్టవశాత్తూ వీరిలో చొచ్చుకుపోయే గుణం తక్కువగా వుంటుంది. అలాగే నిరోధక శక్తి తక్కువగా వుంటుంది. అవతలి వాళ్ళు బలంగా వాదిస్తే వాళ్ళ వాదనలకు, ఒత్తిడిలకులోనవుతారు.
— చిన్న చిన్న విషయాలకే కోపం తెచ్చుకోవటం వీరి దుర్గుణం. వీరిని నమ్మి వీరిమీద ఆధారపడటం కూడా కష్టమే. వీళ్ళు మనని మోసం చేస్తారని కాదు. నమ్మకాన్ని నిలుపుకోలేక పోవటం వీళ్ళ బలహీనత.

— వీరు ఒకసారి స్నేహం చేస్తే గొప్పగా అల్లుకుపోతారు. అంతేకాక స్నేహానికి ప్రాణం ఇస్తారు కూడా.
— వీరు సాధ్యమైనంత వరకూ తక్కువ మాట్లాడతారు. కానీ, మాట్లాడటం ప్రారంభిస్తే మాత్రం ఆపరు. (ఇలాంటి చేతి వ్రాత వున్న మీరు మీ భార్యతో కలిసి హోటల్‌కి వెళ్లారనుకోండి. సాధారణంగా, మీరు వెళ్లే హోటల్స్ అన్నీ, పెద్దవై వుంటాయి. పెద్దపెద్ద హోటల్స్‌లో మెనూలో వున్న పదార్థాలన్నిటికీ ఎదురుగా అవి సర్వ్ చెయ్యడానికి ఎంత టైమ్ పడుతుందో కూడా సూచించివుంచుతారు. మీరు ఆర్డర్ ఇచ్చిన తర్వాత చెప్పబడిన సమయం కంటే రెండు నిమిషాలు ఆలస్యం అయితే సహించరు. దురదృష్టవశాత్తూ, మీతో పాటు మీ భార్యకూడా ఆ హోటల్‌కు వచ్చివుంటే ఆమె మనసులో వేయి దేవుళ్లకు మొక్కుకుంటుంది కానీ, ఏం లాభం! అప్పటికే మీరు మేనేజర్‌ని పిలిచి సమయం విలువ గురించి పెద్ద లెక్చర్ ఇస్తుంటారు. ఆ ఆవేశంలో కౌంటర్ పై గొంతులేస్తూ ఆర్డర్ చేసిన పదార్థాలని తినకుండా భార్యతో సహా బైటకు వెళ్లిపోయినా ఆశ్చర్య పోనవసరం లేదు.)
— మీలో వున్న సహనం మెచ్చుకోదగ్గదే అయినా ఇతరుల దగ్గర మాత్రం అసహనమే బైటపడుతూ వుంటుంది.
— అక్షరాలని తేలికగా వ్రాసేవారు ప్రతీ వస్తువుకీ ఒక నిర్దిష్టమైన స్థలాన్ని కేటాయించుకునే వాళ్లై వుంటారు. ఏదేనా ఊరు వెళ్లాల్సి వచ్చినపుడు టూత్‌పేస్ట్‌తో సహా అన్నీ వున్నాయా లేదా అని గమనించుకునే వారైవుంటారు. ఎక్కడేనా హోటల్‌లో దిగగానే ఏ వస్తువు కావస్తువుని ఆయా స్థలాలలో అమర్చుకొని ఆ హోటల్ రూమ్‌ని కూడా ఆ ఒక్కరోజూ తమ స్వంత గదిలాగే భావించే వారై వుంటారు.

## (II) ఒత్తిడితో వ్రాసేవారు :

— ఈ క్రింది వ్రాతను గమనించినట్లైతే, ఒకలావు పాటి నిబ్‌ని ఉపయోగించటం గానీ, కలంతో బాగా ఒత్తి వ్రాసే అలవాటున్న

చేతి వ్రాత గానీ అయి వుంటుందని గమనిస్తాం. మీరు చేతి వ్రాతకోసం ఇంక్ పెన్ను ఉపయోగించక పోతే నిబ్ ప్రసక్తేరాదు. బాల్ పాయింట్ పెన్నుతో వ్రాసేటప్పుడు మీరు ఒత్తి వ్రాస్తున్నారా? అనేది నిర్ణయించుకోవాలి. ఒత్తి వ్రాస్తున్నట్లైతే మీకు ఈ విశ్లేషణ వర్తిస్తుంది.

ప్రేమంటే నువ్వు లేనప్పుడు నవ్వుని నువ్వున్నప్పుడు తాళాన్ని పారేసుకోటం

— మీలో మంచి గుణాలేంటంటే మీరు ఎప్పుడు స్పృహలోనే వుంటారు. పార్టీలో బాగా డ్రింక్ చేసినా, అందరితో కలిసి నవ్వుతూ తుళ్ళుతూవున్నా మీరు మాత్రం చుట్టూ వున్న విషయాలని గమనిస్తూ ఒక అనాలసిస్ నిరంతరం చేసుకుంటూ వుంటారు.

— మీరు మానసికంగా చాలా ధైర్యవంతులు. పట్టుదల గల వ్యక్తులు కూడా. మీమీద మీకు కంట్రోల్ ఎక్కువ. భయం తక్కువ.

— సాధారణంగా మీరు ఆరోగ్యవంతులై వుంటారు.

— ఏ విషయాన్నైనా నాన్చకుండా తొందరగా పూర్తిచేసే వ్యక్తులై వుంటారు.

— మీతో వాదించటం చాలా కష్టం. మీరు నమ్మిన పాయింట్‌ని చాలా స్పష్టంగా అవతలవాళ్ళని కన్విన్స్ చేయటానికి ఉపయోగిస్తారు.

అయితే పూర్తిగా పొంగిపోకండి. మీలో కొన్ని అభిలషణీయం కాని లక్షణాలు కూడా వున్నాయి. మీరు కాస్త ఇరిటేటింగ్ పెర్సనాలిటీ. మీ మనసులో వున్న భావాలని చెప్పవలసి వచ్చినపుడు, నిర్మొహమాటంగా అవతలవాళ్ళు బాధపడతారు అనికూడా ఆలోచించ కుండా చెబుతారు. మీరు ఒక విషయం పట్ల ఒక నిర్ణయానికొస్తే ఆరు నూరైనా దాన్ని మార్చుకోటానికి ఇష్టపడరు.

— మీరు చాలా 'ఎగ్రెసివ్' నెమ్మది, అవతలివాళ్లతో మంచి అనిపించుకోవడం లాంటి వాటికి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వరు. మీరు బైటకి పటాటోపంగా కనబడినా మనసులో మాత్రం చిన్న చిన్న విషయాలకి కూడా భయపడుతూ వుంటారు. బైటకి కన్పించక పోయినా సరే అంతర్గతంగా మీరు చాలా సెన్సిటివ్. కాబట్టి చాలా మంది వ్యక్తులు మిమ్మల్ని అర్థం చేసుకోలేరు.

— కలాన్ని ఒత్తి వ్రాసే వాళ్ళని మొట్టమొదటి సారి చూసినప్పుడు, అవతలి వాళ్ళు తమ రహస్యాలని తెలుసుకోడానికి వారు కృత నిశ్చయులై వున్నారని భ్రమపడతారుగానీ, రెండోసారి చూసిన ప్పుడు ముక్కుకి ఒక అంగుళం క్రింద ఏం జరుగుతుందో కూడా వీరు గమనించక పోవటాన్ని గ్రహిస్తారు.

— పై విశ్లేషణలో కలాన్ని తేలికగా వ్రాసేవాళ్ళు గురించి చెపుతూ వాళ్లు చాలా జాగరూకతలో వుంటారని చెప్పటం జరిగింది కలాన్ని ఒత్తివ్రాసేవాళ్ళు దానికి వ్యతిరేకం. బహుశా, 'ఎలాంటి ప్రమాదం వచ్చినా నేను ఎదుర్కోగలనులే' అనే నిర్లక్ష్యం దీనికి కారణమై వుంటుంది.

— మీరు పొరపాటున చనిపోయి యమలోకానికి వెళ్తే యమ ధర్మరాజుకూడా మీయొక్క వాదనని అడ్డుకోలేక చెవులు మూసుకుంటాడు. మీరు నమ్మిన దాని గురించి అంత గొప్పగా మీరు వాదించగలరు. అలాగని చెప్పి ఎదుటివారి బలహీనతలు కనుక్కొని వార్ని ఇబ్బందిలో పడేసే రకం కాదు.

— తాము నమ్మిన సిద్ధాంతాన్ని అవతల వాళ్లు ఒప్పుకొనే విధంగా కన్వీనియంట్‌గా వాదనలను సమకూర్చుకుంటారు. మీరు మీ విశ్లేషణా పటిమ, హేతుబద్ధమైన ఆలోచనా శక్తి అవతలవారికి దిగ్భ్రమ కలిగిస్తూంటాయి. ఎంత మాట్లాడినా ఎంత ప్రశ్నించి విసిగించినా, చివరికి మీరిచ్చే విశ్లేషణ చూసి 'ఆహా' అని ఆశ్చర్యపోక తప్పదు అవతలివాళ్ళు.

— కేవలం కుతూహలంతో విశ్లేషించటం తప్ప మీకు అవతలవాళ్ల పట్ల ఏ విధమైన అభిప్రాయం వుండదు. నమ్మిన సిద్ధాంతం కరక్టా కాదా అని తెలుసు కోవటమే మీ నిరంతర జీవితాశయం. మీరు అవతల వ్యక్తుల గురించి ఎక్కువగా ఆలోచించరు అని ముందే చెప్పటం జరిగింది.

న్యాయమూర్తు లున్నారనుకోండి. వారు కళ్లకెదురుగా వున్న సత్యాలను సాక్ష్యాలను ఆధారం చేసుకొని న్యాయ నిర్ణయం చేస్తారు. ఈ టైప్ వ్యక్తులు కూడా అంతే. తమకెంతవరకూ కావాలో అంతవరకే ఆలోచిస్తారు. మీరు మీ భార్యను ఇంటిబైటికి తోసి లోపల తలుపు వేసుకున్నారనుకోండి. ఈ కేసు కోర్టుకి వెళ్తే మీది తప్పని మందలించి జరిమానా వేస్తారు, ఈ రకం చేతి వ్రాతగల వ్యక్తులు మీభార్య మీకు అనరిష్టంలేని ఎర్రరంగు చీర కట్టుకోవడం వల్ల మీరు రెచ్చిపోయి అలా చేసారనే మీ బలహీనత పట్ల వాళ్ళు జాలి చూపరు. (పై ఉదాహరణ కేవలం నవ్వుకోవటానికి వ్రాసినది మాత్రమే.)

ఇలాగ పెన్ను బాగా ఒత్తి వ్రాసేవాళ్లని చాలామంది వ్యక్తులు స్నేహ పాత్రులుగా చేసుకోవాలని భావిస్తారు. కానీ వీళ్లు మాత్రం అవతలవాళ్లని ఏ మాత్రం గుర్తించరు. ఒక స్థాయికి చేరి తమ అంతస్తులో వున్న వాళ్లని మాత్రమే వీరు గుర్తిస్తారు.

# 8. వాక్యాల గమనం:

రూళ్లులేని కాగితాల మీద వ్రాసేవాళ్ళు సాధారణంగా కాగితానికి తిన్నగా నేరుగా వ్రాయాలను కుంటారు కానీ, వారి పని ఒత్తిడి, మూడ్ బట్టి ఒక్కోసారి వాక్యాలు పైకి వెళ్ళిపోతూ వుంటాయి.మరోసారి క్రిందకు జారిపోతూ వుంటాయి. దీనిబట్టి కూడా ఆయా వ్యక్తుల మనస్తత్వాన్ని మనం పట్టుకోవచ్చు.

## A. వాక్యాల్ని తిన్నగా వ్రాసే వారు:

వాక్యాన్ని కాగితానికి తిన్నగా తీసుకెళ్ళేవాళ్ళు చాలా నెమ్మదస్తులు. పెద్ద పెద్ద పదవులు మీద ఆశలేనివారు, నీతికి నిజాయితికి కట్టుబడేవాళ్లు అయివుంటారు.

1. సముద్రం మధ్యలో శాంతంగా గంభీరగా నిలిచివుండే రాక్ అఫ్ జిబ్రాల్టర్ లాంటి వ్యక్తి మీరు. త్వరగా ఆవేశపడటం మీ అభిమతం కాదు. అవతల వాళ్ళు మిమ్మల్ని ఎంతగా రెచ్చగొట్టి తమ చూపులతో చేష్టలతో మిమ్మల్ని లొంగదీసుకోవాలనుకుంటారో, మీరంతగా బిగునుకుపోతారు.

2. ప్రశాంతంగా, ఒంటరిగా గడపడం అంటే మీకు ఇష్టం మిమ్మల్ని మీ మానసిక ప్రశాంతతను భంగం చెయ్యనన్నాళ్లు మీరు నెమ్మదస్తులుగా గంభీర స్వభావులుగా కాలం గడుపుతారు. ఏళ్ల తరబడి కొందరు మిమ్మల్ని విసిగిస్తున్నా మీరు భరించగలుగుతారు. మీ ప్రశాంతతకు ఆపు కోలేనంత గాయంచేస్తే అప్పుడు మీలోని కోపం లావాలా ఎగజిమ్మి చుట్టుపక్కల వాళ్లను సర్వనాశనం చేస్తుంది. అనడం కంటే సమూలంగా తుడిచిపెట్టేస్తుంది అనడం సరియైనది.

3. కొంత మందికి ఎంత ఓపిక వుంటుందంటే జీవిత కాలం మొత్తంలో ఒకటి రెండు సార్లు మాత్రమే ఇలా రెచ్చిపోతారు.

4. మీమీ కోపాలకి కారణాలు చాలా వింతగా అనిపించవచ్చు. ఉదాహరణకి ఇంటికి తెచ్చిన ఆఫీసు ఫైల్‌లో ఏదో వ్రాసుకుంటూవుంటే వెనకాలనుంచీ మీపై బిందెడు నీళ్లు కుమ్మరించిన మీ భార్యను మీరు ఏమీ అనకపోవచ్చు. అదే, ఏదో విషయమై వంటింట్లో మీ పిల్లవాడిని మీ భార్య తిడితే మీరు ఆమెపై విరుచుకుపడొచ్చు.

5. మీరు అవసరమైతే తప్ప సాధారణంగా అవతలవాళ్లకి సలహా ఇవ్వరు. మీరు ఏ సందర్భంలోనైనా కంగారు పడటం గానీ, నెర్వస్‌నెస్ ఫీలవటం గానీ చెయ్యరు.

6. మీరు ఒకసారి మీ మాటలతో అవతల వాళ్లని కఠినంగా దండించి నప్పటికీ మంచి చేస్తుందే తప్ప చెడు చేయదు.

7. మీ నెమ్మదితనం మీ చుట్టుపక్కల వాళ్లకి చేతకాని తనంగా అనిపించవచ్చు. మీ పట్టుదల మొండితనంగా అనిపించవచ్చు. కానీ, ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకోండి. మీరేమిటో మీకు కరక్ట్‌గా తెలుసు.

8. మీమీద ఇతరులు వేసే జోకులు లెక్కచేయని మీరు, ఎవరేనా అరటిపండు తొక్కమీద జారిపడితే నవ్వటం ముక్కుమీద పెద్ద మచ్చవుంటే చూసి వెక్కిరించటం లాంటివి చేసి వారికి కోపాన్ని తెప్పిస్తారు. అయితే అవతలవాళ్ల బలహీనతలను చూసి ఏడిపించాలనే సరదా మీకు వున్నప్పటికీ అది మరీ వాళ్లని నష్ట పరచే విధంగా వుండదు.

9. మీరు నిర్దిష్టమైన గమ్యాన్ని ముందే నిర్దేశించుకొని అటువైపు సాగిపోటానికి ఇష్టపడతారు. అమ్మాయిలంటే / అబ్బాయిలంటే మీకు అమితాసక్తి వున్నా మీరు వెంటబడడం కన్నా వాళ్లే మీ వెంట పడటాన్ని ఇష్టపడతారు.

10. ఒక మంచి గృహస్థు (లేదా గృహిణి) అనిపించుకోవటానికి ఇష్టపడతారు మీరు.

11. మహా అయితే తొందరగా నడిచివెళ్ళి గమ్యాన్ని చేరుకోవాలను కుంటారే తప్ప పరుగెత్తాలనుకోరు.

12. మనిషి అన్నవాడికి ధనబలమే కాదు. గుండెబలం కండబలం కూడా వుండాలన్నది మీ ఆశయం అటువంటి వ్యక్తులనే మీరు ప్రేమిస్తారు. దురదృష్టవశాత్తూ మీరు బలహీనులైతే, మీ కొడుకు / కూతురుని హెవీ వెయిట్ ఛాంపియన్‌గా చూడటానికి మీరు ఇష్టపడతారు.

13. ఒకసారి మీరు అనుకున్నవి మీ చేతికి అందాక ఇంకా ఏవో కావాల నుకోకుండా అక్కడితో తృప్తి పడతారు.

14. ఒక అమ్మాయినో / అబ్బాయినో చూసి ఇష్టపడ్డాక ఇక వేరే ఆలోచనలనీ మీ మనసులోకి రానివ్వరు.

15. వాక్యాన్ని మొదలు పెట్టిన దగ్గరనుంచీ స్ట్రయిట్‌గా, తిన్నగా చివరివరకూ తీసికెళ్ళి చేతివ్రాతను అందంగా కాగితంమీద గీతలు గీసినట్లు వ్రాయగలిగేస్త్రీలు చాలా సహనపరులై వుంటారు. ఎంతసహన పరులంటే- మీకొలీగ్‌తో చెట్టాపట్టా లేసుకుంటూ తిరిగే మీ భర్త మీ కళ్ళబడ్డా- ఆమెను మీ కళ్ళముందు ముద్దుపెట్టుకుంటే తప్ప మీకు కోపంరాదు. ఒకసారి వచ్చిందంటే మాత్రం ఆమె, మీ భర్త సమూలంగానాశనం అయ్యారన్నమాటే.

16. మీరు చాలా ఎత్తరి. ఇది మీ మనసుకి సంబంధించినది. శరీరానికి సంబంధించిన మాట కాదు. జీవితంలో ఎన్ని ఆటుపోట్లు ఎదురైనా వాటి ఎత్తుకి వెళ్ళి మళ్ళీ దిగి వాటితో సమానంగా జీవితాన్ని లాగే శక్తి సామర్థ్యాలు గల వ్యక్తులు మీరు.

17. ఇలాంటిచేతివ్రాతగల స్త్రీలు సహజంగా నిజాయితీ కలవారైవుంటారు. మాములు స్త్రీలు అలక, నయగారాలు, సెల్ఫ్‌పిటీ-ఇటువంటివి మీలో కనిపించవు.

18. మీరు అనుకున్నవి సాధించటానికి ఒకోసారి క్రూరంగా ప్రవర్తించే వీలుంది. అయితే మీరు క్రూరులు కారు.

19. మీది గొప్ప ఆత్మవిశ్వాసం. ఇలాంటి ఆత్మవిశ్వాసాన్ని సాధారణంగా మొగవాళ్ళు ఇష్టపడరు. ఓరకంగా మిమ్మల్ని గౌరవిస్తారు.

20. మీరు ఇష్టపడని వ్యక్తుల్ని, వాళ్ళ సిద్ధాంతాలని వ్యతిరేకించడం ద్వారా లేదా అసహ్యించుకోవటం ద్వారా, వాగ్వివాదం సృష్టించుకోవటం ద్వారా కాకుండా తప్పించుకోవటం ద్వారా దూరమౌతారు. మీరు ఒకసారి స్నేహితులను ఇష్టపడితే వారెంత అవకతవక పనులు చేస్తున్న, వారంటే పక్షపాతం చూపుతారు.

21. మీ స్నేహితుడు షోలే సినిమాలో ధర్మేంద్రలాగ ఏ వాటర్‌ట్యాంకో ఎక్కి-అల్లరి చేసినా లేదా అదే సినిమాలో హేమమాలిని లాంటి వసపిట్టో అయినా వాళ్ళు 'మీవాళ్ళు' కాబట్టి వాళ్ళని ఇష్టపడతారు. క్షమిస్తారు. అదే పని మీకు పరిచయంలేని వ్యక్తి చేస్తే చాలా దారుణంగా విమర్శిస్తారు.

22. మీరు ఇతరులని ఎంత ఇష్టపడతారో అంతగా వాళ్ళు స్పందించక పోతే మీలో మీరే ద్వేషాన్ని పెంచుకొని వాళ్ళనుంచి విడిపోతారు.

23. మీరు మీ ఆశయం కోసం త్యాగం చేయరు. అంటేమీరు స్వార్ధపరులనో, నిజాయితీ లేనివాళ్ళనోకాదు. పరిస్థితులకోసం అవసరాలకోసం ఆశయాలను మార్చుకోవాలనే సత్యాన్ని బాగా ఆకళింపు చేసుకొనే తెలివైనవాళ్ళై వుంటారు.

24. ఇటువంటి చేతివ్రాతవున్న స్త్రీలు బాగా చదువుకొని ఆపైన పి.హెచ్.డి చేసినా సరే, భార్యగా ఒక వ్యక్తిత్వమున్న మగవాడితో స్థిరపడటమే తృప్తిగా భావిస్తారు.

## B. వాక్యాలు పైకి వ్రాసేవారు :-

మొదలుపెట్టినపుడు తిన్నగా వ్రాసినా కాగితం చివరి కొచ్చే సరికి - మొదలు పెట్టిన చోటునుంచి వాక్యాలు పైకి వ్రాసేవారు ఎక్సైటెడ్ జీవితం అంటే ఉత్సాహం వున్నవాళ్ళు అయివుంటారు. సాధారణంగా రచయితలూ, వ్రాత పని ఎక్కువగా వున్నవారు ఇలా వ్రాస్తారు. పెన్సిల్‌తో వ్రాసేటప్పుడు కూడా వాక్యాలు ఇలా పైకి పోవడం సంభవిస్తుంది. మొదటి వాక్యం సరిగా మొదలుపెట్టి, పేజీ చివరికొచ్చేసరికి ఎడమవైపుకన్నా కుడివైపు ఖాళీ ఎక్కువవున్నట్లైతే అది వాక్యం పైకి పోవటాన్ని సూచిస్తుంది.


MUNGANDA

1. ఇలా వాక్యాలని చివరికొచ్చేసరికి పైకి వ్రాసేవాళ్ళు చుట్టుపక్కల వాళ్ళపై అధికారం చలాయిస్తారు. ఇతరులు తమ అదుపాజ్ఞలలో వుండకపోవటం వల్ల బాగా నష్టపోతారనేది వీళ్ళ అభిప్రాయం. ఆశ్చర్యంగా ఒక్కోసారి అదే నిజమౌతుంది.

2. ఇతరులు జీవితంలో ఎలా నడుచుకుంటే బావుంటుందో మీరు చెప్ప గలిగినా, వారిపై మీకు వుండే చిన్న చూపువల్ల ఆ ఇతరులు బాధపడే అవకాశముంది.

3. మీ తెలివినీ, మీ ఔదార్యాన్ని ఎవరైనా గుర్తించకపోతే అహంకారం, అభిమానంల స్థానంలో అవమానం, బాధ చోటుచేసుకొని, మిమ్మల్ని వేధిస్తాయి.

4. మీరు కోపాన్ని అదుపులో పెట్టుకోవటంలో అశక్తులనే చెప్పుకోవాలి.

5. ఆతిధ్యం ఇవ్వటంలో మీకు మీరేసాటి.

6. గొప్ప గొప్పవారి సహచర్యం చేసేమీరు, ఆ విషయాన్ని అద్భుతంగా నలుగురికీ తెలియజేస్తారు. ఇది ఒక 'కళ'.

7. కన్నీళ్ళు, జాలి, దయ, క్షమాపణ - ఇటువంటి వాటిమీద మీకు చాలా నీచమైన అభిప్రాయం వుంటుంది.

8. మిమ్మల్ని మీరు రాజు/రాణి గా భావిస్తూ వుంటారు. ప్రేమ విషయంలో కూడా ఇలాగే భావించి అప్పుడప్పుడు దెబ్బతింటారు. ప్రేమకు కావలసింది అర్థం చేసుకొనే మనసే గాని, అజమాయిషీ చేసే గొప్ప మనిషి కాదు అని మీరు అర్థం చేసుకొనే సరికి విఫల ప్రేమికులవటమో లేదా మీ ప్రేయసి / ప్రియుడు వేరొకరిని వివాహం చేసుకోవటమో జరగవచ్చు.

9. జీవితం పట్ల మీకున్న అమితాశక్తి, ఆశావాదం మిమ్మల్ని మెట్ట వేదాంతం బారి నుంచి రక్షిస్తుంది.

10. వేరొకరి సాయం పొందటం మీకు అసలిష్టం వుండదు. వారి ముందు అశక్తులుగా నిలబడటం అనేది మీ యొక్క ఆఖరి చర్య.

11. మీకు సాయం చెయ్యాలనుకొనే వారిని కూడా, మీరు శత్రువులుగా పరిగణించే ప్రమాదం వుంది.

12. ఎంతటి కష్టతరమైన బాధ్యతనైనా సునాయాసంగా భుజానవేసుకొని పూర్తి చేయటమంటే మీకు ఇష్టం.

13. హాస్యాన్ని గానీ, సంతోషాన్నిగానీ ఇష్టపడే మీరు, మీకు ఎదురుతిరిగే వాళ్ళని దూరంగా నెట్టేవేసి, మీ వెంట వచ్చే బంధువులను, స్నేహితులను ఎంతో ప్రేమగా చూసుకుంటూ వారితోనే గడపటానికి ఇష్టపడతారు.

14. పొగడ్తలకు, కృతజ్ఞతలకు మీరు తేలికగా లొంగిపోతారు. అలాగే ప్రేమ విషయంలో మోసపోయే అవకాశం కూడా వుంది.

15. మీరు అద్భుతమైన ప్రేమికులని చెప్పక తప్పదు.

16. మిమ్మల్ని ఆరాధించేవాళ్ళని విడిచిపెట్టడం కన్నా ఆత్మహత్యే మంచిదని భావిస్తారు.

17. మీ భార్య/భర్త మీ ద్వారా గుర్తింపబడాలి కానీ, మీ భార్య/భర్తకు ప్రత్యేక గుర్తింపు లభించటం మీకు ఇష్టం వుండదు. మీరు ఒప్పుకోక పోయినా ఇది సత్యం.

18. మీ భార్య/ భర్తకు మీరే భవిష్యత్తు. ఆమె/అతడు మీ భవిష్యత్తు గురించి బాధపడాలే తప్ప తన భవిష్యత్తు గురించి ఆలోచించకూడదు అని నమ్ముతారు. ఇందులో అహంకారం వున్నా, అవతల వ్యక్తికి భద్రతా భావాన్ని ఇస్తున్నారనేది మాత్రం నిర్వివాదాంశం.

19. నాటకాలన్నా, సినిమాలన్నా ఎంతో మక్కువ చూపించే మీరు లలిత కళల పట్ల కూడా అంతే భావావేశంలో వుంటారు.

20. జూదం, థ్రిల్ ఇలాంటివి మీకు ఎంతో సంతృప్తినిస్తాయి. అవసరం కానిచోట కూడా మిమ్మల్ని మీరు గుర్తింపజేసుకోవటానికి ఎక్కువ ఖర్చుపెడతారు.

21. సరిగా పనిచేయని ఏ వస్తువునైనా, మనిషినైనా (తిరగని ఫేన్, పలకని రేడియో) మీ దారికి తెచ్చుకోవటమంటే మీకెంతో ఇష్టం. మీరు సాధారణంగా మెకానిక్‌గానో, డాక్టర్‌గానో, కంప్యూటర్ ఇంజనీర్‌గానో రాణిస్తారు.

22. అందమైన ఆడవారిని / మగవారిని ఓరకంట చూడటం మీకు ఇష్టం వుండదు. వారిని కావాలనుకుంటే బాగా పరికించి చూసి 'ఆహా ఏమి సౌందర్యం' అన్న వాక్యాలని రాచరికపు ఠీవితో ఉచ్చరిస్తారు. పక్కనే వున్న మీ భార్య/భర్త ఇందుకు తట్టుకోలేక ఉదాసీనంగా వుంటే గుండెనొప్పి లేదా తలనొప్పి అని నాటకం ఆడి మళ్ళీ వాళ్ళని మీ దగ్గరకు రప్పించుకోగలరు.

23. మీరు మంచి తండ్రి/తల్లి గా ప్రవర్తించినా పొగడ్తలకు లొంగిపోయే స్వభావం మీది కాబట్టి, మీపిల్లలు అలాగే గౌరవించినట్టు నటించి మోసగించే అవకాశం వుంది.

24. హాస్యాన్ని మనసారా ఎంజాయ్ చేసే మీరు మిమ్మల్ని ఎవరైనా కాస్త విమర్శించినా ఇట్టే కన్నీరు పెట్టుకోగలరు.

25. తొందరపాటు తనంతో తల్లిదండ్రులకి ఎదురు చెప్పినా వృద్ధాప్యంలో వారికి తోడునీడై నిలవగలరు.

26. మొత్తానికి మీరు విభిన్న మనస్తత్వాల కలయికగా పేరుపొందుతారు.

27. మీలో చెలరేగే బాధనీ, కోపాన్నీ అణచుకోడానికి మీరే ఒకజోకర్ లా నటించగలరు. హృదయం కార్చే కన్నీటిని ముఖం మీద ఆనందబాష్పాలుగా మార్చగలిగే సమర్థులు మీరు.

28. మిమ్మల్ని మీరు అర్థం చేసుకునే కంటే ఇతరులని సులభంగా అర్థం చేసుకోగలరు. నిజానికి మీ చుట్టుపక్కల వాళ్ళ గురించి మీరెక్కువ ఆలోచిస్తారు.

29. ఇతరుల సమస్యల గురించి మీకు తెలియకుండానే బాధపడటం వల్ల మీ సమస్యల గురించి ఆలోచించటానికి మీరు అంతగా ఇష్టపడరు.

30. ఈ పోటీ ప్రపంచంలో అందరితోపాటు మీరు కూడా సమానంగా దేనికోసమో ఆరాటపడుతూ జీవితాన్ని కొనసాగిస్తారు.

31. మీరు మీ కోర్కెలని ఎక్కువగా బైటకి తెలపకపోవటం వల్ల అవతల వాళ్ళు మిమ్మల్ని యోగులు గాను, నిరాశావాదులగానూ అనుకొనే వీలుంది.

32. ముఖ్యమైన విషయాల్లో కాకపోయినా చిన్న చిన్న విషయాల్లో అబద్ధాలు చెప్పి అవతలవాళ్ళు మోసపోయినందుకు ఆనందించగలరు. అయితే ఇలా మోసం చెయ్యటం ఎవ్వరికీ నష్టపరచని విషయమై వుంటుంది.

33. సలహాలకి మీరు బాగా స్పందిస్తారు. ఏరంగంలోనైనా మీకు నచ్చిన మీరు మెచ్చిన వ్యక్తిని మీ నాయకుడుగా ఒకసారి స్వీకరిస్తే, 'రాముడు మంచిబాలుడు' నేను ఏకలవ్యుడిని అన్నట్లు

ఒక అతని అడుగు జాడలలో బుద్ధిగా నడవటానికి మీరు ఏ మాత్రం సంకోచించరు. ఇది మీ అహానికి దెబ్బ అని కూడా భావించరు.

34. మీ జీవిత భాగస్వామి - మీకు బ్రేక్‌ఫాస్ట్‌గా ఓ అందమైన కల, లంచ్‌కి ఒక తెలివైన జోక్, డిన్నర్‌కి మెదడుకి మేత పెట్టగల సమస్య ఇవ్వగలిగితే ఆ భాగస్వామిని మీరు మీ కన్నా ఎక్కువ ప్రేమిస్తారు.

వాక్యాలని క్రిందకి జార్చే వారు:

మొదటిలైను పేజీకి చాలా కరక్ట్ వ్రాసి తర్వాత వ్రాసే కొద్దీ వాక్యాలని క్రిందకి జార్చే వారు సాధారణంగా, జీవితంలో ఎంతకష్టపడ్డా

పైకి రాలేకపోయామే అన్న అభద్రతతో వుంటారు. ఆఖరి వాక్యం ఎడమవైపు ఎక్కువ చోటుండి వాక్యపు ముగింపు పేజీ క్రిందకు జారితే అది నిరాశా వాదాన్ని సూచిస్తుంది.

1. ఒక పని చేయటంలో వుండే పరమార్థం అర్థం చేసుకోవటానికి ప్రయత్నించి, ఓడిపోయి.... వేరొక పనిలో ఆత్మతృప్తి కలుగుతుందేమో నని ప్రయత్నించి.....అలా ప్రయత్నిస్తూ....చంచల స్వభావులుగా పేరు పొందుతారు.

2. ధనాన్నీ, అధికారాన్నీ తృణప్రాయంగా భావించేమీరు పరిస్థితుల అసలు స్వరూపాన్ని అర్థం చేసుకోకపోతే సర్వం కోల్పోయినట్లు ఫీలవుతారు.

3. ప్రయత్నిస్తే మీరు మంచి కళాకారులవుతారు.

4. మర్యాద, మన్నన, మంచినడవడిక ఒకరు నేర్పకుండానే తెలుసుకునే నేర్పుంది మీకు.

5. మీ స్వేచ్ఛకీ, కలల ప్రపంచానికీ అడ్డుతగలనంతవరకూ వేరేవారి ఉనికిని పట్టించుకోకపోవడం మీ మంచి తనమే కాదు మీ బలహీనత కూడా.

6. అవతల వాళ్ళు ఎక్కువగా స్పందించే విషయాలకి మీరు స్పందించరు. ఎయిడ్స్ ఎంత భాధాకరమైన వ్యాధో, ఎంతటి ప్రమాదకరమైన భవిష్యత్తుకి దారి తీస్తూందో గొప్పగా వివరించి చెప్తున్నారనుకోండి మీరందుకు కంగారు పడిపోరు. నెమ్మదిగా తలవూపి జాలిచూపెట్టి, ఆవులిస్తూ అయిందా అన్నట్లు చూస్తారు.

7. కప్పుల కొద్దీ టీ కాఫీలు తాగడమో, లేదా తాగుడికి అలవాటు పడ్డమో కష్టాల నుంచి మిమ్మల్ని ఎక్కువ రక్షిస్తుందన్న అపోహతో ఇలాంటి వ్యసనాలకి లొంగిపోయే అవకాశం వుంది.

8. కష్టాలు మిమ్మల్ని కట్టడి చేస్తే అందమైన కలల ప్రపంచంలోకి జారిపోవాలని ప్రయత్నిస్తారే తప్ప ఆ కష్టాలను తొలగించుకోవాలన్న పట్టుదలను పెంపొందించుకోరు.

9. మీరు ఒక రచయితైతే నెలల తరబడి బార్లలో సమయాన్ని గడిపేస్తూ, కథలకి కావలసిన ప్రేరణ పొందుతున్నామని మిమ్మల్ని మీరు మభ్య పెట్టుకోవచ్చు. నిజానికి మీరు పొందుతున్నది కథలకి కావలసిన ప్రేరణకాదు. అనారోగ్యం, బిల్లులు. ఇది తెలుసుకోడానికి మీకు చాలా కాలం పట్టవచ్చు.

10. బెడ్రూమ్‌లో పడుకొని భవిష్యత్ గురించి ఆలోచిస్తూ గడిపే మీరు మీ భావి కోసం వర్తమానాన్ని చేజార్చుకొనే అవకాశం వుంది.

11. ఎప్పుడూ ఏదోలోకంలో తేలిపోతుండే మీరు మనసులో మాత్రం పరిస్థితులని, కొత్తవారినీ, స్నేహితులనీ విశ్లేషించటంలో మునిగిపోతుంటారు.

12. మీకు కావలసిన సమాచారం రాబట్టటానికి, ఇతరులు చెప్పలేని విషయాలు కూడా సూటిగా అడిగి వారిని ఇబ్బంది పెడతారు. తీరా అసలు విషయం మీరనుకున్నంత క్లిష్టమైనది కాకపోయేసరికి మీరు విసుగెత్తి డీలాపడతారు.

13. మీరు క్వాంటిటీ కంటే, క్వాలిటీనే ఎక్కువ ఇష్టపడతారు. ముఖ్యంగా మీ స్నేహితుల విషయంలో ఇది బాగా వర్తిస్తుంది.

14. మీలో ఎంతటి చంచలత్వం వున్నా, జీవితంపట్ల మీకుండే సదవగాహనవల్ల ఇతరులు మిమ్మల్ని వేలెత్తి చూపలేరు.

15. ప్రపంచంలో బాగా పేరుపొందిన చాలామందిలో మీలాగే చేతివ్రాత కుడివైపున జారిపోవడం అనేది కనిపిస్తుంది.

16. గర్వంగా ప్రవర్తించటం, అతిగంభీరంగా వుండటం మీకునచ్చదు.

17. మీ స్నేహితులలో లక్షాధికారుల నుంచీ, రిక్షాలాగే వాడి దాకా అందరూ వుంటారు.

18. మనసులో కక్షలు పెట్టుకొని ఇతరుల ముందు అవమానించటం లాంటివి మీరు అసలు సహించరు.

# 9. అక్షరాల మధ్య వ్యత్యాసం

దీనినే మరొకరకంగా అక్షరాం మధ్య తేడా అని కూడ అనొచ్చు.

ఒక స్క్రిప్ట్ చూడగానే ఈ చేతివ్రాత బాగుంది అనిపించొచ్చు. అలాగే మరో స్క్రిప్ట్ చూస్తే ఈ వ్రాత బాగోలేదు అనిపించొచ్చు. ఒక స్క్రిప్ట్ బాగుండాలంటే అందులో అక్షరాలన్నీ అందంగావుండాలనే రూల్ ఏమీ లేదు. ఒక స్క్రిప్ట్ బాగోలేదంటే అందులో అక్షరాలన్నీ సమానంగా లేకుండా వుండాలన్న రూల్ కూడా ఏం లేదు. ఉదాహరణకి ఈ క్రింది రెండు స్క్రిప్ట్‌లు పరిశీలించి చూడండి.

Sir, నేను Intermediate [illegible]
[illegible]
[illegible]
College లో [illegible]
[illegible]

[illegible]
[illegible]
నేను చదివి [illegible]
[illegible]

పై రెండు స్క్రిప్ట్‌లు కూడా చూడటానికి అంత బాగాలేవు. కాని మొదటి చేతివ్రాతలో ఒక అక్షరం ఒకలావుంటే మరో అక్షరం సైజు వేరేలావుంది. ఒక అక్షరం పెద్దగా వుంటే మరో అక్షరం చిన్నగావుంది. ఇంకా జాగ్రత్తగా గమనిస్తే ఒకే అక్షరం ఒకచోట ఒకలాగ వ్రాయబడింది. మరోచోట ఇంకోలా వ్రాయబడింది. కానీ, రెండో స్క్రిప్ట్‌లో అన్ని అక్షరాలూ ఒకేలా వ్రాయబడ్డాయి. ఆ స్క్రిప్ట్ చూడటానికి అంత బాగోలేదు. అదివేరే విషయం. కానీ అక్షరాలన్ని మాత్రం ఒకేలాగ వున్నాయి.

ఇప్పుడు మీ చేతి వ్రాతను పరిశీలించండి. మీరు ఒక అక్షరం వాక్యం ప్రారంభంలో ఒకలా వ్రాసి, చివరిలో మళ్ళీ అదే అక్షరం వ్రాయవలసి వచ్చినప్పుడు మరోలా వ్రాస్తే మీరు మొదటి వర్గానికి చెందినవారన్నమాట. అలా కాకుండా ప్రతీ అక్షరం ఏ స్థానంలోనైనా ఒకేలాగ వ్రాస్తే మీరు రెండో వర్గానికి చెందినవారు. ఈరెండు వర్గాలనీ ఇప్పుడు విశ్లేషిద్దాం.

## మొదటి వర్గం వారు:

ఒక అక్షరం పెద్దగా, అదే వాక్యంలో మరో అక్షరం చిన్నగా, లేదా - ఒక అక్షరం ఒకచోట ఒకలా, మరోచోట మరోలా, లేదా - ఒక వత్తు ఒక చోట ఒకలా, మరోచోట మరోలా, లేదా - ఒక గుణింతం పెద్దగా అదే గుణింతం వేరేచోట మరోలా...వ్రాసేవాళ్ళు ఈ వర్గానికి చెందుతారు. ఒకే అక్షరాన్ని వేర్వేరుగా వ్రాసే వారుకూడా ఇదే వర్గానికి చెందుతారు.

1. ఈ వర్గం వ్యక్తులకు దేనికోసమో నెర్వస్‌గా ఫీలవటం, డీలాపడటం, దిగులుపడటం సర్వసామాన్యమైన విషయం.

2. వీళ్ళు తమమీద తమకి ఎక్కువ నమ్మకం కలిగివుంటారు. ఇతరులకోసం బతకటం లాంటివి చేయరు.

3. ఆడంబరంగా తయారవటం కంటె, మామూలుగా కంటికింపైన రంగులు గల దుస్తులు ధరించటాన్నే ఇష్టపడతారు.

4. అలాగే నలుగురిళ్ళకి వెళ్ళి కాలం గడిపేకంటే, ఆ నలుగురూ తమ ఇంటికే వచ్చి కాలం గడపాలని కోరుకుంటారు.

5. పనులు చేయటంలో వీరిని తొందరపెడితే వీరికి అసలు నచ్చదు.

6. కావలసిన దాన్ని కోరి పొందటం కంటే అధికారికంగా అడిగిపుచ్చుకోవడం వీరి అలవాటు.

7. వీరు సహనపరులైనప్పటికీ కోపిష్టిలుగాను, అవసరమైనప్పుడు ఖర్చుపెట్టినప్పటికీ స్వార్థపరులు గానూ పేరు పొందుతారు.

8. ఇలాంటి చేతి వ్రాత వున్నవారు స్త్రీలైతే, భర్త వ్యాపారంలో దివాలా తీస్తే నర్సు ఉద్యోగంలో చేరి నైట్ డ్యూటీ చేసి ఇంటికొచ్చి జ్వరంతో బాధపడుతున్న కూతురు / కొడుకునీ కంటికి రెప్పలా చూసుకోగలను అన్న మానసిక ధైర్యం వీరికి వుంటుంది. నా విధి అంతే అని పరిస్థితులకి లొంగిపోరు. వాటిని తమకు అనుగుణంగా మార్చుకొని ఆనందమయ జీవితం గడపటానికి ఇష్టపడతారు.

## రెండవ వర్గం వారు :

మొట్టమొదటి వాక్యంలో మొదటి అక్షరం ఎలావ్రాస్తే చివరి వాక్యంలో చివరి అక్షరం కూడా అలాగే వ్రాసేవారు సాధారణంగా ఉదార స్వభావులై వుంటారు. ఏ అక్షరం ఎక్కడ వచ్చినా, ఏ తలకట్టు ఎక్కడొచ్చినా వీరు ఒకేలా వ్రాస్తారు. అలాగని వీరి చేతివ్రాత బాగుండాలని రూల్ ఏమీ లేదు. బాగుండకపోవటంలో కూడా ఒక సిస్టమేటిక్ అప్రోచ్ వీరి వ్రాతలో వుంటుంది.

1. సాంకేతికంగా వీళ్ళు ప్రేమించటంలో నిపుణులు. కానీ, అది మానసిక సమస్యలను అంత త్వరగా పరిష్కరించడానికి ఉపయోగపడదు. వీరు ప్రతీ విషయాన్నీ భూతద్దంలో పరిశీలిస్తారు. చివరికి ప్రేమను కూడా తమ ప్రియురాలు / ప్రియుడు బహుమతిగా ఒక పౌడర్ డబ్బా తీసుకువస్తే అది కొనటానికి ఎంత ఖర్చు అయిందీ, ఆ డబ్బు ఎక్కడ నుంచి వచ్చింది, దానివల్ల లాభాలు

నష్టాలు - ఇలాంటివన్నీ ఆలోచిస్తారే తప్ప ఆ బహుమతి తీసుకోవడంలో వుండే ఆనందాన్ని పొందలేరు.

2. ఈ వైపు వ్యక్తులని సమస్యలు పరిష్కరించమని కోరటం అంత బుద్ధి తక్కువ పని ఇంకోటిలేదు. ఉదాహరణకి ఇటువంటి వ్యక్తి మీ భర్త అయి మీ పక్కింటి ఆవిడ మిమ్మల్ని ఎలా బాధపెట్టిందో చెప్పడానికి అతని దగ్గరకు వెళ్తే సాధారణంగా అతనంతా విని సానుభూతి చూపాలని మీరు కోరుకుంటారు. కానీ ఈ వర్గం వ్యక్తి మొట్టమొదట అడిగే ప్రశ్న

'' నువ్వేమన్నావ్ ముందు ? ''

ఇలా ప్రశ్నలు వేసి మీరు ఎక్కడ తప్పటడుగు వేశారో ఎత్తిచూపుతాడే తప్ప అవతల వాళ్ళ గురించి ఒక్కమాట కూడా అనడు. చివరకు మీకు విసుగొచ్చి '' మీకు చెప్పడం నాదే బుద్ధి తక్కువ '' అని అరచే వరకూ, పక్కింటివాళ్ళతో ఎలామసులుకోవాలో అతను ఉపన్యాసం ఇస్తూనే వుంటాడు. మీరెంత గట్టిగా అరిచినాసరే అతడి అభిప్రాయంలో ఏ మార్పు వుండదు. తప్పుమీది అని అతనికి అనిపిస్తే అవతలి వాళ్ళు మీకుటుంబానికి ఎంత శత్రువైనా సరే మిమ్మల్ని సపోర్ట్ చెయ్యడు. ఇలాంటి మూర్తీభవించిన న్యాయాన్ని చూడగలగడం ఈ కలికాలంలో అద్భుతమే కదా!

3. మొదటినుంచీ చివర వరకూ అక్షరాలు ఒకేలా వ్రాసే వాళ్ళు మిన్ను విరిగి మీద పడ్డా తొణకరు. అయితే తోటివాళ్ళ అవసరాల గురించి లోతుగా ఆలోచించలేని మనస్తత్వం వల్ల వీరు అనేక సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది. ఏదైనా ఒక విషయం గురించి తమ అమోఘమైన తెలివితేటలతో అద్భుతమైన విశ్లేషణ చేసేవారు, తమ దగ్గరి వారిని ఏ విషయం సంతోషం పెడుతుందో తెలుసుకో లేక పోవటం ఒక విధంగా దురదృష్టకరం. ఇటువంటి వ్యక్తులు చాలా బ్యాలన్స్‌డ్ గా ప్రవర్తిస్తుంటారు. ఇటువంటి వాళ్ళ అండవుండటం మంచిదే కానీ వీరినిర్లిప్తతని సహించక తప్పదు. అందుకే హిందీలో ఒక గజల్ వుంది. '' కుఛ్ పానా హైతో, కుచ్ కోనా హై! ''

4. డబ్బు విషయంలో వీరు ఉదార స్వభావులే అని చెప్పుకోవాలి. అనవసరంగా ఏమీ ఖర్చు చేయకపోయినా అందం కోసం, సంతోషం కోసం ఖర్చుచెయ్యటానికి వెనుదియ్యరు. వీరి ఆనంద మంతా తను తనదగ్గరి వాళ్ళు అనే సర్కిల్ మీదే ఆధారపడి వుంటుంది.

5. ఇటువంటి వ్యక్తులు 'కాస్ట్రోఫోబియా' కి గురయ్యే అవకాశం వుంది. అంటే గుంపులని ఇష్టపడక పోవటం. ఇటువంటి వాళ్ళు అయిదారుగురు స్నేహితుల్తో సినిమాంకి, పెళ్ళిళ్ళకీ వెళ్ళటాన్ని ఇష్టపడరు.

6. వీరికి అంతర్గతంగా చాలా భయం వుంటుంది. వీరికి ఎంత భయం వుంటుందంటే సంతానం కలిగితే భార్య నిర్లక్షం చేస్తుందేమోనని, పిల్లల్ని కూడా వాయిదా వేస్తారు.

## అక్షరాలు వ్రాసే విధానం:

తెలుగులో కొన్ని కొన్ని అక్షరాలు చాలా మెలికలు తిరిగి వుంటాయి. ఒక వ్యక్తి వ్రాస్తూ పోతున్నప్పుడు ఎక్కువ మెలికలు తిరగని అక్షరాలను పూర్తిగా వ్రాయడానికి ప్రయత్నిస్తాడు. అదే చాలా మెలికలున్న అక్షరాన్ని వీలైనంత నిర్లక్ష్యంగా తొందరగా పూర్తి చెయ్యటానికి ప్రయత్నిస్తాడు. దీన్ని బట్టి కూడా వారి మనస్తత్వాన్ని విశ్లేషించవచ్చు.

ఉదాహరణకి తను వ్రాసేది అవతలవాళ్ళకి అర్థం అయితే చాలు అనే ఉద్దేశ్యంతో కొన్ని అక్షరాలను అతను పూర్తి చేయకుండానే వదిలేస్తారు.

ఇలాంటి అక్షరాలు ఉదాహరణకి - శ్రీ - అ- త -కొ -సి-గ - మొదలైనవి.

ఇప్పుడు ఈ క్రింది అక్షరాలను వివిధ రకాలుగా ఎలా వ్రాస్తారో పరిశీలించి దాని బట్టి మానసిక విశ్లేషణను పరిశీలిద్దాం.



1. మొదటి అక్షరం పూర్తిగా వ్రాసి ఎడమవైపు అర్ధచంద్రాకారపు ఒత్తు ఇస్తే డబ్బుపట్ల చాలా జాగ్రత్త వున్నవారు. గతాన్ని వీలైనంత వరకూ మర్చిపోడానికి ఇష్టపడేవారు అయివుంటారు.

2. అదే ఒత్తు కుడివైపు ఇస్తే పాతకాలపు పద్ధతుల మీద నమ్మకం వున్నవారు, ధర్మగుణాన్ని కలిగున్న వారు అయివుంటారు.

3. అక్షరాలు పూర్తిగా ఒత్తుతో చుట్టేస్తే ఎక్కువ భక్తి భావం కలిగి వున్నవారు, తనలోతానే కుచించుకుపోయేవారు, ఏ పనైనా మొదలు పెడితే పూర్తయ్యే వరకూ వదిలిపెట్టని వారు అయివుంటారు.

4. అక్షరాన్ని ఒక అలంకారంగా దిద్ది క్రింద ఒత్తుని అర్ధచంద్రాకారంగా పూర్తిచేస్తే, ప్రతీ పనినీ సులభంగా తీసుకొనేవారు నిర్లక్ష్యపరులు, అలంకార ప్రియులు అవుతారు.

5. ఒక సున్నాతో ప్రారంభించి, మరోసున్నతో పూర్తిచేసి క్రింద ఒత్తుని కూడా సున్నా చుట్టాలనే ప్రయత్నంతో అక్షరాన్ని పూర్తిచేసేవారు ఎక్కువగా డిఫెన్స్ టైప్ అయివుంటారు. కొంచెం సిగ్గు ఎక్కువ, తక్కువ మాట్లాడే గుణం కలిగి వుంటారు.

6. మొత్తం అక్షరాన్ని ఒత్తులా చుట్టకుండా ఒత్తుని అక్షరం చివర భాగంలో వ్రాసేవాళ్ళు సాధారణంగా తమమీద తమకి నమ్మకం కలిగిన వారైవుంటారు. తమని అందరూ గుర్తించాలనే తపన కలిగి తమని నమ్మిన వాళ్ళకి ఏదో ఒక లాభం చేకూర్చుదాం అనే మనస్తత్వం కలిగిన వారై వుంటారు.

1. 'అ' అనే అక్షరాన్ని మొదలుపెట్టి ఒక సున్నాచుట్టి, క్రిందకువంచి కుడివైపుమరో సున్నాచుట్టి కలం అక్కడ ఆపుచేసి మళ్ళీ గీతని ఎడంవైపు నుంచి ప్రారంభించి కుడివైపుకి తీసుకువచ్చి అక్షరాన్ని పూర్తి చేసే వ్యక్తులు, సాధారణంగా ఒక పని చేసిన తర్వాత ఆ పనిలో లోటుపాట్లన్నీ పున: పరిశీలించుకునేంత జాగ్రత్తపరులై వుంటారు. వీరు సాధారణంగా ఆర్టిస్టులు కళాకారులు అయివుంటారు.

2. రెండు చిన్న సున్నాలతో మధ్య అర్ధచంద్రాకారంతో 'అ' అనే అక్షరాన్ని పూర్తి చేసేవాళ్ళు సాధారణంగా ఎక్కువ పని ఒత్తిడితో, నిరంతరం టెన్షన్‌తో బాధపడేవాళ్ళై వుంటారు. తమని అవతలివారు అర్థం చేసుకోకపోయినా తమకేమీ నష్టం లేదనే మనస్తత్వం కలిగివుంటారు.

3. ఒక చిన్న గీతతో ప్రారంభించి, ఒక సున్నాతో అక్షరాన్ని పూర్తి చేసేవాళ్ళు, డబ్బుపట్ల ఎక్కువ అభిరుచి కలిగివుంటారు. వీళ్ళుకాస్త అహంభావులై కూడా ఉంటారు.

4. సున్నాతో ప్రారంభించి అక్షరం గీతని కొద్దిగా గీసి ఆపుచేసేవారు సాధారణంగా వాణిజ్య లక్షణాలని కలిగివుంటారు. ఎక్కువ మాట్లాడే స్వభావాన్ని కలిగివుంటారు.

5. అక్షరాన్ని గుండ్రంగా కాకుండా మూడుకోణాలతో పూర్తి చేసేవారు సాధారణంగా కలలుకనే వారై వుంటారు. వీరు ఎక్కువ బాధ్యతలని స్వీకరించలేరు. పుస్తకాలని, చరిత్రని చదవాలనే కుతూహలం కలిగిన వారైవుంటారు.

6. అక్షరాన్ని పూర్తిగా వెడల్పుగా వ్రాసి ఈ చివర్నించి ఆ చివరికి గీతతో రెండుసున్నాలతో కలిపేవారు సాధారణంగా ఎక్కువ కలలు కనేవారు, అవసరమైన దానికన్నా ఎక్కువ మాట్లాడేవారు అయివుంటారు. షో ఆఫ్ ఎక్కువ చెయ్యాలనే కోరిక వీరికి మనసులో వుంటుంది. దయాగుణం, స్నేహగుణం, వీరిలో ఎక్కువ.

త త త త త త

1. రెండు సున్నాలను చిన్నవిగా వ్రాసి వాటిని కలిపేగీత, తలకట్టు పెద్దగా ఇచ్చేవాళ్ళు సాధారణంగా సెక్స్ కోర్కెలను ఎక్కువగా కలిగివుంటారు. పైకి చెప్పకపోయినా అంతర్గతంగా జీవితంలో ఏదో ఒకటి సాధించాలనే తపన వీరిలో ఎక్కువగా వుంటుంది.

2. మొత్తం అక్షరాన్నంత గుండ్రంగా వ్రాసి సున్నాలు వాటిని కలిపేసున్నా, పైన ఒక తలకట్టు వ్రాసేవారు జీవితంలో తొందరగా

స్థిరపడాలని కోరుకుంటారు. రహస్యాలని బైటకి వెల్లడి చేయరు. నెమ్మదస్తులై వుంటారు.

3. అక్షరం చిన్నది వ్రాసి తలకట్టు పెద్దదిగా ఇచ్చేవారు చాలా శక్తివంతులై వుంటారు. ఒకవేళ వీరు శారీరకంగా బలహీనులైనా మానసికంగా మాత్రం మంచిశక్తి కలిగి వుంటారు.

4. ముందు ఒక సున్నాతో మొదలు పెట్టి అక్షరం పూర్తి చేసిన తర్వాత రెండో అర సున్నాగీసే వాళ్ళు, సాధారణంగా తమపని పట్ల కొంచెం కంగారుతో కూడాన మనస్తత్వం కలిగిన వారై వుంటారు. వీరిలో చేసిన తప్పు సరిదిద్దుకోవాలన్న తపన ఎక్కువగా వుంటుంది. జీవితాన్ని చాలా నిర్దిష్టమైన పరిధిలో అనుభవిస్తుంటారు.

5. ముందు అసలు సున్నాయే లేకుండా అక్షరాన్ని పూర్తి చేసి, అవతలి వాళ్ళకి అది 'త' అని చెప్పాలనుకొనే వాళ్ళు సాధారణంగా లీడర్‌షిప్ గుణాలుకలిగి వుంటారు. వీరిలో ఈర్ష్య పాలు ఎక్కువ. అవతలవాళ్ళు పైకి వస్తుంటే వారిని ఎలా అధిగమించాలీ అని చూస్తుంటారు.

6. అక్షరం పూర్తి చేసి తలకట్టు చిన్నగా ఇచ్చేవారు మానసికమైన క్రమశిక్షణని తక్కువగా కలిగి వుంటారు. వీరిని నమ్ముకుని ప్రయాణం చేయడం ఎప్పుడూ లాభదాయకం.

1. 'క' అనే అక్షరపు కొమ్ముని, ఒక గీత, అర్ధచంద్రాకారం, చిన్నసున్నాతో పూర్తి చేసేవాళ్ళు తమ హృదయం చెప్పినదానికన్నా మెదడు చెప్పేదాన్ని నమ్మేవాళ్ళై వుంటారు. వీరు రొమాన్స్‌లో అవతలి పార్ట్‌నర్‌ని బాగా సంతృప్తి పరిచేవాళ్ళై వుంటారు.

2. 'క' అనే అక్షరాన్ని వ్రాసి దానిపైన ఒక 'ల' ఒత్తు లాంటి గీతతో మొత్తం అక్షరాన్ని 'కొ'గా చదివేవాళ్ళకి తెలియపరచాలి అనుకొనేవాళ్ళు తమమీద తమకి ఎక్కువ నమ్మకం కలిగిన వారై వుంటారు. అయితే వీళ్ళని నమ్ముకుంటే సగంలో ఎడారిలో మనల్ని వదిలేసే ప్రమాదం కూడా వుంది.

3. అక్షరం మామూలుగా వ్రాసి దానికిచ్చే గుణింతాన్ని వెనక్కి వ్రాసేవారు తమమీద తమకి ఎక్కువగా నమ్మకం లేని వాళ్లై వుంటారు. ఎవరో ఒకరు ఎప్పుడూ తమని ప్రేమించాలి అనే కోర్కెని కలిగి వుంటారు. స్నేహ పాత్రులై వుంటారు. ప్రపంచం అంతా మంచిదని, అందరూ మంచివాళ్ళని నమ్మే మనస్తత్వం కలిగి వుంటారు.

4. అక్షరానికి, గుణింతానికి మధ్య తేడా వదిలేవాళ్ళు మంచి సంభాషణా చతురులై వుంటారు. తమ గురించి తాము ఎక్కువ ఆలోచించేవారై వుంటారు.

5. అక్షరాన్ని కోణాంతో వ్రాసేవాళ్ళు సాధారణంగా ఒక నిర్దిష్టమైన పరిధిలో ఆలోచించేవాళ్ళు, తాము పట్టిన కుందేటికి మూడేకాళ్ళు. ఇంకా ఎక్కువ వాదిస్తే అసలు కాళ్ళే లేవు అనే దృఢమైన మనస్తత్వం కలిగివుంటారు.

6. అక్షరం పెద్దది వ్రాసి పైన గుణింతం చిన్నదిగా వ్రాసి పూర్తి చేసేవాళ్ళు, తెలివైన వాళ్ళు, తమపనిని ఏదో విధంగా తొందరగా పూర్తి చెయ్యాలనుకొనేవాళ్ళై వుంటారు.

1. గుణింతానికి అసలు విలువ ఇవ్వని వాళ్ళు తమ గురించి ప్రపంచం ఏమనుకున్నా పెద్దగా పట్టించుకోని వారై వుంటారు.

2. అక్షరం చిన్నది వ్రాసి, గుణింతాన్ని అవసరమైనదానికన్నా పెద్దగా వ్రాసేవారు తమలోపాలు ఎన్ని వున్నా వాటిని బైటపడనివ్వకుండా ప్రపంచానికి ఒకగొప్ప వ్యక్తిలాగానో, విశిష్టమైన వ్యక్తిలాగానో కనిపించాలనే తపన కలిగి వుంటారు.

3. చిన్న గీతతో అక్షరం పూర్తిచేసి, గుణింతంతో మొత్తం అక్షరాన్ని పూర్తిచేద్దామనుకొనేవాళ్ళు ఇంట్రావర్ట్లై వుంటారు. వీళ్ళని అర్థం చేసుకోవడం చాలాకష్టం.

4. అక్షరానికి ముందువైపు గుణింతం వ్రాసి, ఆ గుణింతానికి ఒక సంపూర్ణత్వాన్నిచ్చే వారు సాధారణంగా తాము చేస్తున్న పనికంటే, దాని ఫలితాన్ని బాగా ఆశించే వారై వుంటారు.

5. నిర్దేశింపబడిన అక్షరంలాగ కాకుండా దాన్ని అనవసరంగా మెలికలుతిప్పేవారు కొత్తవిషయాలు తెలుసుకోవాలనే ఆసక్తి కలిగి వుంటారు.

6. మొత్తం అక్షరాన్ని కోణాలతో పూర్తి చేసేవారు ఎక్కువ కఠిన మనస్కులై వుంటారు.

గా గా గా గా గా గా

1. అక్షరాన్ని గుండ్రంగా వ్రాసి ఎంత ప్రాముఖ్యతవుందో అంతే ప్రాముఖ్యతని గుణింతానికి కూడా ఇచ్చి పూర్తి చేసేవాళ్ళు స్నేహ పాత్రులు, దయార్ద్ర హృదయులూ అయివుంటారు.

2. అక్షరాన్ని రెండుగీతలతోపూర్తి చేసేవాళ్ళు సాధారణంగా ఎంత పెద్ద పనినైనా సులభంగా పూర్తిచేసే నేర్పు కలిగివుంటారు. వీరు ఫలితంకన్నా పనిపూర్తి చెయ్యటంలో ఎక్కువ ఉత్సాహం చూపిస్తారు.

3. అక్షరాన్ని, గుణింతాన్ని సమానంగా బ్యాలెన్స్ చేసేవారు జీవితంలో నిరర్ధకమైన ఆలోచనలపట్ల ఎక్కువ ఉత్సాహాన్ని చూపిస్తారు. పనికన్నా ఆలోచనలపట్ల ఎక్కువ మొగ్గు చూపుతారు.

4. ప్రారంభించవలసినదానికన్నా ముందుగా ప్రారంభించి ఒక మెలిక తిప్పి పూర్తిచేసే వారు ఎక్కువగా గతం మీద ఆధారపడేవారై వుంటారు. ఆలోచనల చురుకుదనంకన్నా ఆలోచనల వల్ల కలిగే ఫలితాలను ఎక్కువ ఆలోచించేవాళ్ళై వుంటారు.

5. అక్షరం మొదలు పెట్టేటప్పుడు మామూలుగా ప్రారంభించి చివరలో ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చేవాళ్ళు స్నేహానికి ఎక్కువ ప్రాముఖ్యతనిచ్చేవాళ్ళై వుంటారు.

6. గుణింతాన్ని తొందరగా పూర్తి చేసేవాళ్ళు అవతల వాళ్ళమీద ఎక్కువ ఆధారపడేవారై వుంటారు. వీరు జీవితంలో పైకి రాడానికి ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఎంత సాధించినా, ఇంకా సాధించవలసింది ఎంతోవుంది అనే అభిప్రాయంలో వుంటారు.

# 10. మార్జిన్

ఒక వ్యక్తి తను ఉపయోగిస్తున్న కాగితం మీద ఖాళీ స్థలాన్ని ఏ విధంగా వినియోగించుకుంటాడు అనేదాని మీద అతడి యొక్క వ్యక్తిత్వం, డబ్బు ఖర్చు చేసే విధానం, సమాజంలో అతను కోరుకునే స్థానం మొదలైన విషయాలన్నీ ఆధారపడి ఉంటాయన్నది నమ్మశక్యం కాకపోయినా యథార్థం.

మనం అప్పుడప్పుడూ గమనిస్తూనే ఉంటాం. ఇన్‌లాండ్ లెటర్లో ఉత్తరాలు వ్రాసేవారు ఊరిపేరు, తేదీ వేసాక చాలా ఖాళీ స్థలం వదిలిపెట్టి, 'ప్రియమైన'... అంటూ మొదలు పెట్టి, ఉత్తరం పూర్తి చేయలేక మళ్ళీ ఆ చివరి పేరా గ్రాపుల్ని ఉత్తరం ప్రారంభంలోనో, లేక అడ్డంగా త్రిప్పి వ్రాసి ఉత్తరం పూర్తి చేస్తుంటారు. అప్లికేషన్ ఫారమ్స్‌లోనో, లేక తెల్లకాగితాల మీద అర్జీ వ్రాయవలసి వచ్చినప్పుడో కొంతమంది కాగితం మొదట్లోనే FROM అని మొదలు పెట్టి, ఆ తరువాత నాలుగైదు లైన్లలోనే వ్రాయవలసిన దాన్ని పూర్తిచేసి మిగతా కాగితాన్ని ఖాళీగా వదిలేయడం కూడా చూస్తూనే ఉంటాం.

అలాగే కొంతమంది కాగితాన్ని ఎడమవైపు మార్జిన్ చాలా ఎక్కువగా వదులుతారు. మరికొంతమంది ఎడమవైపుకన్నా కుడివైపు ఎక్కువ స్థలం ఉండగానే ఆ వాక్యాన్ని వ్రాయడం ఆపేసి మళ్ళీ కిందలైనులో వ్రాయడం ప్రారంభిస్తారు.

ఇదేవిధంగా కొంతమంది అయిదారు పేజీలు వ్రాయవలసి వచ్చినప్పుడు మొదటిపేజీలో ఇంకా నాలుగయిదు అంగుళాల స్థలం ఉండగానే పేజీ తిప్పేసి రెండవ పేజీ ప్రారంభిస్తారు.

ఇలా రకరకాల వ్యక్తులు కాగితాన్ని రకరకాలుగా వినియోగించడాన్ని బట్టి కూడా వారి మనస్తత్వాన్ని విశ్లేషించవచ్చు.

ఎడమవైపు మార్జిన్ ఒక మనిషి యొక్క గత జీవితపు అనుభవాల్ని, గత జీవితంలో అతడు పొందిన ధైర్యాన్ని లేక అభద్రతాభావాన్ని, అతడిమీద మిగతా వ్యక్తుల ప్రభావాన్ని సూచిస్తుంది. ఎడమవైపు మార్జిన్ ఎమోషన్‌ని, మనిషి యొక్క ప్రస్తుత పరిస్థితిని కూడా సూచిస్తుంది. అలాగే కుడివైపు వాక్యం కాగితం చివర వరకు వ్రాయకుండా ఎంతోఖాళీ స్థలం ఉండగానే తరువాత లైను మొదలు పెట్టాడా (కుడివైపు మార్జిన్) అంటే, ఆ ఖాళీ వదిలే మనస్తత్వం మీద ఒక వ్యక్తి యొక్క భవిష్యత్ దృక్పథం ఆధారపడి ఉంటుంది. ఒక వ్యక్తి ఎడమవైపు మార్జిన్ ఎంత వదిలిపెట్టాడో, కుడివైపు మార్జిన్ కూడా అంతే వదిలిపెడితే అతడు చాలా రిలాక్స్‌డ్‌గా బ్రతికే మనిషి అని నిర్ధారణకి రావచ్చు. అలాగే, కుడి ఎడమల తక్కువఖాళీ వదిలితే అతడు న్యాచురల్‌గానే అభద్రతా భావానికి తరచు లోనయివుంటాడు.

ఇవన్నీ ఎవరైనా చెప్పగల సాధారణ విషయాలు. ఇంకా లోతయిన విశ్లేషణలు ఈ ఛాప్టర్‌లో చర్చిద్దాం.

## ఎడమవైపు మార్జిన్ :

ఇది నాలుగు రకాలుగా ఉంటుంది. 1. ఎక్కువ మార్జిన్, 2. తక్కువ మార్జిన్, 3. సాధారణ మార్జిన్‌తో ప్రారంభించి వెళుతున్న కొద్దీ ఎక్కువ మార్జిన్ వదలటం, 4. సాధారణ మార్జిన్‌తో ప్రారంభించి వెళుతున్న కొద్దీ తక్కువ మార్జిన్‌లోకి దిగటం.

### 1. ఎక్కువ మార్జిన్ :

ఎడమవైపు ఎక్కువ మార్జిన్ వదిలి వ్రాసే వారు స్వశక్తి మీద ఎక్కువ ఆధారపడతారు. పిత్రార్జితం మీద ఎక్కువ ఆశ ఉండదు. సాధారణంగా వీళ్ళు ఎక్కువ సంస్కారవంతులై ఉంటారు. డబ్బు సంపాదన పట్ల ఎక్కువ ఆసక్తి కలిగిఉండి విలాసవంతమైన

జీవితాన్ని ఇష్టపడతారు. సాధారణంగా రిజర్వ్‌డ్ గా వుంటారు. జనంలో కలవటానికి ఎక్కువ ఇష్టపడరు.

యండమూరి గార్కి
నమస్తే

మీ దృష్టిలో నాది చాలా
ఇది చాలా పెద్ద సమస్య. విషయమేమిటంటే
ఒక పెళ్ళిచూపులు నా ప్రేమను మనసులో
అమ్మాయి వాళ్ళని పిలుస్తుంటే నేనొక క్రొ
త్తలంలా ప్రేడిగా కదులుతోంది. నాక్రే

ఎడమవైపు మార్జిన్ పేజీ మొదట్లో ఎంతుందో చివరివరకూ అదే మార్జిన్ మెయిన్‌టెయిన్ చేస్తూ, అది అవసరమైన దానికన్నా కొంచెం ఎక్కువ విశాలంగా ఉంటే ఆ వ్యక్తులు ఇతరుల నుంచి సాధారణంగా ఏ సహాయమూ కోరరు. అలాగే ఇతరులకి సహాయం చేసే గుణం కూడా అంతగా ఉండదు. కానీ నిజంగా అవతలి వారికి అవసరమున్నట్లయితే వాళ్ళు అడిగిన దానికన్నా రెండింతలు ఎక్కువ సహాయం చేస్తారు.

దీనికి ఒక ఉదాహరణ చెప్పాలంటే, ఉదయాన్నే వీళ్ళు పేపరు చదువుకుంటున్నప్పుడు శ్రీమతివచ్చి ''స్టవ్‌లో కిరసనాయిలైపోయింది. ఎన్నిసార్లు చెప్పినా పట్టించుకోరు'' అని గొడవ చేస్తే అసలా మాటలే విననట్లు పూర్తిగా ఆ పేపర్లో తల దూర్చేస్తారు. మరుసటి రోజు మధ్యాహ్నం వాళ్ళావిడ ఇంట్లో ఉండేటప్పుడు ఇద్దరు వ్యక్తులు వచ్చి తలుపులు తట్టి కొత్తగ్యాస్ స్టౌ, దానితో పాటు సిలిండర్ తెచ్చి అమరుస్తారు. ఇలాంటి వ్యక్తుల శ్రీమతులు అవేవో తమ తండ్రిగారు పంపారనుకోనవసరం లేదు. ఇలాంటి వ్యక్తులతో సంసారం ఈ విధంగానే

ఉంటుంది. ఆశ్చర్యకరమైన బహుమతులు, అనుకొని సమయాల్లో సంతోషకరమైన కార్యాలు చేయటానికి వీరు ఇష్టపడతారు.

ఒక ఆదర్శం కోసం గట్టిగా నిలబడి పోరాడకపోయినా కూడా వీరి ఆలోచనలన్నీ ఆదర్శవంతంగానే ఉంటాయి. వీరిని మానవతావాదులు అని స్నేహితులు వెక్కిరించే అవకాశం కూడా లేకపోలేదు.

## 2. తక్కువ మార్జిన్ :

[illegible] వీరేంద్ర నాథ్ గారికి
నా పేరు ప్రభావతి వయస్సు 34. మీరు
ఇచ్చిన పుస్తకం చదివి. నాకు [illegible] || Nirmala
వచ్చాయి. నా 9 [illegible] 34 [illegible]
[illegible]

ఎడమవైపు తక్కువ మార్జిన్ ఇచ్చేవారు సాధారణంగా ఇతరులమీద ఆధారపడే మనస్తత్వం కలిగిన వారై ఉంటారు. మనుషుల్ని వీరు అంత త్వరగా నమ్మరు. వీర్ని నమ్ముకున్న వారికి మాత్రం కొండంత అండగా నిలబడతారు.

పైకి ఎంతో సరదాగా, అమాయకంగా కనిపించనప్పటికీ, అంతర్గతంగా చాలా గంభీరమైన భావాలు కలిగిన వారై ఉంటారు. వీరు చాలా పొదుపరి మనస్తత్వం కలిగి ఉంటారు.

వీరి అభిరుచులు త్వరత్వరగా మారుతూ ఉంటాయి. మనుషుల్తో అనవసరంగా గొడవ పడటం ఇష్టం లేకపోయినా వీరు తీసుకునే నిర్ణయాల వల్ల కొంతమంది కష్టపడవచ్చు.

ఎడమవైపు తక్కువ మార్జిన్ ఇచ్చేవారితో కలిసి జీవితం ఎప్పుడూ సుఖప్రదంగా ఉంటుంది. ముఖాన చందనపు బొట్టు పెట్టుకొని, సాంప్రదాయకమైన దుస్తులు ధరించి, కంప్యూటర్ ముందు కూర్చుని అద్భుతమైన ప్రోగ్రాంలు తయారు చేసే మనస్తత్వం వీరిది.

రకరకాల సంప్రదాయాల్ని అతి సులభంగా కలిపేసి, వాటిని తమకి అనుగుణంగా మార్చుకొని జీవితాల్ని సుఖప్రదం చేసుకొనే నైపుణ్యం వీరిలో ఉంటుంది.

## 3. మొదట్లో ఎక్కువ, తరువాత తక్కువ:

వ్రాయటం ప్రారంభించేముందు ఒక నిర్ణీతమైన మార్జిన్‌ను ఎడమ వైపు వదిలి తరువాత వ్రాసుకు పోయేకొద్దీ ఎడమవైపుకు జరుక్కుంటూ వచ్చే (అంటే తక్కువ మార్జిన్ వదిలే) చేతి వ్రాత ఉన్నవారు భవిష్యతుమీద ఎక్కువ నమ్మకం లేని వారై ఉంటారు. జీవితాన్ని ఒక అద్భుతమైన కళగా మార్చుకునే శక్తి వీరికుంటుంది.

[illegible] ఈ అమ్మాయి మాత్రం నన్ను [illegible] ప్రవర్తిస్తుంది అని నా నమ్మకం [illegible] దొరకదు కూడా. ఈ అమ్మాయి [illegible] అప్పుడు ఆమె అంటే మరికాస్త ఇష్టం, అభిమానం [illegible] ఈమెను మరచిపోవటానికి చాలా ప్రయత్నించాను. కానీ [illegible] అంటే నాకు ప్రాణం.

ఇప్పుడు ఈ అమ్మాయి [illegible] ఎప్పుడైనా బైటకి వెళ్ళినప్పుడు [illegible] ఇంట్లోవాళ్ళకి [illegible] చెప్పడం కుదరదు. ఆమె అభిప్రాయం [illegible] నా కోరిక. అప్పుడుగాని నేను ఏ నిర్ణయం తీసుకోలేను. [illegible] సంఘాల [illegible] సమస్యకి పరిష్కారం [illegible] ....

[illegible], [illegible] పాలెం, విశాఖపట్నం.

ప్రేమ వివాహం చేసుకొని, భార్యని చిన్నగదికి తీసుకొచ్చి "తల్లీ తండ్రిని వదిలేసి వచ్చావు. ఇవిగో గుప్పెడు బఠానీలు. వీటినే వజ్రాలనుకో" అంటారు ఈ వైపు మనుష్యులు. అయితే షష్టి పూర్తి రోజు భార్యకి గుప్పెడు వజ్రాలిచ్చి "ఇవి ఇప్పుడు నాకుగుప్పెడు బఠానీలతో సమానం" అనగలుగుతారు.

జీవితంలో ఈ విధంగా ఎంతగొప్ప శిఖరాన్నైనా వీరు చేరుకోగలరు.

ఈర్ష్య పడే వారిని, అనుమానించే వారిని సాధారణంగా వీరు దగ్గరికి రానీయరు.

జీవితాన్ని ఈజీగా తీసుకుని అయిన దానికి, కానిదానికి బాధపడకుండా ఎటువంటి పరిస్థితులలోనైనా వీరు మొక్కవోని ధైర్యసాహసాల్ని చూపుతారు.

వీరు ఎంతప్రేమను చూపించగలరో అవసరమైతే అంత ఎడబాటును కూడా చాలా మామూలుగా సహించగలరు.

ఇరవై నాలుగుగంటలూ తాము ప్రేమించినవారు తమతో కలిసి తిరగడాన్ని వీళ్ళు ఇష్టపడరు. దానికి బదులుగా ఏదైనా ఒక సార్థకమైన పనిని చేయటానికి వీరు ఇష్టపడతారు.

## 4. పైన తక్కువ, చివర ఎక్కువ:

ఎడమవైపు మార్జిను మొదట్లో ఒకలా ప్రారంభించి తరువాత క్రామకు పోయేకొద్దీ దాన్ని విశాలం చేసేవారు తమ మీద తమకి అవసరమైన దానికన్నా ఎక్కువ నమ్మకాన్ని కలిగినవారై ఉంటారు. వీరికి అహంకారం పాలు, కొద్దిగా ఎక్కువ.

వీరి గురించి వీరు ఎక్కువ చెప్పుకోరు. కాని వీరు చేసే పనుల ఫలితాలే ప్రపంచానికి వీరంటే తెలియజేస్తాయి.

చెప్పదలచుకున్న విషయాన్ని ఎంత నిర్లక్ష్యంగా చెప్పినా అది అవతలి వారి మనసుల్లోకి చొచ్చుకుపోతోందని నమ్మకంగా తెలుసుకోగలుగుతారు.

వీరికి వీరంటే ఏమిటో బాగా తెలుసుకాబట్టి ఇతరులు వీరిగురించి ఏమనుకుంటున్నారోనని ఎప్పుడూ చింతపడరు. అలాగే అవమానాలను దులపరించుకొని ముందుకు సాగిపోయినా, వీళ్ళని అవమానించిన వాళ్ళకి దెబ్బతీయటం కోసం ఎంత కాలమైనా వేచి ఉంటారు. మనసులో భావాలు మొహం మీద కనబడనీయకుండా ప్రవర్తించటం వీరికి వెన్నతో పెట్టిన విద్య అలాగే కోపంతో చిందులేయటం, అరచి గోల చేయటం వీరి స్వభావానికి విరుద్ధం.

జరిగిన అన్యాయాలకు, అవమానాలను మాటి మాటికీ వెనక్కి తిరిగి చూసుకొని ఏడుస్తూ కూర్చోకుండా, తమ తమ రంగాల్లో ముందుకు సాగిపోవటం వీరి వ్యక్తిత్వానికి పరాకాష్ట. వీరిని పాజిటివ్ వ్యక్తులు అని చెప్పుకోవచ్చు. బాధలు, కష్టాలు అంటే ఏమిటో తెలుసు కనుక కష్టాల్లో ఉన్న వారిని ఎద్దేవా చెయ్యరు.

వీరి సహాయాన్ని కోరిన వారిని, వీరిని నమ్ముకున్న వారిని మోసం చేయటానికి ఇష్టపడరు. తమకంటే బలహీనులని దెబ్బతీయటం అనేది వీరికి పరువు తక్కువ పనిగా అనిపిస్తుంది.

వీరు లౌక్యంగా పనులు జరిపించుకోవటంలో దిట్టలు. అపాయాన్ని ఇష్టపడే మనస్తత్వం కలిగి ఉంటారు. సాధారణంగా గూఢాచారి శాఖలో పని చేసేవారు, రాజకీయాల్లో పని చేసేవారు, బాబాలు మొదలైన వారి చేతివ్రాత ఈ విధంగా ఉండటం మనం గమనిస్తాం.

## కుడివైపు మార్జిన్ :

కుడివైపు ఖాళీ స్థలాన్ని వదిలేవారిని మూడు రకాలుగా విభజింపవచ్చు.

1. ఎక్కువ స్థలం వదిలి తరువాతి వాక్యం ప్రారంభించేవారు.

2. కాగితం చివరి వరకూ వ్రాసిగాని క్రింది వాక్యానికి రానివారు.
3. స్థలంలో నిమిత్తం లేకుండా ఎప్పుడు పడితే అప్పుడు ఆ వాక్యాన్ని ఆపుచేసి తరువాతి లైనుకి వచ్చేవారు.

## 1. కుడివైపు ఎక్కువ మార్జిన్ వదిలేవారు:

వీరు అమితమైన సౌఖ్యాన్ని అభిలషించేవారై ఉంటారు. భోజనము, మధువు, మాదకద్రవ్యాలు, అందమైన స్త్రీలు, ప్రేమ, ప్రకృతి అన్నింటిపట్ల వీరు ఆకర్షింపబడతారు.

జీవితంలో ఏదైనా సాధించటం కంటే జీవితాన్ని అనుభవించటం ముఖ్యమని వీరు భావిస్తారు. తమకు కావాల్సిన దాన్ని ఏదో విధంగా సాధించి దాన్ని అనుభవిస్తూ బ్రతుకుతారు.

వీరు ప్రేయసి/ప్రియులకు తమపట్ల ఏదో ఒక భ్రమ కలిగిస్తారు.

వీరు సాధారణంగా ఎక్కువ ఖర్చు చేసేవారై ఉంటారు.

వీరు మంచి వాళ్ళకి తిమ్మిని బమ్మిని చేయగల వారిగా కనిపిస్తారు కానీ నిజానికి అలాంటి మనస్తత్వాన్ని కలిగి ఉండరు.

తమ ఆశయాలకు, ఇష్టా యిష్టాలకు బయట వాళ్ళే కాదు, ఇంట్లో వాళ్ళు కూడా విఘాతాన్ని కలిగించడం వీరు ఒప్పుకోరు.

పిల్లల్ని వీరు పెంచిన కట్టుదిట్టాంతో మరెవరూ పెంచలేరు.

వీరిలో అంతర్గతంగా కొంత అహంకారం ఉంటుంది. దాన్ని ప్రదర్శించనంతకాలం వీరిని ప్రేమిస్తే గొప్ప సంతృప్తి లభిస్తుంది.

## 2. తక్కువ మార్జిన్ ఇచ్చేవారు:

K. Nirmala, 7th class 'B'

వాక్యాన్ని కాగితం చివరివరకూ వ్రాసి, అక్కడ సున్నాతో ప్రారంభించవలసి వచ్చినా దాన్ని తరువాతి వాక్యం ప్రారంభం వరకూ తీసుకువచ్చేవారు సాధారణంగా భవిష్యత్తుపట్ల ఎక్కువ నమ్మకం లేనివారు, తమని తాము ఇతరులకి స్పష్టంగా చెప్పగలిగేవాళ్ళు, అనుమానస్థులు అయ్యుంటారు.

వీరు చంచలంగా, ఎప్పుడూ ఏం చేస్తారో చెప్పలేనివిధంగా ప్రవర్తిస్తుంటారు.

వీరు ఒక అబ్బాయి/అమ్మాయిని ప్రేమిస్తే అతని స్వరం వల్లో, నడతవల్లో, వ్యక్తిత్వంవల్లో, డబ్బువల్లో ఇష్టపడి, కొద్దిరోజులకి అదే అబ్బాయిని/అమ్మాయిని వారు వేసుకున్న చెప్పుల దగ్గరనుంచి, వాడే జేబురుమాల వరకు విమర్శించడం ప్రారంభిస్తారు.

వీరు చేస్తున్న ఉద్యోగం పట్ల శ్రద్ధ ఎక్కువ చూపించకపోవచ్చు. దానికి కారణం వీరి చేతకానితనం కాదు. యాంత్రికతను వీరు అసహ్యించుకుంటారు. చిన్నచిన్న థ్రిల్స్ అంటే వీరికి చాలా ఇష్టం.

రొమాన్స్‌లో కొన్ని వందల సార్లు అవకాశాన్ని కనుక్కొని, రకరకాల ప్రయత్నాలు చేసి, విజయం సాధించినా సరే దానిని చివరిక్షణంలో వదిలేసి, మరొక అవకాశం కోసం ప్రయత్నం చేస్తారు.

వీరి వ్యక్తిత్వం, తెలివి చుట్టు పక్కల వాళ్ళని ఇట్టే ఆకట్టుకుంటాయి. ప్రపంచంలో ఉండే సర్వ విషయాలగురించి చమత్కారంగా చర్చించగలిగే నైపుణ్యం వీరికి ఉంటుంది.

ప్రేమకోసం వేటలో ఒక్కొక్కరిలో ఒక్కొక్క గుణం నచ్చి, చివరికి ఎవర్ని ప్రేమించాలో తెలియక తికమక పడతారు.

వీరు స్త్రీలయితే పొద్దున్న పక్కింటావిడకి వంటలో సహాయం చేసి, మధ్యాహ్నం చిన్ననాటి స్నేహితురాలికి ఫోన్‌చేసి ముచ్చట్లు చెప్పి, మళ్ళీ రాత్రి పిల్లలకి ఎంతో క్లిష్టమైన పాఠాలు చెప్పి..ఇలా రకరకాలుగా దినచర్యని మార్చుకోగల సమర్థులు.

పరిగెత్తగలిగి నడవటం, మాట్లాడగలిగి మౌనంగా ఉండటం, సహాయం చేయగలిగి ఉండి చేయకపోవటం లాంటి పనులు వీరి స్వభావానికి విరుద్ధం.

వీరితో, వీరి ఆలోచనా వేగంతో సమంగా పరిగెత్తి, వీరికి సహాయం చేస్తూనే, వీరి చంచల స్వభావాన్ని తగ్గించగలిగితే; వీరికి స్నేహితుడు/ప్రియుడు/ప్రియురాలు కావాలనుకునేవారు చాలా అదృష్టవంతులవుతారు.

## 3. అస్తవ్యస్థపు రైట్ మార్జిన్ :

ఒక వాక్యం పేజీ చివరి వరకూ వ్రాసి, మరొక వాక్యం కొద్దిలో ఆపుచేసి, తరువాతిలైను ప్రారంభించే చేతివ్రాత ఉన్నవారు అనుకున్న విషయాన్ని కష్టపడి నిజాయితీగా, సాధించుకునే వారుగా గుర్తింపబడతారు. వీరు చిన్న చిన్నవిషయాలకు చాలా ప్రాముఖ్యత ఇస్తారు. తాము చేయదలచుకున్న పనిని ఎవరేమనుకుంటారోనన్న భయం లేకుండా చేస్తారు.

మొదటిసారి వీరిని ఎవరైనా చూస్తే, అంత గుర్తుంచుకో దగ్గ వ్యక్తిగా కనిపించకపోవచ్చుగానీ తరువాత్తరువాత మాత్రం వీరి గొప్పదనాన్ని గుర్తిస్తారు.

వీరిని తెలివి తక్కువ వారి గానూ, బుద్ధావతారాలుగానూ పరిగణించే కొంతమంది వీరు చేసే హేతుబద్ధమైన వ్యాఖ్యలు, చర్చలు వినడం సంభవిస్తే తమ అభిప్రాయం తప్పు అన్న నిర్ణయానికి తప్పకుండా వస్తారు.

వీరిని వీరు అవసరమైన దానికంటే అతిగా అంచనా వేసుకుంటారు. అయినా బరువు బాధ్యతలను ఆనందంగా స్వీకరిస్తారు.

ఆర్థిక సంతృప్తిని, గౌరవాన్ని ఇచ్చే ఏ పనినైనా వీరు సంతోషంగా చేస్తారు.

వీరి పర్సులో తప్పకుండా వీరికిష్టమైన వారి ఫోటో ఉంటుంది. వివాహ వ్యవస్థపట్ల, సంసార బంధాల పట్ల వీరికి అపారమైన నమ్మకం ఉంటుంది.

వీరు నలుగురితో కలవడానికి జంకకపోయినా, వీలైనంతవరకు నలుగురికీ దూరంగా ఉండటానికే ప్రయత్నిస్తారు.

ఏ విధమైన సంభాషణల్లోకానీ, చర్చల్లోకానీ అవతలివారిని ఓడించాలన్న తపన వీరిలో సాధారణంగా ఉండదు. తమ తెలివితేటలు ప్రదర్శించటానికి అవతలివారు కొలమానంకాదు, దానికి వేరే మార్గాలున్నాయి అన్న అభిప్రాయంతో ఉంటారు.

తప్పుడు వాదనలు ఖండించే ధైర్యం ఉన్నాసరే, అనవసరమైన విషయాల జోలికి పోకుండా నిర్లిప్తంగా ఉండిపోతారు. అలాగే తమకి ఏమాత్రం తెలియని విషయాల గురించి ఎప్పుడూ నోరు జారరు.

పగటి కలలు కనటం వీరి కిష్టం ఉండదు. అలా అని కలలు కనటం ఇష్టం లేదని కాదు. రాత్రిళ్ళు ఒక అందమైన కలని కనాలంటే పగలంతా కష్టపడాలి అన్న సత్యాన్ని ఆకళింపుచేసుకున్న వారై ఉంటారు.

చట్ట విరుద్ధమైన పనులు చేయటానికి వీరెప్పుడూ ఇష్టపడరు. సంఘంలో, సమాజంలో గౌరవాన్ని, మన్నన, మర్యాదల్ని న్యాయపూరితమైన దారుల్లో పొందటానికి ఇష్టపడతారు.

డబ్బు విషయాల్లో వచ్చిన అవకాశాన్ని ఎన్నడూ జారవిడుచుకోరు. అలాఅని చెప్పి నిర్లక్ష్యంగా ఖర్చుపెట్టరు.

ముసలితనంలో వచ్చే కష్టాలగురించి ఇప్పటినుంచే భయపడుతూ ఉంటారు. జీవితభీమా చెయ్యటం, డబ్బుమదుపు చేయటం లాంటి పనులు అనేకం చేస్తారు.

వీరితో పరిచయమున్న ప్రతి ఒక్కరూ దాదాపు ఏదో ఒక సమయంలో వీరి దగ్గరనుంచి అప్పుతీసుకున్నవాళ్ళే అయి ఉంటారు. కానీ వీరిని అందరూ పిసినారులుగానే భావిస్తూ ఉంటారు. ఎవరైనా వీరిని పిసినారులు అంటే బాధపడనవసరం లేదు. ఎందుకంటే అలా అన్నవాళ్ళే వీరి దగ్గరకి త్వరలో అప్పుకోసం వస్తారని వీరికి తెలుసు.

వీరు ఏ వ్యక్తిని ఎక్కడ ఉంచాలో అంతలో ఉంచటానికి ఇష్టపడతారు.

## స్పేసింగ్ :

తను వ్రాయవలసిన మేటర్ని ఒక కాగితంలో ఎక్కడ ప్రారంభించి, ఎక్కడ పూర్తి చేయాలి అనే దానిమీద ఆ వ్యక్తి మనస్తత్వం ఆధారపడి ఉంటుందని ఇదే ఛాప్టర్ లో ముందు ప్రస్తావించటం జరిగింది. ఈ క్రింది ప్రతులను పరిశీలించండి.

కాగితంలో మేటర్ వ్రాసే పద్ధతిని ఆరురకాలుగా విడగొట్టవచ్చు.

1. మొదట ఎక్కువ ఖాళీ స్థలం వదిలి చివర్లు నింపటం.
2. మొదట తక్కువ ఖాళీ స్థలం వదిలి ప్రారంభించటం.
3. చివర్లో ఇంకా ఎక్కువ ఖాళీ స్థలం ఉండగానే పేజీ త్రిప్పేయటం.
4. పేజీ చివరి వరకూ వ్రాయటం.
5. ఎడమవైపు, కుడివైపు, పైనా, క్రిందా ఎక్కడా ఖాళీ స్థలం లేకుండా కాగితాన్నంతా వ్రాతతో నింపటం.
6. నాలుగువైపులా ఎక్కువ ఖాళీ స్థలం వదలటం.

వ్రాసేటప్పుడు పైన ఎక్కువ ఖాళీ స్థలం ప్రారంభిస్తే ఆ వ్యక్తికి చొరవ తక్కువగా ఉంటుంది. ఏదైనా ఒక నిర్ణయాన్ని అవతలి వ్యక్తి తీసుకుంటే బావుణ్ణు అని సదా భావిస్తాడు. సాధారణంగా ఈ వ్యక్తి మర్యాదకి విలువిచ్చేవాడు, ఇతరుల అభిప్రాయాన్ని గౌరవించేవాడు అయి ఉంటాడు.

పై విధంగా కాకుండా పేజీ పైనుంచి వాక్యాన్ని ప్రారంభించే వాళ్ళు ఎక్కువ పొదుపరులు అయి ఉంటారు. వీరికి సాంకేతిక విషయాలవల్ల ఎక్కువ ఆసక్తి ఉండదు. అలాగే ఏ విషయాన్నయినా లోతుగా వెళ్ళి శోధించాలి అనే తపన తక్కువగా ఉంటుంది.

కాగితంలో ఇంకా ఎక్కువ ఖాళీ ఉండగానే పేజీ తిప్పేసి, తరువాత పేజీలో వ్రాసేవాళ్ళు ఎక్కువ ఎమోషనల్‌గాను,

అవసరమైనదానికన్నా ఎక్కువ బాధ్యతాయుతంగాను ప్రవర్తిస్తారు. వీరికి సెక్స్ పరమైన అభద్రతా భావం కూడా చోటు చేసుకొని ఉంటుంది.

కాగితం చివరి వరకూ వ్రాసి అప్పుడు కానీ పేజీ తిప్పని వాళ్ళు ఎక్కువ మెటీరియలిస్ట్‌లు అయివుంటారు. వీరు మానసికమైన విషయాలకన్నా శారీరకమైన విషయాలకి ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు.

పేజీకి నాలుగువైపులా అస్సలు మార్జిను వదలకుండా పేజీనంతా వ్రాతతో నింపేవారు తమ అభిప్రాయాలని చెప్పటానికి మొహమాటపడని వాళ్ళని అతి భయంకరంగా ఎదుర్కోవటమే కాకుండా అవసరమైతే వాళ్ళతో సంబంధాలను తెగతెంపులు చేసుకోవటానికి కూడా సిద్ధపడతారు.

నాలుగువైపులా ఎక్కువ ఖాళీస్థలం వదిలేవారు ఒకరకమైన అభద్రతా భావంతో బాధపడుతూ ఉంటారు. వీరు ఎక్కువగా ఒంటరితనాన్ని కోరుకుంటారు. కానీ ఒంటరి తనమంటే ఇష్టపడరు. పరస్పర విరుద్ధ భావాలతో సతమతమవుతూ ఉంటారు. వీరు సమాజంలో తమయొక్క ఇంట్రావర్షన్‌ని, తమ యొక్క రిజర్వ్‌డ్ నెస్‌గా భావించి సంతృప్తి చెందుతూ ఉంటారు.

## మొదటి భాగం సమాప్తం

# రెండవభాగం

ఈభాగంలో ముఖ్యంగా-ఒక వ్యక్తి తన చేతివ్రాతలో ఉపయోగించే ఇంకురంగు, అతను అడ్రస్ విధానం, ఖాళీగా వున్నప్పుడు గీసే గీతలు, అన్నిటికన్నా ముఖ్యంగా-అతడు పెట్టే సంతకం-వీటి గురించి విశ్లేషిద్దాం.

ఒక మనిషి యొక్క మనస్తత్వాన్ని, అతడు ఖాళీగా వున్నపుడు చేసే పనుల బట్టి కరక్ట్‌గా విశ్లేషించవచ్చు. ఉదాహరణకి కొంతమంది ఖాళీ సమయాల్లో చేతిలో వున్న పెన్నుతో రకరాల బొమ్మలని గీస్తూ వుంటారు. మరికొందరు కాగితం లేకపోతే, టేబిల్ మీద కూడా బొమ్మలూ, పేర్లు చెక్కుతూ వుండటం మనం చూస్తుంటాం. ఇలాంటివి క్లాస్‌రూమ్స్‌లో ఎక్కువగా చూడొచ్చు. టేబిల్స్‌మీద, బాత్రూం గోడల మీద బొమ్మలు వెయ్యటం కూడా సర్వ సామాన్యమైన విషయం. కొంతమంది వయసులో ఎంత ఎదిగినా, కూడా ఇలాంటి పనులు చెయ్యడాన్నిబట్టి అతడు మానసికంగా ఎంత ఎదిగాడో గమనించవచ్చు. ఈ వివరణలోకి వెళ్లేముందు మనం ఒక్కసారి 'బాట్రేసియామార్నే', గురించి తెలుసుకుందాం.

బాట్రేసియామార్నే ఒక జర్నలిస్ట్. కానీ, ఆమె జర్నలిస్ట్‌గా కన్నా, గ్రాఫాలజిస్ట్‌గానే ఎక్కువ పేరు పొందింది. ఆమె మీద జనం ఎంత నమ్మకం వుంచారంటే, వివాహం కోసం భాగస్వామిని సెలెక్ట్ చేసుకునేటప్పుడు, లేక ఉద్యోగాలకోసం అభ్యర్థులని సెలెక్ట్ చేసుకునేటప్పుడు వారివారి చేతి వ్రాతలను ఈమెకు పంపి అభిప్రాయాన్ని కోరటం - ఈమె గొప్పతనాన్ని, గ్రాఫాలజీలో వుండే ప్రవేశాన్ని సూచిస్తుంది.

'మార్నే' అమెరికాలోని ఒక స్కూల్లో గ్రాఫాలజీ బోధిస్తోందంటే, ఈ శాస్త్రం గొప్పతనాన్ని వారు ఎంతగా గుర్తించారో తెలుసుకోవచ్చు. న్యాయవాదులు, పోలీసులు కూడా చేతివ్రాతలని పరిశీలించే విషయాల్లో ఈమె సహాయాన్ని కోరటం గ్రాఫాలజీ ప్రాముఖ్యతని తెలుపుతుంది.

మనం ఈ ఛాప్టర్‌లో తర్వాతి అధ్యాయాలలో సంతకాల గురించీ, విరామ సమయాల్లో మనుషులు గీసే గీతలు గురించి చర్చించబోతున్నాం.

ముఖ్యంగా పాఠకులు గమనించవలసిందేంటంటే, ప్రతీ సంతకాన్నీ విశ్లేషించటం సాధ్యం కాదు. అందువల్ల తమ సంతకాలలో ఏ యే విభాగాలు, తర్వాతి ఛాప్టర్‌లో ఇచ్చిన ఉదాహరణల్లో దేనికి దగ్గరగా సరిపోతామో, వాటినిబట్టి తమ గుణగణాలని పరిశీలించుకోవాలి. ఉదాహరణకి ఒక వృత్తం తన సంతకం చుట్టూ గీసేవారిని గురించి తెలిపితే, అది అర్ధవృత్తమైనా పూర్తి వృత్తమైనా, తాము ఆ విభాగానికి చెందినవారేనని భావించాలి.

ఇప్పుడు మనం పైన చెప్పిన విషయాలని వివరంగా పరిశీలిద్దాం.

# సంతకాలు :

ప్రతీ దేశానికి ఒక జాతీయగీతం, ఒక జెండా వున్నట్లుగానే ప్రతీ మనిషికి ఒక సంతకం వుంటుంది.

సంతకాన్ని 'వ్యక్తిత్వం యొక్క సీల్' అనొచ్చు.

'ఒక మనిషి తన గురించి తను ఏమనుకుంటున్నాడో అతని సంతకం కరక్ట్‌గా చెప్తుంది' అంటారు గ్రాఫాలజిస్టులు. తను ప్రపంచాన్ని ఏ విధంగా చూడాలనుకుంటున్నాడో, తనని ప్రపంచం ఏ విధంగా చూడాలనుకుంటుందో-ఒక మనిషి సంతకంలో ప్రస్ఫుటమౌతాయని గ్రాఫాలజిస్టులు నమ్ముతారు.

సంతకాన్ని 'ఈగో సింబల్' గా గుర్తించవచ్చు.

ఒక ప్రొఫెషనల్ గ్రాఫాలజిస్టు ఒక మనిషి చేతివ్రాతకన్నా, అతని సంతకాన్ని చూసే మనస్తత్వాన్ని కరక్ట్‌గా చెప్పగలను అంటాడు. కానీ, ఎప్పుడూ ఒక సంతకాన్నే కాకుండా, మొత్తం వ్రాతనంతా పరిశీలించి చివర సంతకాన్ని దానికి అన్వయించి ఆ మనిషిని విశ్లేషించటం మంచిపని.

సంతకం సైజు, అక్షరాల వంకర, చివర పెట్టే రెండు చుక్కలు, సంతకం ప్రారంభించబోయేముందు గీసే పెద్ద గీత, మధ్యలో వదిలేసే అక్షరాలు, సంతకం చుట్టూగీసే సర్కిల్, సంతకంలో ఆ వ్యక్తి ఉపయోగించే పెద్ద అక్షరం ఇవన్నీ గ్రాఫాలజిస్టుకి తోడ్పడతాయి. పైకి ఇవన్నీ మామూలు విషయాలుగా కనబడ్డా, లోతుగా పరిశీలిస్తే ఇందులో చాలా అర్థాలున్నా యనిపిస్తుంది. కొంతమంది సంతకం పెట్టేటప్పుడు మొదటి అక్షరం మీద బాగా ఆధారపడితే, ఇంకొందరు చివరి అక్షరాన్ని బాగా వ్రాసి సంతకం పూర్తి చేస్తారు.

ఈ రకరకాల సంతకాల మీద ఏ విధంగా వాళ్ల మనస్తత్వం ఆధారపడి వుందో మనం ఇప్పుడు చర్చిద్దాం.

ఒక మనిషి యొక్క మూడ్ ని, కోపాన్ని, విసుగుని, నిర్లక్ష్యాన్ని, వీటన్నిటనీ కూడా మనం సంతకంలో గమనించవచ్చు. అదేవిధంగా వయసు పెరిగేకొద్దీ జీవితంలో అతడి ఒడిదుడుకులను కూడా అతని సంతకం ప్రతిబింబిస్తుంది. దీనికి ప్రధానమైన ఉదాహరణగా ఈ క్రింది రిచర్డ్‌నిక్సన్ సంతకాన్ని పరిశీలించండి.



*Richard Nixon's changing signature*

*In 1959, as Vice President*

*In 1969, beginning his first term at the White House*

*Shortly before his resignation*

*Example 85*

ప్రారంభంలో తన రెండు పదాల మొదటి అక్షరాలని చాలా క్లియర్‌గా స్పష్టంగా వ్రాయటం జరిగింది. కానీ, కాలక్రమేణా అతని శారీరక, మానసిక స్థాయి ఏ విధంగా క్రుంగిపోతూ వస్తున్నదో. తర్వాత్తర్వాత సంతకాలు తెలుపుతాయి.

మొదట్లో క్లియర్‌గా అర్థమయ్యేలా వున్న అతని సంతకం, అతని యొక్క 'జీవితంలో పైకి రావాలి' అనే కోర్కెను తెలుపుతుంది. కుడివైపు వంగిన అతని అక్షరాలు జీవితం పట్ల అతనికున్న ధృఢమైన ధృక్పథాన్ని తెలుపుతున్నాయి. కానీ ఆ తర్వాత పెట్టిన సంతకంలో అక్షరాలు కుడివైపు కాకుండా నిలువుగా మారటాన్ని గమనించవచ్చు. ఇది అతడు నేర్చుకున్న లౌక్యాన్ని, ప్రాక్టికాలిటీని తెలుపుతాయి. అలాగే అతని మూడో సంతకంలో కనపడిన నిర్లక్ష్య భావం సమయం పట్ల అతనికుండే వత్తిడిని తెలుపుతుంది. నాలుగో సంతకం దగ్గరకొచ్చేసరికి కేవలం గొలుసులాగ సాగిన గీతలు మాత్రమే వున్నాయి. ఇది అతడి యొక్క అభద్రతా భావాన్ని, అవసరానికి మోసం చేసే గుణాన్ని, ఓటమిని సూచిస్తున్నాయి. అదే విధంగా సంతకంలో మొట్టమొదట వున్న కలం ఒత్తిడి తర్వాత లేకపోవటాన్ని కూడా మనం గమనిస్తాం. ఇది అతడియొక్క శరీర ధృడత్వాన్ని కోల్పోవటం కూడా సూచిస్తుంది. అంటే శారీరకంగా అనేకాదు. తక్కువ సంవత్సరాలలో అతనిలో వచ్చిన మార్పుని సూచిస్తుంది.

కొంతమంది చిన్న అక్షరంతో ప్రారంభించి మధ్యలో ఒక చిన్న అక్షరాన్ని వ్రాసి సంతకాన్ని పూర్తి చేస్తారు. మరికొందరు సంతకం చేసిన తర్వాత అడ్డంగా ఒక గీతగీసి కొట్టేసినట్లుగా వ్రాస్తారు. ఈ రకరకాల స్వభావాలన్నీ మనం ఈ క్రింద పరిశీలిద్దాం.

I remain
Rama Rao.

1.A ఒక మనిషి చేతివ్రాత అంతా ఎలా వుందో, అతని సంతకం కూడా అలాగే వుంటే ఆ మనిషి జీవితం పట్ల చాలా బాధ్యతాయుతంగా వుంటాడు. ఆ మనిషి విశ్లేషాత్మక శక్తి, అవతల వ్యక్తులపట్ల సానుభూతి, తనని తాను అవతల వారికి కరక్ట్ ప్రదర్శించుకోవాలన్న ఆసక్తి వుంటాయి. అతను మోసం చెయ్యటానికి ఇష్టపడడు. తనేమిటో తనకు బాగా తెలిసిన ఎనలైజేషన్ అతనిలో వుంటుందని చెప్పొచ్చు..

ఇటువంటి వ్యక్తి కాస్త ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో కూడా బాధపడే అవకాశం లేకపోలేదు.

1 B. సంతకం పూర్తి చేసి, గీతగీసి, క్రింద రెండు చుక్కలు పెడితే ఆ వ్యక్తి తను చేసే పనిపట్ల నమ్మకం గలవాడై వుంటాడు. పెర్‌ఫెక్షనిజం పట్ల చాలా ఆసక్తి గలవాడై వుంటాడు.

తనవాళ్ళను, తన కుటుంబ సభ్యులను సంతోషపెట్టడంలో అమితానందం పొందుతాడు.

ఇటువంటి వ్యక్తులు రాజకీయాల్లో గానీ, వ్యాపారాల్లో గానీ, పబ్లిక్ ఫిగర్ అవటంలో గానీ పెద్ద ఆసక్తి చూపరు. ఒకవేళ చూపినా ఆ యా రంగాల్లో పైకి వచ్చే అవకాశం చాలా తక్కువ.

జీవితంలో ఎక్కువ మార్పులని కానీ, రిస్క్‌గానీ ఆశించరు.

వీళ్లు తీసుకున్నంత గట్టి నిర్ణయాలని వేరెవ్వరూ తీసుకోలేదని చెప్పొచ్చు. ఒక యోధుడు ఈటె విసరబోయే ముందు లక్ష్యాన్ని ఎన్నుకొని, తలవెనక్కువంచి విసిరినట్లుగా, వీరుకూడా లక్ష్యాన్ని ఎన్నుకొని ఈటె విసరటం ప్రారంభిస్తారు.-

కానీ, చిక్కేమిటంటే, కార్యదీక్షతో పని ప్రారంభించబోయే ముందు వీరు ఎన్నుకున్న లక్ష్యం కాస్త పక్కకి జరిగినా కూడా, ఆ హడావిడిలో గుర్తించలేరు.

వీరు సాధారణంగా భోళా మనుషులు.

ఆత్మాభిమానం కోసం పెద్దల నుంచి రావలసిన ఆస్తిపాస్తులను విసిరికొట్టే అలవాటు వీళ్లల్లో వుంటుంది.



2.A. కొంతమంది సంతకం పెట్టబోయే ముందు ఒక గీతతో ప్రారంభిస్తారు. ఆ గీత నిలువుగా వుండొచ్చు లేక పై నుంచి దిగుతూ వుండవచ్చు. అలాగాక పై ఉదాహరణలో చెప్పినట్లుగా క్రిందనుంచి పైకైనా సాగవచ్చు. ఇటువంటివైపు సంతకాన్ని గుర్తించాలంటే, ఆ గీతతో సంతకం మొదలవుతుందా లేదా అనేది పరిగణనలోకి తీసుకోవాలి. ఇలా గీతంతో సంతకాలని ప్రారంభించే వ్యక్తులు తమ ఆశయాలు పక్కవాళ్లకి ఇబ్బంది కలిగిస్తున్నా పట్టువీడని వ్యక్తులైవుంటారు. వీరి మంకుతనం, మొండి పట్టుదల వెనుక వున్న అమాయకత్వం అర్థంచేసుకునేవాళ్లకి మాత్రమే అర్థమౌతుంది.

ఇతరులు తమని సున్నితంగా ట్రీట్ చెయ్యాలని కోరుకుం టారు. అయితే, వీరు ఇతరుల నుంచి ఏమి ఆశిస్తారో, దానికి పూర్తిగా భిన్నంగా ప్రవర్తిస్తారు.

తమకున్న వస్తువులనుగానీ, ప్రేమనుగానీ, ఇతరులకు ఇవ్వటంలో ఎంతో ఆసక్తిని ప్రదర్శించే వీరు ఇతరుల నుంచి అటువంటి ప్రతిస్పందన రాకపోతే మాత్రం చాలా బాధపడతారు.

అన్యాయాన్ని ఎదిరించటానికి మానసికంగా చాలా సిద్ధపడివున్న వీరు, శారీరక బాధలని మాత్రం తట్టుకోలేకుండా అవసరమైన దానికన్నా ఎక్కువ లాలిత్యంతో వుంటారు.

ఇటువంటి సంతకం స్త్రీలదైతే వీరు పిల్లలనీ, భర్తనీ అవసరమైన దానికన్నా ఎక్కువగా ప్రేమించి వాళ్ళకోసం ఎటువంటి· త్యాగానికైనా సిద్ధపడతారు. అయితే వాళ్లు మాత్రం తమ వ్యక్తిత్వానికి అడ్డుగోడలైతే ఎటువంటి పరిస్థితుల్లోనూ సహించలేరు.

2B మొదటి రెండు మూడు అక్షరాలని స్పష్టంగా వ్రాసి, చివరి అక్షరాలని వదిలివేయటం, కొంతమంది నిర్లక్ష్యాన్ని సూచిస్తుంది. ఉదాహరణకి పైన ఇచ్చిన సంతకంలో 'లక్ష్మి' అన్న మొదటి రెండక్షరాలనీ స్థిరంగా వ్రాసి, తర్వాత అక్షరాలని కలిపేసి ఒక చిన్న గీతతో సంతకాన్ని పూర్తి చెయ్యటాన్ని గమనిస్తాం. నిజానికి ఆ మొదటి చివరి గీతలకన్నా తన అక్షరాల్ని పూర్తి చెయ్యటంలో ఆమె ఎక్కువ శ్రద్ధ చూపించి ఉండవచ్చు. ఇదే మనస్తత్వం ఆమె వ్యక్తిగత జీవితాన్ని కూడా ప్రస్ఫుటింప చేస్తుంది. అవసరమైనదానికన్నా, అనవసరమైన విషయాలకి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వటం ఈ సంతకంలో గమనించవచ్చు. మొదటిగీత, చివరగీత పెట్టి, చివరి మూడక్షరాలని ఆమె పూర్తి చెయ్యకపోవటం ఆమెయొక్క అస్థిర మనస్తత్వాన్ని సూచిస్తుంది. సంతకంలో పూర్తి అక్షరాలని వ్రాయని వారికి ఈ విశ్లేషణ వర్తిస్తుంది. (అయితే, ఇదే విధానంలో, మొదటగానీ, చివరగానీ, 'అసలు' గీతలు గీయకుండా, అక్షరాల్ని వదిలేసేవారు, జీవితంపట్ల పూర్తి అధికారం వున్న వారై వుంటారు)

3.



సంతకం పెట్టి చుట్టూ ఒక వృత్తం ద్వారా దాన్ని పూర్తి చేసినవారు సాధారణంగా ఇంట్రావర్ట్లై, రిజర్వ్డు మనస్తత్వం కలిగినవారై ఉంటారు. పై ఉదాహరణలో జయ అనే ఆమె తన రెండో అక్షరాన్ని వ్రాయకపోవటం గమనించండి. ఇలా సంతకంలో మొదట అక్షరాలు వ్రాయకుండా చివరి అక్షరాలకి ప్రాముఖ్యత ఇచ్చేవారు తనకన్నా స్నేహితుల్ని ఎక్కువ ఇష్టపడేవారై ఉంటారు. అవతలి వారికి తమ మీద ప్రేముందో లేదో తెలుసుకోవటానికి చిన్న పిల్లల్లాగ వారినుంచి ఏదో ఒకటి ఆశిస్తుంటారు.

జీవితంలో నాలుగయిదు సార్లు ఘోరంగా విఫలమయిన తరువాతే వీరు జీవితం గురించి, దాని ఆటుపోటుల గురించి తెలుసుకో గలుగుతారు. ఈరకం సంతకంలో అక్షరాలు గుం(డంగా ఉంటే, వాళ్ళు ఎక్కువ ఆప్యాయత చూపేవాళ్ళై ఉంటారు. అంతే కాకుండా రెండు మూడు అక్షరాల తరువాత ఖాళీ వదిలి సంతకాన్ని మరో అక్షరం ద్వారాకానీ, రెండక్షరాల ద్వారా కానీ పూర్తిచేసేవాళ్ళు మానసికంగా చాలా ఉన్నతులు, అవతలి వారిని అర్థం చేసుకునే అవగాహన ఉన్నవాళ్ళు అయి ఉంటారు.

సంతకాన్ని మొత్తం ఒక వృత్తంతో చుట్టకుండా అందులో ఒక అక్షరాన్ని మాత్రమే సర్కిల్‌తో గానీ, సగం సర్కిల్‌తోగానీ, పూర్తి చేసేవాళ్ళు వాస్తవాన్ని గ్రహించే దృక్పథంలేని వాళ్ళై ఉంటారు. ఒక పనిని పూర్తి చేసి గానీ వదలని వాళ్ళయి వుంటారు. ('శ్రీకాంతరావు' అనే సంతకాన్ని గమనించండి)

4.



పై సంతకంలో ముఖ్యంగా మూడు విషయాలని గమనించవచ్చు. (A) అక్షరాలు కుడి వైపుకి వంగి ఉండటం. (B) సంతకం పెట్టిన తరువాత ఒక గీత ద్వారా గానీ, రెండు గీతల ద్వారా కానీ ఆ సంతకాన్ని కొట్టి వేయటం. (C) అక్షరాలు కోణాల్లో వుండటం.

A. కుడివైపు అక్షరాలు వంగి ఉండటం ఆ వ్యక్తి తనమీద తాను నమ్మకం కలిగి ఉండటాన్ని సూచిస్తుంది. అంతే కాకుండా తన యొక్క ఎమోషన్ మీద తనకి కంట్రోల్ లేకపోవటాన్ని కూడా సూచిస్తుంది. వత్తిళ్ళకి లొంగిపోయే మనస్తత్వం ఈ సంతకం ద్వారా బయటపడుతుంది. అక్షరాలు అవసరమైన దానికన్నా ఎక్కువ పొడుగుగా ఉండటం జీవితంలో ఏదో సాధించాలన్న తపనని సూచిస్తుంది.

తన సంతకాన్ని తనే రెండు గీతల ద్వారా కొట్టి వేయటం రాజకీయ లక్షణాన్ని, అవతలి వారిని మోసం చెయ్యాలనే ఉద్దేశాన్ని సూచిస్తుంది.

B. సంతకమంతా పూర్తయిన తరువాత దాన్ని కోడిగుడ్డు ఆకారపు వృత్తం ద్వారాగానీ, గీతద్వారాగానీ, కొట్టివేయటం, ఆ వ్యక్తి యొక్క ఆడంబరత్వాన్నీ, పదిమందిలో తనో ప్రత్యేకమైన వ్యక్తిగా కనబడాలనే ఉద్దేశాన్నీ, సూచిస్తుంది. ఇటువంటి సంతకాలు పెట్టేవారు సాధారణంగా అహంభావులై వుంటారు. ఆ అహంభావానికి తగిన సామర్థ్యముంటే ఫరవాలేదు కానీ, లేకపోతే మాత్రం అవతలి వాళ్ళు వీరిని చూసి నవ్వుకునే ప్రమాదం ఉంది.

C. అక్షరాల్లో ఉండే కోణాలు ఆ మనిషి యొక్క నిర్ణయాలు తీసుకునే లక్షణాన్ని సూచిస్తుంది. ఇలా సంతకాలు కోణాలతో పెట్టేవారు సాధారణంగా తొందరగా నిర్ణయాలు తీసుకునే సామర్థ్యం కలిగి ఉంటారు.

వీరిలో ఉన్న గొప్పతనం ఏమిటంటే వీరికన్నా బాగా చదువుకున్నవారు, వీరికన్నా గొప్ప తెలివి తేటలున్నవారు ఏదన్నా ఒక సలహా ఇస్తే ఏమీ బాధపడకుండా వీరు దాన్ని అమలు జరిపే వారై వుంటారు.

కపటం, నేర్పరితనం, ముడుచుకుపోయే స్వభావం వీరిలో సాధారణంగా కనపడదు.

ఇళ్ళు కట్టే వ్యాపారంనుంచి, కెమెరా ముందు నటించటం వరకు ఏదైనా చేయగల సమర్థత్వం వీరిలో ఉంటుంది.

5.



A. సంతకంలో క్రాంతి అనే అక్షరంలో సున్నాని వ్రాయకపోవటం ఈ వ్యక్తి తనమీద తనకున్న నమ్మకాన్ని తెలియజేస్తుంది. సంతకంలో

మొదటి అక్షరం మాత్రం వ్రాసి, తరువాత కొన్ని అక్షరాలు మానేసి, చివరిలోమళ్ళీ పూర్తి అక్షరాలు వ్రాసి సంతకాన్ని పూర్తి చేసేవాళ్ళు సాధారణంగా తనని ప్రపంచం ఎక్కువ గుర్తించాలన్న తపనతో ప్రారంభించి, ఆ పనిని పూర్తి చేయలేని వారై ఉంటారు.

B. ఈ సంతకంలో వత్తులు, గుణింతాలు గుండ్రంగా ఉండటం గమనించండి. అంతకు ముందు చెప్పిన రంగరాజు అనే సంతకంలో కోణాలుంటే ఈ సంతకంలో అర్ధవృత్తాలు గమనించవచ్చు. ఇలా తమ సంతకంలో వత్తుల్ని, గుణింతాల్ని అర్ధవృత్తాకారంలో గుండ్రంగా వ్రాసేవారు ప్రతీదాన్ని ఎక్కువ ఊహించుకునే మనస్తత్వాన్ని కలిగి ఉంటారు. వీరికున్న అసహనం వీరిని అధికశాతం 'మానసిక అనారోగ్యా'నికి గురి చేస్తుంది.

వీరు చేసినంత సమర్ధతతో ఇంకెవరో పనులు చేయలేరు. ఒక్కోసారి ఈ అవసరమైనదానికన్నా ఎక్కువగా ఉన్న ఆత్మ విశ్వాసం సవాలక్ష నష్టాలకి కూడా దారి తీయకపోదు.

వీరికి జీవితంపై ఎక్కువ ఉత్సాహం, తృష్ణ ఉంటాయి. అయితే నలుగురిలో ప్రత్యేకంగా చిన్నవయసులోనే గుర్తింపబడాలనుకోవటంతో ఎదురుదెబ్బలుతినే ప్రమాదం కూడా లేకపోలేదు.

C. సంతకంలో ఒక విధమైన లయలేకపోవటం మనిషియొక్క అస్థిర స్వభావాన్ని సూచిస్తుంది. పై సంతకంలో 'క' అనే అక్షరాలు రెండున్నాయి. ఒక అక్షరం కుడివైపుకి, ఇంకొక అక్షరం ఎడమవైపుకి వంగి ఉండటం గమనిస్తాం. రెండు రకాల వంపులు ఒకే సంతకంలో ఉంటే వారు తమకి కవలసిన విధంగా వాదించగల శక్తి కలిగి ఉంటారు. అయితే ఇది తాత్కాలికమైన విజయాన్ని మాత్రమే సాధించగలుగుతుంది.

6.

A ఈ సంతకంలో దాదాపు ప్రతి అక్షరాన్నీ గుణింతమో, వత్తో కొట్టివేయటం జరుగుతుంది. అంతే కాకుండా రెండు మూడు అక్షరాల్ని కలిపి గొలుసు వ్రాతలాగా వ్రాసి, మొత్తం సంతకాన్ని ఒకే గొలుసులా కాకుండా మూడు భాగాలుగా విడగొట్టడం జరిగింది. సంతకాన్ని భాగాలుగా విడగొట్టేవారు తమని ప్రపంచం బాగా గుర్తించాలి అన్న అభిప్రాయంతో ఉంటారు. ఇది ఇంగ్లీషు సంతకాలకి కూడా వర్తిస్తుంది. వీరిలో సెక్స్ భావనలు కొద్దిగా ఎక్కువ పాలు ఉంటాయని గ్రాఫాలజిస్టులు భావిస్తారు. ఉత్సాహం, ఒక పనిపట్ల దృఢనిశ్చయము ఇటువంటి వ్యక్తుల్లో గమనించివచ్చు.

B. అక్షరాలను దారాల్లా వ్రాస్తూ సంతకాన్ని పూర్తి చేసేవారు లౌక్యులు, టాక్ట్ తెలిసినవారు, మానసిక విశ్లేషణని ఎక్కువ ఉపయోగించేవారు అయి ఉంటారు. ఇతర వ్యక్తులతో వీరి సంబంధాలు చాలా బావుంటాయి.

ఉత్తరమంతా ఏసైజు అక్షరాలతో వ్రాస్తారో సంతకం కూడా అదే సైజులో ఉండటం మనం ఇక్కడ గమనిస్తాం. ఇటువంటి సామీప్యత ఉన్నవాళ్ళు తమకులేనిదాన్ని బయటవాళ్ళకు చూపించటానికి అంతగా ఇష్టపడరు. వీళ్ళు నమ్మకస్థులై ఉంటారు.

C. అక్షరాల్ని గుణింతాల్ని కిందకి దింపి కొట్టివేయటం గానీ, బాగా సాగదీసి కొట్టేయటం గానీ చేసేవారు మూడీ వ్యక్తులై ఉంటారు. అయితే వారియొక్క మూడ్ కి ఏ విధమైన హానీ ఉండదు. ఉదాహరణకి, ఏదైనా హోటల్లో భోజనం బాగలేకపోతే అగ్గిమీద గుగ్గిలమై గొడవ చేసే ఈ వ్యక్తులు ఆ భోజనాన్ని సర్వ్ చేసిన వెయిటర్ చిరునవ్వు చిందించి మర్యాద చూపిస్తే వెంటనే అతనిపై ఆప్యాయతని కురిపిస్తారు. అయిదురూపాయలు టిప్పు ఇవ్వటానికి కూడా వెనుకాడరు.

ఇటువంటి సంతకాలు ఇంగ్లీషులో ఉన్నప్పుడు సాధారణంగా 'T'అనే అక్షరం తాలుకు గీతని బాగా సాగదీసి ఆ గీతతో మిగతా అక్షరాలని కొట్టివేసేవారు కూడా ఈ విభాగంలోకే వస్తారు.

పై సంతకంలో 'రావు' అనే అక్షరాల్లో 'రా' తాలూకు గుణింతం చివరి భాగాన్ని 'వా' తాలూకు వృత్తానికి సరిచేసి వ్రాయటం గమనించవచ్చు. ఇలాగ ఒక అక్షరం తాలూకు చివరి భాగాన్ని, తరువాతి అక్షరం తాలూకు మొదటి భాగానికి సరిచేసి వ్రాసేవాళ్ళు ఎక్కువ ధైర్యసాహసాలు కలిగిన వారై ఉంటారు.వీరు శారీరకంగా ఏ మాత్రం దెబ్బతిన్నా తల్లకిందులై పోతారు. అయినా కూడా మొండి పట్టు విడవరు. వీరు పొరపాటున అనారోగ్యంతో మంచం పట్టారంటే వీరిని కదలకుండా ఉంచటానికి సంకెళ్ళు వేసినంత పని చేయాలి. ఎంతో అనారోగ్యం ముంచుకు వస్తే తప్ప వీరు మంచం ఎక్కటానికి సిద్ధపడరు. మానసికంగా కూడా, ఎంతో పెద్దదెబ్బ తగిలితే తప్ప మానసికంగా బెదిరిపోరు.

7.



ఈ సంతకంలో మనం అయిదు రకాలైన విశ్లేషణలని గమనించవచ్చు. A. సంతకం ఎడమవైపు క్రిందకి, కుడివైపు పైకి లేలటం B మొదటి అక్షరం ఒక్కటే స్పష్టంగా వ్రాసి తరువాతి అక్షరాలన్నీ నిర్లక్ష్యంగా వ్రాసి సంతకం పూర్తి అయిందనిపించటం, C. మిగతా చేతివ్రాత కన్నా అక్షరాలన్నీ చాలా చిన్నసైజులో ఉండటం D అక్షరాలు ఎడమవైపుకి వంగివుండటం E సంతకం చివరిగీత ఎడమ వైపుకి రావటం.

A. చేతి వ్రాతంతా కాగితానికి తిన్నగా ఉండి, సంతకం మాత్రం కుడివైపు లేచి ఉంటే ఆ వ్యక్తులు అన్యాయాన్ని ఎదుర్కోవటానికి ఇష్టపడే మనస్తత్వం కలిగి ఉంటారు. సంతకంలో ఏ విధమైన ఆర్ధ్రత లేకపోవటం కూడా గమనించవచ్చు. వీరు సాధారణంగా పక్కవాళ్ళపట్ల అవసరమైన దాని కన్నా ఎక్కువ ఆప్యాయతలు ప్రదర్శించకుండా వీలైనంత వరకు మెటీరియలిస్ట్‌లుగా ఉంటారు.

B. పైన చెప్పిన ఉదాహరణల్లో రంగరాజు అనే వ్యక్తి సంతకంలోని అక్షరాలు కుడివైపుకి వంగి ఉంటే ఈ సంతకంలో ఎడమవైపు వంగి ఉండటాన్ని గమనించవచ్చు. ఇది తనలో తానే ఇంట్రావర్ట్‌గా ప్రవర్తించే విధానాన్ని ఇది తెలియజేస్తుంది.

C. ఉత్తరంలో మిగతా అక్షరాల కన్నా సంతకంలో అక్షరాలు చిన్నగా ఉండటాన్ని ఆ మనిషి యొక్క అపనమ్మకాన్ని తెలియజేస్తుంది. వీళ్ళు సాధారణంగా ప్రతి చిన్న విషయానికి క్షమాపణ చెప్పుకునే మనస్తత్వాన్ని కలిగి ఉంటారు. ఒక పనిలోకి ఉత్సాహంగా చొచ్చుకుపోయే గుణాన్ని కలిగి ఉండరు.

D. సంతకంలో కేవలం మొదటి అక్షరాన్ని పెద్దగా వ్రాసి, మిగతా అక్షరాలన్నీ చిన్నవిగా, అస్పష్టంగా ఏదో సంతకం పూర్తి చేయాలి కాబట్టి చేసేవారు అవతలి వారు చెప్పే దానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వరు. అవతలి వారు చెప్పేది చెబుతూ ఉంటే వీరు వింటున్నట్టు నటిస్తూ తమ ఆలోచనలో మునిగిపోతారు. ఇటువంటి వ్యవహారాలు మనసుకి సంతృప్తినిచ్చినా ఒక్కొసారి ఇబ్బందుల్లో పడేసే ప్రమాదం ఉంది.

ఇటువంటి వ్యక్తులు స్వతంత్రతకు ప్రాధాన్యత ఉన్న ఏ రంగాన్ని ఎన్నుకున్నా రాణిస్తారు. అంతే తప్ప నలుగురితో పాటు నారాయణా అనుకొని ఉండటానికి ఇష్టపడరు. అలా ఉంటే వీరికి చాలా అసంతృప్తిగాను, అసహనంగాను ఉంటుంది.

మొదటి అక్షరం సంతకంలో బాగా పెద్దదిగా ఉన్నవాళ్ళు ఏదైనా ఒక వ్యాపారం వారిని ఆకర్షిస్తే వారికున్న పాత అప్పులు మరిచిపోయి, కొత్త అప్పులు చేసి ఆవ్యాపారాన్ని మొదలు పెడతారు. వీరు విజయాన్ని ఎంజాయ్ చేసినంతగా జీవితంలో మరిదేన్నీ చెయ్యరు.

E. సంతకం చివరగీత కుడినుంచి ఎడమకి తిరిగితే వారు రచన, సాహిత్యం, సంగీతం పట్ల అభిలాషవున్న వారై వుంటారు. లౌక్యాన్ని ఉపయోగించి పనులు జరిపించుకోవటం వీరికిష్టం ఉండక పోవటం వల్ల, ఇతరుల వల్ల వీరికి జరగవలసిన పనులు జరగకుండా ఆలస్యమయ్యే ప్రమాదం ఉంది.

# డూడ్లింగ్

ఈ ప్రపంచంలో ఒక్కో మనిషి ఒక్కొక్క వ్యక్తిత్వాన్ని, ఒకరకం మనస్తత్వాన్ని కలిగి వుంటాడు. ఏ ఇద్దరి చేతి వ్రాతలో ఒకలా వుండనట్లే, ఏ ఇద్దరి మనస్తత్వాలూ ఒకలా వుండవు. కొంతమంది వయసుతో పాటు మానసికంగా ఎదుగుతారు. మరికొంతమంది వయసు పెరుగుతున్నా చిన్న పిల్లల మనస్తత్వాన్ని కలిగి వుంటారు.

ఒక్కొక్క అనుభవానికి ఒక్కో వ్యక్తి ఒకోలా ప్రవర్తిస్తూ వుంటాడు. కొంతమంది చిన్న ఆనందాన్నీ, విషాదాన్ని, కూడా విపరీతంగా బహిర్గతం చేస్తుంటారు. కొంతమంది ఎంత విషాదమొచ్చినా తొణకరు. అలాగే ఆనందించవలసిన టైమ్‌లో కూడా బిర్రబిగుసుకు పోయి రిజర్వ్‌డ్ గా వుంటారు.

ఏ వయసులో ఏ రకంగా వుండాలీ అనేది ప్రతి మనిషీ తనకి తాను నిర్ణయించుకోవాలి. ఒక వయసొచ్చేక (నడివయస్సులో) హుందాతనం చాలా అవసరం. అలాగే యవ్వనంలో వున్నప్పుడు రిజర్వ్‌గాను, ఇంట్రావర్ట్ గానూ వుంటే చూసే వారికి అంత బాగోదు.

సాధారణంగా మనిషి ఒంటరిగా వున్నప్పుడు అతని ఆలోచనలు రకరకాలుగా సాగుతూ వుంటాయి. అనాలోచితంగా కొన్ని పనులు చేస్తుంటాడు. చేతిలో కలం వుంటే బొమ్మలు గీయటం, సంతకాలు పెట్టడం, కాగితం మీద వృత్తాలు గీయటం - లాంటివి చెస్తూంటారు. మరికొందరు కాగితం లేకపోయినా సరే, బల్ల మీదో, గోడమీదో ఇలాగీస్తుంటారు.

మనం జాగ్రత్తగా గమనిస్తే 5-12 ఏళ్లమధ్య వయసు వున్న పిల్లలు ఈ విధంగా చాక్‌ఫీస్‌తో గోడలమీద గచ్చులమీద గీస్తూంటారు. చిత్రం ఏమిటంటే వయసుపెరిగినా కూడా మనం ఈ అలవాటుని మార్చుకోలేం. 25 ఏళ్ళు వచ్చిన తర్వాత కూడా కొందరు ఒంటరిగా వున్నప్పుడు ఈ విధంగా పిచ్చిబొమ్మలు గీస్తూ ఏదో ఆలోచిస్తూ వుంటారు. అది వారి మనస్తత్వాన్ని ప్రస్ఫుటింపజేస్తుంది.

ఇలా బొమ్మలు గీయటాన్ని " డూడ్లింగ్ " అంటారు.

ఈ డూడ్లింగ్‌ని పరిశీలించటం ద్వారా, దాన్ని చిత్రించిన వ్యక్తి మనస్తత్వాన్ని పసిగట్టేవీలుంది. ఒక మనిషి చిత్రించిన బొమ్మబట్టి అతడి ఊహలు, ఆశలు, ఆశయాలు, బాధలు, భయాలు, వ్యక్తిత్వం, సెక్స్‌పట్ల ఆసక్తి, సృజనాత్మకత - వీటన్నిటి గురించి తెలుసుకోవచ్చు.

ఈ డూడ్లింగ్‌ని బట్టి మనస్తత్వాన్ని తెలుసుకోబోయే ముందు మీరు మీ పాత నోట్‌బుక్స్ తీసుకోవాలి. సాధారణంగా నోట్‌బుక్స్ చివరిపేజిల్లో ఇలాంటి బొమ్మలు ఎక్కువ కనిపిస్తాయి. కేవలం మనస్తత్వాన్ని పరిశీలించుకోటానికి బొమ్మలు గీయటం కాకుండా మనం ఎప్పుడో గీసిన బొమ్మలని పరిశీలించాలి.

ఇప్పుడు మనం కొన్ని ఉదాహరణలని ఇక్కడ గమనిద్దాం.

## 1. ముఖాలు :



నవ్వుతూ - లేక - ఏడుస్తూ వుంటే ముఖాలు గీసేవారు అందరితోనూ కలిసిపోయే వారై వుంటారు. అయితే, అందులో విచారంగా వుండే బొమ్మలు గీసేవారు ఏదోతెలియని అసంతృప్తిలోనూ

కోపంలోనూ వ్యవహరిస్తారు. ఒక చిన్న తలవేసి ఒక అస్థిపంజరం లాంటి బొమ్మగీసేవారు సాధారణంగా సమాజం మీద ఒక కసితో వ్యవహరిస్తూ వుంటారు. ఆడపిల్లల బొమ్మలు, ఆడపిల్లల ముఖాలు గీసేవాళ్ళు అమ్మాయిలైతే, అది వారికి తన కుటుంబ సభ్యుల మీదున్న ఆప్యాయతను తెలియజేస్తుంది. అదే మగవాళ్లైతే వారి యొక్క "ఈడిపస్ కాంప్లెక్స్" ని సూచిస్తుంది.

కాగితాల మీద కాకుండా గోడలమీద తలుపులమీద ఇలా ఆడపిల్లల బొమ్మలు గీసేవారు సెక్స్ కోరికలు తీరని అబద్రతా భావంతో వుంటారు.

ఒక్క మొహం బొమ్మ మాత్రమే వేసి అందులో కళ్ళూ ముక్కూ నోరూ గీసేవారు ఎక్కువ ఒంటరితనంతో గడపటానికి ఇష్టపడతారు. ఎవరికీ పరిపూర్ణమైన స్నేహితులు కావటానికి ఇష్టపడరు. మనసులో మాత్రం స్నేహం పట్ల చాలా ఇష్టం వుంటుంది. ఇంకొకరు తమని అర్థం చేసుకోలేరేమో అనే భావంతో ఇతరులకి దగ్గరవరు. తాము అవతల వారిని ప్రేమించటం మొదలు పెడితే, తాము ప్రేమించినంత అవతల వాళ్ళు తమని ప్రేమించ లేరేమోననే భయం వీరిలో చోటు చేసుకుని వుంటుంది. నిజంగా వీళ్ళు ప్రేమించడం మొదలు పెడితే ఎవ్వరూ ఆపలేరు.

## 2. ముగ్గులు, పజిల్స్, అల్లికలు :



సాధారణంగా ఇలాంటి ముగ్గులు స్త్రీల నోట్‌బుక్స్‌లో గమనిస్తూవుంటాం. ఒక వేళ పురుషులెవరైనా ఇలాంటి ముగ్గులు

గీస్తే వారిలో వున్న ఫిమినేనిటీని ఇది తెలియజేస్తుంది.

ఖాళీ సమయాల్లో కాగితాలమీద పజిల్స్‌గానీ, నక్షత్రాలు గానీ గీసేవారు కళలపట్ల ఎక్కువ ఆసక్తి కలిగి వుంటారు. పజిల్స్ వేసేవారు ఆర్థిక పరమైన ఇబ్బందుల్లో వుండి, సతమతమయ్యే వాళ్లయి వుంటారు. ఖాళీగా వున్న సమయాల్లో నక్షత్రాలు గీసేవాళ్లు భావుకులు, లలితకళల పట్ల ఉత్సాహం వున్నవాళ్లు, చదువులపట్ల ఆసక్తి కలవారు అయివుంటారు.

ముగ్గులు గీసేవారు ఒంటరి తనంతో బాధపడేవారై వుంటారు. వీరియొక్క సౌశీల్యాన్ని, మంచితనాన్ని, ప్రేమించే గుణాన్ని అవతలివారు అర్థంచేసుకోలేరు. అందువల్ల వీరు మానసికమైన ఒంటరితనంతో బాధపడుతున్నారని చెప్పుకోవచ్చు.

## 3. గీతలు, వృత్తాలు, ఆకులు, మొక్కలు :



గీతలు, వృత్తాలు గీసేవారు ఎక్కువగా అంతర్ముఖులై వుంటారు. అయితే ఎదుటివారి మీద ప్రేమ, దయకూడా కలిగి వుంటారు. ప్రేమలో పడ్డవారిని ఈరకమైన డూడ్లింగ్‌ల్తో చాలా సులభంగా గుర్తుపట్టవచ్చు.

వృత్తాలు గీయటం ప్రేమకు సూచన. ప్రేమ వివాహం చేసుకొని కొత్తగా కాపురం పెట్టిన వారి ఇళ్ళల్లో పుస్తకాలని మనం గమనిస్తే, ఇలాంటి వృత్తాలను చూడవచ్చు.

ఆకులు, రెమ్మలూ గీసేవాళ్ళు తమ తల్లిదండ్రుల పట్ల, పిల్లల పట్ల ఎక్కువ ఆప్యాయత చూపేవాళ్ళు, సంసారబంధం పట్ల ఎక్కువ కట్టుబడేవాళ్ళు అయివుంటారు.

హార్ట్ (హృదయం) బొమ్మలు, వాటిమధ్య బాణం గుర్తులు. లవ్‌డిజైన్లు గీసేవారు - ప్రేమపట్ల దృఢమైన అభిప్రాయం లేని వారై వుంటారు. విచిత్రంగా కనిపించినా ఇది నిజం. ఒకరి కన్నా ఎక్కువమంది చేత ప్రేమించబడాలని, తాము మాత్రం ఎవర్నీ ప్రేమించ కూడదని గుర్తింపు ధోరణి కలవారు ఈ విధమైన డూడ్లింగ్ చేస్తారు.

వీరు నిజానికి చాలా తెలివితేటలున్నవారు. సగటు మనిషితో పోల్చుకుంటే కొన్ని మెట్లు ఎత్తుమీద వున్నవారు అయివుంటారు. అందువల్ల కొంత వరకూ వీరి అభిప్రాయం కరక్టే కానీ, జీవితం గడిచేకొద్దీ తాము ఎవరినీ ప్రేమించక, తమని ఎవరూ ప్రేమించక అశాంతితో బాధపడే అవకాశం వుంది. అందువల్ల ఇటువంటి డూడ్లింగ్ గీసేవారు ఒక మెట్టు కిందికి దిగి, తమ కన్నా క్రింది స్థాయిలో వున్నవారినైనా సరే ప్రేమించి ప్రేమింపబడటం అవసరం.

## 4. కత్తులు, తుపాకులు, బాణాలు:



ఖాళీ సమయాల్లో కత్తినీ, తుపాకినీ, విల్లునీ గీసేవారు ఒక విధమైన కట్టడిలో పెరిగిన వారై వుంటారు. వీరు జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు తాము అనుకున్నది సాధించగలుగుతారు. వీళ్ళని ప్రేమించే వారికన్నా, వీరు ప్రేమించేవారు తక్కువగా వుంటారు. అయితే, అవతలవాళ్ల ప్రేమకి వీరు తగిన గుర్తింపు ఇవ్వరు.

## 5. సంతకాలు, దేవుడి పేర్లు:

మనం చాలామంది పుస్తకాలమీద దేవుడి పేర్లు రాయటం గమనిస్తూ వుంటాం. కాగితం నిండా తమ సంతకాన్ని పెట్టడం కూడా చూస్తూంటాం

దేవుడి పేర్లు రాయటాన్ని రెండు రకాలుగా విభజించవచ్చు.
1. స్పృహలో వుండి రామకోటి వ్రాసినట్లు పుణ్యం కోసం వ్రాయటం.
2. ఏదో ఆలోచిస్తూ అనాలోచితంగా దేవుడి పేర్లు వ్రాయటం.
ముందే చెప్పినట్లు డూడ్లింగ్ అంటే స్పృహలో వుండి చేసే చర్యకాదు. కేవలం అనాలోచితమైన చర్య మాత్రమే.

ఈ విధంగా కాగితం మీద దేవుడి పేర్లు వ్రాసేవారు చిన్నప్పటినుంచి తల్లిదండ్రుల కస్టడిలో పెరిగిన వారై వుంటారు. తమ మీద తమకి నమ్మకం తక్కువైన వాళ్లై వుంటారు. తమ వాళ్ళని, తమ పిల్లలని మనస్ఫూర్తిగా ప్రేమించేవారై వుంటారు. ఏదైనా తప్పుచేసినా సరే ఆ తప్పుని తాము చేయలేదని మనస్ఫూర్తిగా నమ్మేవాళ్ళు ఈ కోవలోకి వస్తారు.

అలాగే ఖాళీగా వున్నప్పుడు కాగితాలమీద చిత్తు సంతకాలు పెట్టే వాళ్ళు ఇండివిడ్యుయలిస్టులు, తమమీద తమకి నమ్మకం వున్నవాళ్ళు, తమని కేంద్రబిందువుగా చేసుకుని నిరంతరం ఆలోచించేవాళ్ళయి వుంటారు. ఈ సంతకాల్లో కూడా ఒక్కోసారి పెద్దసంతకం పెట్టి మరోసారి పొడి అక్షరాలతో పూర్తిచేసి కాగితం నిండా ఈ విధంగా రకరకాల సంతకాలు చేసేవాళ్ళు అవతల మనిషి మీద నమ్మకం తక్కువ వున్న వాళ్లై వుంటారు. జీవితంలో ఏదో ఒకటి చేసి ఎలాగైనా పైకి రావాలి అనే స్వభావాన్ని కలిగిన వారై వుంటారు. మనిషికి మనిషికీ మధ్యవుండే సంబంధాల పట్ల వీరికి ఎక్కువ నమ్మకం వుంటుంది. అందువల్ల అందరూ మంచివారని భావించి వారిని నమ్మడానికి ప్రయత్నిస్తారు.

కాగితం మీద ఆశ్చర్యార్థకాలు, ప్రశ్నార్థకాలు గీసేవాళ్ళు జీవితంలో ఎప్పుడూ ఒకరకమైన ఉద్వేగానికి లోనవుతుంటారు. వీళ్లది చిన్న పిల్లల మనస్తత్వం. ఆనందమొచ్చినా, విషాదమొచ్చినా పట్టలేరు. చిన్న పిల్లల మనస్తత్వం అని చెప్పి వీళ్ళని తక్కువ అంచనా వెయ్యలేం. ప్రపంచంలోని మేధావులందరూ మానసికంగా చిన్న పిల్లలే అన్న విషయాన్ని మనం మరిచిపోకూడదు.

## 6. పూలు, ఫ్యాక్టరీలు, ఇళ్ళు, కిటికీలు :



వీళ్ళు జాలి, దయ కలిగి ఇతరులు మెచ్చుకునే విధంగా ప్రవర్తిస్తారు. తమ ఆలోచనలని తమప్లాన్లని తమ భవిష్యత్తుని ఇతరులతో చర్చించటానికి చాలా ఇష్టపడతారు.

సరళ స్వభావికులు, మృదు సంభాషణాచతురులు, భావుకులు, ఎక్కువగా పూలబొమ్మలు గీస్తుంటారని గ్రాఫాలజిస్టులు చెబుతారు.

ఒక పువ్వు గీసేవారు ఇంట్రావర్టులయితే, ఒకటి కన్నా ఎక్కువ గీసేవారు ఎక్స్ట్రావర్ట్లై వుంటారు. పూలతోపాటు ఆకులూ రెమ్మలూ గీసే వారు ఏ పనైనా మొదలుపెడితే పూర్తి చేసే వరకూ విశ్రమించని గుణం కలిగిన వారై వుంటారు. అలాగే కిటికీ ఊచలు, కిటికీలు, తెరుచుకున్న కిటికీలు.. ఈ బొమ్మలు గీసే వాళ్ళు విశ్లేషణాత్మక శక్తి కలిగి వుంటారు.

## 7. ఓడలు, విమానాలు, కార్లు :

మానసికంగా టెన్షన్ అనుభవిస్తూ జీవితం నుంచి తప్పించుకోవా లనుకునే వారు ఈ విధమైన బొమ్మలు గీస్తుంటారు. తీరని ఆశలు

తీర్చుకోవాలన్న తపన, నిరాశ, అశక్తత ఒకవైపు, ఇంకోవైపు వీటన్నిటినీ అధిగమించాలనే మనస్తత్వంలో ఘర్షణ పడేవారు కూడా ఈ రకమైన బొమ్మలు గీస్తారు.



## 8. జంతువులు, పక్షులు, పాములు :



ఖాళీ కాగితం చూస్తే చాలు దానిమీద పక్షుల బొమ్మలు గీసే వాళ్ళు రంగురంగుల ప్రపంచాన్ని ఊహించే భావుకులై వుంటారు. జంతువుల బొమ్మలు గీసేవాళ్ళు సాటి మనిషిని నమ్మని స్వభావం గలవారై వుంటారు. పట్టుదలకి చిహ్నంగా వీళ్ళని పేర్కొన వచ్చు.

పైన చెప్పిన రకరకాల విశ్లేషణలో ఏ విభాగానికి మీరు మిమ్మల్ని అన్వయించుకుంటారో ముందు గుర్తించుకోండి. ఒక్కొక్కప్పుడు మీరు రెండు విభాగాలకి చెందిన వారై వుంటారు. ఉదాహరణకి మీకు ముగ్గులు వెయ్యటం, పక్షి బొమ్మలు వెయ్యటం అలవాటనుకుందాం. ఆ రెండు విభాగాలలో ఆయా డూడ్లింగ్స్‌కి ఇచ్చిన విశ్లేషణని మీ స్వభావానికి అన్వయించుకోవాలి.

## ఇంకురంగు :

మనిషి మనస్తత్వాన్ని కనిపెట్టటంలో అతడు వాడే ఇంకుయొక్క ప్రాముఖ్యత అంతగా లేదు. అయినా కూడా గ్రాఫాలజిస్టులు మనిషి వ్యక్తిత్వానికి, అతడు వాడే ఇంకురంగుకి కొంతవరకూ దగ్గర సంబంధం వున్నట్లుగా భావిస్తున్నారు.

సాధారణంగా ఎక్కువమంది 'బ్లూ బ్లాక్' ఇంకులు ఉపయోగిస్తారు.

వాడే ఇంకురంగునిబట్టి గుణగుణాలని పరిశీలిద్దాం.

**బ్లూ :** ఈ రంగు ఉపయోగించేవారు స్నేహస్వభావం కలిగి వుంటారు. తమపనిపట్ల సిన్సియర్‌గానూ ఎదుటివారిని అర్థం చేసుకోవటం లోనూ, వారిని ఆదరించడంలోనూ వారికి ఒక మార్గదర్శకులుగానూ వ్యవహరిస్తారు. అయితే వీరికి ఏ విషయంలోనూ కూడా ఒక అవగాహన, పట్టుదల వుండవు. పదిమంది వెళ్ళే దారిలో వెళ్ళాలనే మనస్తత్వం తప్ప, ఒక కొత్త మార్గాన్ని ఎన్నుకోవాలని గానీ, కొత్త విషయాన్ని శోధించి కనిపెట్టాలని గాని వీరికి అంతగా ఆశక్తి వుండదు.

**బ్లూ బ్లాక్ :** వ్యాపార విషయాల్లో ఉత్సాహం వున్నవారు, రాజకీయాల్లో నైపుణ్యం వున్నవారు ఈ రకం రంగు వాడతారు. వీరు చేసే ప్రతీపని ఒక పద్ధతిలో హుందాగా వుంటుంది. వీరు చాలా డిగ్నిఫైడ్ గా వుంటారు. వీరి పరిచయాన్ని పెంచుకోడానికి అవతలి జనం ఉత్సాహపడుతూ వుంటారు.

**రాయల్ బ్లూ :** సాధారణంగా దీన్ని వృత్తిపరంగా ప్రావీణ్యం సంపాదించేవారు (డాక్టర్లు, సంఘసేవకులు, లాయర్లు) వాడతారు.

ఈ రంగు వాడటానికి ఉత్సాహం చూపించేవారిలో సాధారణంగా దయాగుణం, స్నేహస్వభావం, జాలి ఎక్కువగా వుంటాయని గ్రాఫాలజిస్టులు అంటారు.

బ్లాక్ : తమ యొక్క వ్యక్తిత్వాన్ని పదిమందీ గుర్తించాలనుకునే వారు బ్లాక్ బాల్ పాయింట్ పెన్ను గానీ, ఇంక్ పెన్ను గాని వాడతారు. పెద్ద పెద్ద పదవుల్లో వున్న వాళ్ళు, గొప్పవాళ్ళు, అధికారం చలాయించాలనుకొనే వాళ్ళు దీన్ని ఉపయోగిస్తారు. నల్లరంగు బాల్‌పెన్ను గాని, కలం గానీ వాడే స్త్రీలు భవిష్యత్తు పట్ల నిర్దిష్టమైన అవగాహన కలిగివుండి చాలా తెలివిగా వ్యవహరిస్తారు. జీవితంలో ఏదో సాధించాలనే తపన వీరికుంటుంది.

డార్క్ బ్రౌన్ : ఇంజనీర్లు, నిర్మాణాత్మకం ఆలోచించాలనే తపనవున్నవాళ్ళు, సంఘంలో బాధ్యతాయుతమైన పదవికి రావాలనే కోర్కెవున్న వాళ్ళు డార్క్ బ్రౌన్ ఉపయోగిస్తారు. సాధారణంగా విద్యార్థుల్లో ఈ రకం రంగువాడేవారు చాలా తక్కువ.

గ్రీన్ : ఒంటరిగా, ప్రశాంతంగా, ఈ సంఘానికి దూరంగా వుండాలని అనుకునేవారు గ్రీన్‌రంగుని వాడతారు. వీరికి అనూహ్యమైన తెలివితేటలుండి అందర్ని ఆకర్షించగలుగుతారు. పదిమందిని తమవైపు తిప్పుకో గలుగుతారు. నాయకత్వ లక్షణాలు ఎక్కువ కానీ, ఈ రంగు ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌ని కూడా సూచిస్తుంది.

రెడ్ : అందరిలోను తాము ప్రత్యేకంగా కనిపించాలనుకునేవారు ఈ రంగు వాడతారు. అధికారయుతమైన గొప్పతనం కనిపించాలని, మిగతావాళ్ళకన్నా తమకి ఎక్కువ తెలుసని ఈ రంగు కలం ఉపయోగించేవారు భావిస్తూ వుంటారు. మిగతా వారికన్నా తామే శక్తి వంతులమని వీరి నమ్మకం. అయితే, ఒక విషయాన్ని సూటిగా గమ్యం వైపువెళ్ళేలా చేయడానికి గాని, ఒక పని చెయ్యటానికి పూర్తి అవగాహన గాని వీరికి వుండదు.

# అడ్రస్‌లు :



ఈ పుస్తకంలో చాలాసార్లు మీమీ మనస్తత్వాలని పరిశీలించుకోటానికి ఎప్పుడో వ్రాసిన వ్రాతలని పరీక్షించుకోమని తరచూ చెప్పటం జరిగింది. ఈ ఛాప్టర్ బట్టి మనస్తత్వాన్ని విశ్లేషించాలంటే, మీరు ఎప్పుడో ఎవరికో వ్రాసిన కవర్‌గానీ, ఉత్తరంగానీ

తీసుకోవాలి.

కొంతమంది, కవరుపైన సరిగ్గా మధ్యలో చిరునామా వ్రాస్తుంటారు. మరికొంతమంది చాలా క్రిందికి వ్రాస్తారు. అడ్రస్ వ్రాసే విధానాన్ని బట్టి మనస్తత్వాన్ని అంచనా వెయ్యొచ్చు. సాధారణంగా అంతరూ కవరు ''మధ్యలోనే'' వ్రాస్తారు. ఏ మాత్రం కాస్త పక్కకి గానీ, క్రిందికి గానీ వ్రాసినా, ఈ క్రింది విభాగాల్లో ఒక దానిలోకి చేరినట్టు భావించాలి. మధ్యలోనే వ్రాశాంకదా అని సంతృప్తి పడకూడదు.

## మధ్యలో వ్రాసేవారు : -

కవరు మధ్యలో కరక్ట్‌గా నాలుగువైపులా సమాన స్థలం వదిలి అడ్రస్ వ్రాసేవారు సరళీకృతమైన ఆలోచనలు కలిగి, చక్కగా జీవితాన్ని తీర్చిదిద్దుకోగలిగిన వారై వుంటారు. వీరు ప్రతీ పనీ-చేసేటప్పుడు, ఆ పని యొక్క ఆనందాన్ని ఆస్వాదించే కంటే, ఆ పని చెయ్యటంలో వుండే జాగ్రత్తని ఎక్కువ అనుభవిస్తారు. వీరు ఎక్కువగా స్నేహపాత్రులు కారు. వీరితో స్నేహం చెయ్యాలంటే ఎన్నో అర్హతలు వుండాలి. వీరి పట్ల అవతల వారికి ఎటువంటి భావం వున్నప్పటికీ, వాళ్లపట్ల వీరికి ఏ భావం వుందో సాధారణంగా బైటపడరు. ఇటువంటివారు జీవితభాగస్వాములైతే, కలిసి జీవించటం చాలా అదృష్టం. కష్టం కూడా।

## బాగా పైన వ్రాసేవారు : -

ఏ ఊరు వెళ్లాలో ఆ ఊరి పేరుని కవరుకి సగంలో వ్రాసి, మిగతా అడ్రస్ అంతా ఆ కవర్‌కి పైనే వ్రాసేవారు.

ఆ విధంగా క్రింద భాగంలో చాలా ఖాళీ వదిలిపెట్టేవారు.

జీవితాన్ని చాలా తేలికగా తీసుకునేవారై వుంటారు. వీరు ఎవర్నీ పట్టించుకోకుండా 'తమ జీవితమేదో తామే గడపాలి, ఆనందంగా బ్రతకాలి' అనే దృష్టి కలవారై వుంటారు. ప్రతి పనిని దాని ఫలితాలు ఆలోచించకుండా మొదలుపెట్టేవారై వుంటారు. వీరు పొదుపరులు, ప్రేమ, స్నేహాలలోకి తొందరగా దిగే స్వభావంకలవారై వుంటారు.

లోతుగా ఆలోచించే స్వభావం, అవతలవాళ్లు తమవల్ల ఏ విధంగా నష్టపోతున్నారనే ఆలోచన వీళ్లలో తక్కువ.

## బాగా క్రిందగా వ్రాసేవారు : -

కవర్ స్టాంప్ క్రింది నుంచి మొదలుపెట్టి, ఊరుపేరు వ్రాయటానికి క్రింద ఖాళీలేక ఇరికించి ఇరికించి వ్రాసేవాళ్ళు భవిష్యత్తుపట్ల అవగాహన లేకుండా వున్నవాళ్ళై వుంటారు. పైన బాగా ఖాళీ స్థలం వదిలేయటం ద్వారా, జీవితంపట్ల వీరెంత నిర్లక్ష్యంగా వుంటారో తెలుస్తుంది. అయితే, జీవితంలో ఎలాగైనా సరే తాము అనుకున్నదానిని సాధించే నైపుణ్యం కలిగి వుంటారు. వీరు జీవితం మొత్తాన్నీ, ఒకస్టేజిలో పోగొట్టుకోవలసి వచ్చినా, ఏమీ బాధపడకుండా తిరిగి పునర్నిర్మించుకోగలమనే ధైర్యాన్ని కలిగి వుంటారు.

## కుడిపక్కగా వ్రాసేవారు : -

కవర్‌కి స్టాంప్ కుడివైపు పై భాగంలో వుంటుంది. ఎడమవైపు మార్జిన్ బాగా వదిలేసి స్టాంప్‌క్రింద (అంటే కవర్‌కి కుడివైపుక్రింద) భాగంలో చివరి వరకూ వ్రాసేవారు అధిక శ్రమపడే నైజం కలిగి వుంటారు. వీరిలో భావోద్వేగం ఎక్కువ. అయితే, ఇతరుల సహాయం మీద, సూచనలమీద జీవించటాన్ని వీరు ఎక్కువ ఇష్టపడతారు. వీరికి ఒక వాహనం వుండి దానిలో ఎడమ పక్కగా వెళుతూ కుడివైపు సందులో తిప్పాలనుకుంటే, ఎడమవైపే ఒక పక్కగా ఆపుచేసి వెనకాలనుంచీ ఒక కిలోమీటర్ దూరం వరకూ ఏ వాహనం రావటంలేదని నిశ్చయించుకున్న తర్వాత అతి జాగ్రత్తగా తమ వాహనాన్ని కుడి వైపుసందులోకి తీసుకువెళ్తారు. ఇటువంటి ఉదాహరణలు వీరి గురించి ఎన్నైనా చెప్పొచ్చు.

## పూర్తిగా ఎడం వైపు వ్రాసేవారు : -

కవర్ అంచునుంచి మొదలు పెట్టి స్టాంప్ పరిసరాల్లో వ్రాసుకుంటూవచ్చి ఖాళీ వదిలే వారు ఎక్కువ సిగ్గుపడేవారు, తమ

భావాలని ఎవరికీ చెప్పుకోలేని వారు అయివుంటారు. వీరికి నమ్మకం తక్కువ. ఏ విషయాన్నీ సీరియస్‌గా తీసుకునే నైజం వీరికుండదు. ఒక ఊరు ప్రయాణం చెయ్యవలసివస్తే, ఆ ట్రెయిన్ సాయంత్రంమైతే, ఉదయం పది గంటల నుంచే తమ సామాన్లని తరచూ లెక్కపెట్టుకోవడం అనేది ఇటువంటి వాళ్ల మనస్తత్వానికి ఒక ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

## ఎడమప్రక్క క్రింది భాగం :

కవర్‌కి ఎడమపక్క పైభాగంలో బాగా ఖాళీ వదిలి క్రింద ఒక మూలగా (సాధారణంగా ఫ్రం అడ్రస్ వ్రాసేచోట) అడ్రస్ వ్రాసేవారు అన్యాయ, కోపం అనుమానం పాలు ఎక్కువగా వున్నవారై వుంటారు. వీరు ఇంట్రావర్ట్‌లైవుంటారు. అవతలవాళ్ళు తమ గురించి ఏ మనుకుంటున్నారనే భయం కలిగి వుంటారు. అయితే, వీరిలో మృదుస్వభావం, అవతలవాళ్లని అర్థం చేసుకునే గుణం వుండటం వల్ల వీరితో స్నేహం చేసేవారు నెమ్మదిగా వీళ్ళని గుర్తించగలుగుతారు.

## కుడిప్రక్క క్రింది భాగం :

స్టాంపుకి క్రింది భాగంలో కవర్‌కి కుడి పక్క మూలగా చిన్న అక్షరాలతో అడ్రస్ వ్రాసేవారు మెటీరియలిస్టులు. వీరు స్వేచ్ఛని విపరీతంగా కోరుకుంటారు. అయితే, వీరికి ఏ విషయంలోనూ ప్రత్యేకమైన అభిప్రాయం వుండదు. ట్రెయిన్ సాయంత్రం అయిదు గంటలకైతే, అయిదుగంటల రెండు నిమిషాలకి స్టేషన్‌కు చేరుకుని వెళ్తున్న ట్రెయిన్ ఆఖరి కంపార్ట్‌మెంట్‌లోకివురికి దూకటం వీరి నైజానికి మంచి ఉదాహరణ.

## పైనుంచి క్రిందికి వ్రాసేవారు :

కవర్ యొక్క ఎడమ భాగం పై చివర్లో మొదటి అక్షరం ప్రారంభించి కవర్ క్రింది కుడి భాగం చివర్లో చివరి అక్షరం వ్రాసి అడ్రస్ పూర్తి చేసేవారు సుపీరియారిటీ కాంప్లెక్స్‌గానీ లేదా మితిమీరిన

ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ వల్ల తాము సుపీరియర్ అని నిరూపించుకోవాలనే గుణం గానీ కలిగినవారై వుంటారు. వీరికి ఎదుటివారి పట్ల, కోపం అసూయలు ఎక్కువ.

## పేరు, ఊరిపేరు క్రింద గీతలు గీసేవాళ్లు:

వీరు వినమ్రులు హోదా, పేరుకీ పెద్ద ప్రాముఖ్యం ఇవ్వకుండా అవతలవాళ్ళని గుర్తించటంలో సంతృప్తి పొందుతుంటారు. మంచివ్యక్తిత్వానికి వీళ్ళని ఉదాహరణగా చెప్పుకోవచ్చు. అయితే, కంపార్ట్మెంట్ నుంచి దిగేటప్పుడు ట్రెయిన్లో పరిచయమైన వ్యక్తి సూట్కేస్ ను కూడా బైట వరకూ తీసుకొచ్చి అవతల వ్యక్తి చేత మంచి అనిపించుకోవాలనే గుణం కలిగి వుంటారు.

# ఒత్తులు, కామాలు, ఫుల్‌స్టాప్‌లు, పేరాగ్రాఫ్‌లు :

చేతి వ్రాతలో ఎక్కువ ఆశ్చర్యార్థకాలుగానీ ఎక్కువ చుక్కలుగానీ, చిన్నగీతలు (-) గానీ ఎక్కువగా వుంటే అది మనిషి ఆడంబరాన్ని సూచిస్తుంది. తను చెప్పదల్చుకున్న విషయం కన్నా, ఆ విషయంలో అవతలవాళ్ళని కన్విన్స్ చెయ్యగలుగుతున్నామా లేదా అనే సంశయ భావాన్ని ఇది సూచిస్తుంది.

ఉత్తరాలు వ్రాసేటప్పుడు గానీ, ఏదైనా వ్యాసం వ్రాసేటప్పుడు గానీ ఒక వ్యక్తి ఎక్కువ పేరాగ్రాప్‌లు వ్రాస్తే అది మనిషి సెంటిమెంటల్ మనస్తత్వాన్ని సూచిస్తుంది. ప్రతినాలుగైదు పదాలు తర్వాత ఒక కామాపెట్టటం లేదా చిన్నగీత గీయటం ఆ వ్యక్తి యొక్క సంక్లిష్టతని సూచిస్తుంది. తన మీదతనకి నమ్మకం లేక పోవటాన్ని కూడా ఇది సూచిస్తుంది.

కొంత మంది రచయితల రచనల్లో ఎక్కువ ఆశ్చర్యార్థకాలని చూస్తుంటాం. ఇది సాధారణ జీవితం నుంచి పైకి వచ్చిన స్వభావాన్ని సూచిస్తుంది. జీవితం అంతా ఎక్సయిటింగ్ గా వున్నవాళ్ళు లేదా అసలు తాము ఊహించని స్థాయికి చేరుకున్నావాళ్ళు ఇలాంటి ఆశ్చర్యార్థకాలని ఎక్కువ పెడుతుంటారని గ్రాఫాలజిస్టులు భావిస్తారు.

అక్షరం క్రింద ఒత్తు వ్రాయకుండా, అక్షరం పక్కని గానీ క్రింద నుంచి పక్కకి గానీ ఒత్తులు వ్రాసే వారు తేలిక జీవితాన్ని గడపడానికి ఇష్టపడే వాళ్లై వుంటారు.

## అంకెలు :

ఈ క్రింద ఒక చార్ట్ ఇవ్వటం జరిగింది. మీరు అంకెలన్నీ ఆ విధంగానే వ్రాస్తూవుండక పోవచ్చు. కానీ, ఒకటి నుంచి మున్న

వరకూ మీరు వ్రాసే వీలైనన్ని అంకెలు ఈ క్రింది చార్ట్‌లో దేనికి పరిపోతాయో గుర్తించండి. దానిబట్టి మీ యొక్క మనస్తత్వం క్రింద వివరించటం జరిగింది.

ఉదాహరణకి మీరు నాలుగు అనే అంకెని 'బి' కేటగిరీలో వ్రాసి, ఆరు, తొమ్మిదిలను ఏ కేటగిరిలోలా వ్రాసి, మిగిలిన అంకెలన్నీ 'సి' కేటగిరిలోకి చెందినట్లుగా వ్రాస్తే మీరు 'సి' కేటగిరి విశ్లేషణను కలిగి వుంటారు. అయితే మిగతా రెండు కేటగిరీలను కూడా చదివి మీ మనస్తత్వాన్ని కరక్ట్‌గా అంచనా వేసుకోవచ్చు.

| CATEGORY | | | |
|---|---|---|---|
| A | B | C | D |
| 1 | 1 | 1 | 1 |
| 2 | 2 | 2 | 2 |
| 3 | 3 | 3 | 3 |
| 4 | 4 | 4 | 4 |
| 5 | 5 | 5 | 5 |
| 6 | 6 | 6 | 6 |
| 7 | 7 | 7 | 7 |
| 8 | 8 | 8 | 8 |
| 9 | 9 | 9 | 9 |
| 0 | 0 | 0 | 0 |

పైన నాలుగు రకాల విభాగాలు ఇవ్వటం జరిగింది. ఈ నాలుగు కేటగిరీలలో ఏదో ఒక భాగానికి మీరు చెందాలని లేదు. ముందే చెప్పినట్లు మీరు అంకెలని ఏ విధంగా వ్రాస్తారో నిర్ణయించుకుని దాన్ని బట్టి మనస్తత్వ విశ్లేషణ ప్రారంభించాలి.

## కేటగిరి ఎ:

అంకెలు పొందికగా వ్రాసేవారు రెండురకాలుగా వ్రాస్తారు. ఒకటి పెద్ద అంకెలు. రెండు చిన్న అంకెలు (వీరు సాధారణంగా కలాన్ని

ఎక్కువగా ఒత్తుపెట్టి వ్రాస్తారు) ఈ కేటగిరీలో అంకెలు చిన్నవిగా వ్రాసేవారు మెటీరియలిస్టులు వాస్తవ దృక్పధం కలిగిన వారూ అయివుంటారు. వీరి జీవితాన్ని వ్యాపారంగా తీసుకుంటారు. ఏదైనా పనిలో పూర్తిగా ఇన్వాల్వ్ అయితే తప్ప ఆ పని చేయరు. వీరిలో ఏకాగ్రత ఎక్కువ.

ఇదే కేటగిరిలో అంకెలని పెద్దగా వ్రాసే వారిలో అసహనం పాలు ఎక్కువ. తమమీద తమకి నమ్మకం కూడా ఎక్కువ.

ఈ కేటగిరిలో వ్యక్తులు, తాము అనుకున్న దానికన్నా ముందుగా పనులు పూర్తి చేయటానికి ఇష్టపడరు. చాలా సిస్టమేటిక్‌గా ప్రతీ అంశాన్నీ పరిశీలిస్తూ గమ్యం చేరుకోటానికి ఇష్టపడతారు.

## కేటగిరి-బి :

ఈ కేటగిరిలో అంకెలన్నీ కోణాంతో వ్రాయటం మనం గమనించవచ్చు. ఈ వైపువ్యక్తులకి కొన్ని ఏంక్సయిటీ, టెన్షన్ వుంటాయి. ఇదే కేటగిరిలో అంకెలని ఇంకాస్త అందంగా చెక్కేవారైతే పగటి కలలుకనే స్వభావం కలిగినవారైవుంటారు. వీరు ఎక్కువ నమ్మకస్తులు. పాటివారిపట్ల గౌరవం, అవతలవారి తెలివి తేటలని ఒప్పుకొనేవారై వుంటారు.

## కేటగిరి-సి :

అంకెలని తేలికగా వ్రాసేవారు, అక్షరాలకి ఇవ్వవలసినంత ప్రాముఖ్యత ఇవ్వకుండా అవతలవాళ్లకి అర్థమయితే చాలనుకుని వ్రాసేవారు డబ్బు సంపాదనపట్ల ఎక్కువ ఆసక్తి గలవారై వుంటారు. జీవితంలో ఏ ఆనందం పొందాలన్నా డబ్బే ముఖ్యం అనే అభిప్రాయంతో వుంటారు. వీరి అభిప్రాయాలు చాలాసార్లుకరక్ట్ అవుతూ వుంటాయి. ఇదే వైపు అక్షరాలని మరింత ఒత్తి వ్రాసేవారు డబ్బు సంపాదన పట్ల నిర్లక్ష్య వైఖరి గలవారై వుంటారు. అయినా సరే, వీరికి డబ్బు వచ్చిపడుతూనే వుంటుంది.

కేటగిరి-డి:

అక్షరాలని అందంగా తీర్చిదిద్దాలనే తపన, అంకెలని వ్రాసేటప్పుడు అందంగా దిద్దేవారు ఎక్కువగా భావుకులు, తమను ఎవరూ అర్థం చేసుకోవటం లేదు అనుకునేవారు, తమని తాము సమాజంలో అవసరమైన దానికంటే ఎక్కువగా ప్రొజెక్ట్ చేసుకోవాలనుకునేవారు-అయివుంటారు. వీరు నెమ్మదిగా తమ లక్ష్యాన్ని సాధిస్తారు. అయితే తప్పనిసరిగా తాము అనుకున్న దాన్ని సాధించగలుగుతారు. వీరిలో ఓటమిపాలు ఎక్కువగా వుండదు.

# చిల్డ్రన్స్ హాండ్ రైటింగ్:

స్కూలుకు వెళ్ళగానే పిల్లలు చేసే మొదటి పని తమ హోంవర్కు, చూచివ్రాతలు మాస్టారుకు చూపించడం. పిల్లల చేతివ్రాత గుండ్రంగా, అందంగా రావాలని చూచివ్రాత వ్రాయిస్తుంటారు. కాపీబుక్ గీతల మధ్య చూచివ్రాతలో అందరూ ఒకేలా వ్రాసినా మామూలుగా నోట్సులు వ్రాసినపుడు మాత్రం ఏ ఒక్కరూ ఒకేలా వ్రాయరు. కనీసం వత్తులన్నా ఇతరులతో సంబంధం లేకుండా వ్రాస్తారు. పెద్దవుతున్నకొద్దీ ఈ మార్పులు మరింత విస్తృతమవుతుంటాయి.

సాధారణంగా మనం చుట్టాలింటిలోనో, స్నేహితుల ఇంటిలోనో లేక మరెక్కడైనా గాని వింటూ వుంటాం. "అబ్బా! వీడి చేతివ్రాత ఎంత బాగుందో. వీడు చాలా గొప్పవాడు అవుతాడు" అని! అలాగే "వంకర టింకర గీతలూ, వీడూనూ. ఎందుకూ పనికిరాకుండా పోతాడు వెధవ..." అని కూడా వింటుంటాం.

ఇలా పిల్లల చేతివ్రాతలు చూసి వారిని అంచనా వేయటం అనాదిగా జరుగుతున్నా, వారి గురించి చాలా తక్కువ మాత్రమే తెలుసుకుంటున్నాం. ఎందుకంటే చిన్నపిల్లల్లో ఇలా వ్రాయొచ్చు, ఇలా వ్రాయకూడదు అనే విచక్షణాజ్ఞానం ఉండదు. అలాగే ఇలా వ్రాయాలి, ఇలా వ్రాయకూడదు అనే ఆలోచనా పరిధి కూడా వీరికి ఉండదు.

అక్షరాలు అందంగా వ్రాసే పిల్లలందరూ గొప్పవారవుతారనీ, అలా వ్రాయని వారందరూ ఎందుకూ పనికిరాకుండాపోతారని అనుకోవటం చాలా తప్పు.

పిల్లలు ఆడుతూ, పాడుతూ తమ ఇష్టమొచ్చినట్లు వ్రాసేస్తారు. ఇలా వాళ్ళు వ్రాసిన దానిని బట్టి వారి యొక్క మనస్తత్వాలను, భవిష్యత్తును అంచనా వేయటమే కాకుండా, ఆ సమయంలో వారి మానసికస్థితి ఎలా వుందో తెలుసుకోవచ్చు. వారి యొక్క సమస్యలు, సంతోషాలు, న్యూనతాభావం, ఉద్రేకం... చివరికి తమచుట్టూ ఉన్న మనుషుల మీదా, పరిసరాల మీదా వాళ్ళకు కలుగుతున్న ఏహ్యభావాన్ని కూడా తెలుసుకోవచ్చు.

## పిల్లల్లో టెన్షన్:

వంకరగా, గజిబిజిగా వ్రాసేవాళ్ళు టెన్షన్‌తో నలిగిపోతూ ఉంటారు. మాష్టారిచ్చిన హోంవర్కు చేయలేదనో, కంఠస్థం చేయమన్న పాఠం చేయలేదనో టెన్షన్‌తో వుంటారు. ఒక అక్షరం కుడివైపుకి, మరొక అక్షరం ఎడమవైపుకి వ్రాసే వారికి ఇది ఖచ్చితంగా వర్తిస్తుంది.

అలా కాకుండా నీటుగా, అక్షరాలు గుండ్రంగా వ్రాసేవాళ్ళు మానసికంగా చక్కని స్థితిలో ఉంటారు. వీరు క్లాసు ఫస్టురావటం, మాష్టారడిగిన ప్రశ్నలకు టక్కున సమాధానం చెప్పటం, పెద్దలనుంచి మెప్పు పొందటం జరుగుతుంది. కానీ ఇది ఒక వయసు వరకే పరిమితం. వ్రాతమీద పిల్లవాడు ఎలాటి 'కమాండ్' సంపాదించాడు - అన్నదాని మీదే అతడి తెలివితేటలు ఆధారపడి వుంటాయి. అంతేతప్ప - ఎంత గుండ్రంగా వ్రాసాడు - అన్నదానిమీద కాదు. తరువాత ఇచ్చే వుదాహరణల్లో దీన్ని గమనించవచ్చు.

దిద్దుళ్ళు:

సీతను రాముడు
పరిణయము
చేసెను.

అక్షరాల మీద అక్షరాలు వ్రాసేవాళ్ళు పైకి చాలా నెమ్మదస్తుల్లా కనిపించినా, మానసికంగా చాలా అల్లరి స్వభావం కలిగి వుంటారు దీనివల్ల అసూయ, ద్వేషం అభివృద్ధి చెంది తోటి పిల్లలతో కొట్లాడటం, టీచర్లకు, ఇంట్లోవాళ్ళకు ఎదురుచెప్పటం చేస్తారు. వీరిపై వీరికి నమ్మకం తక్కువవున్న స్థితిని కూడా ఇది సూచిస్తుంది.

కళాత్మకంగా:

చెట్లు ప్రకృతి మనకు ఇచ్చిన
వరము చెట్లు పూలు పూయును. కా
యలు కాయును. పండ్లు ఇచ్చును.
చెట్ల ఆకుల తోను, వేళ్ళతోను మన
మూలికలు తయారు చేయవచ్చును.

ఈ విధమైన చేతివ్రాతలో పిల్లలు పెద్దలనుంచి ధైర్యాన్ని, ప్రోత్సాహాన్ని కోరుతుంటారు. వీరికి చదువులోనేకాక, ఆటల్లోనూ, కళల్లోనూ ప్రవేశం ఉండటంతో చాలా పట్టుదలగల మనుషులుగా తయారవటానికి అవకాశం ఉంది. కానీ వీరిలో కొద్దిమంది ''తప్పించుకుపోయే'' మనస్తత్వం కలిగి ఉండి కొంచెం ఎమోషనల్ గా ప్రవర్తిస్తూ ఉంటారు వీరిని ఎక్కువగా లాలించాలి. వీలైనంతవరకూ ''టూర్స్'' తిప్పాలి.

అస్తవ్యస్తంగా:

అన్నయ్యకు. వ్రాయునది క్షేమము
ఇక్కడ క్షేమము.
నీ క్షేమము వ్రా.
బాగానే చదువుకొంటున్నాను
రాజు

వీరికి "వ్రాయటం" కంటే ఇతర విషయాలమీద ఆలోచన ఉన్నట్టు గమనించవచ్చు వాలుగా, ఒక పద్ధతిలేకుండా వ్రాసిన పద్ధతి వలన వీరి యొక్క అనాసక్తిని తెలుసుకోవచ్చు. వీరికి వీరి శక్తిమీద నమ్మకం లేక ఇతరులను నిందించే తత్వంతో కూడి, త్వరత్వరగా ఆలోచనావిధానాన్ని మార్చుకుంటూ ఉంటారు.

ఒకే విధంగా:

(అ)శోకుడు చెట్లు నాటించెను.
(అ)శోకుడు రోడ్లు వేయించెను
(అ)శోకుడు [illegible] [illegible].

అక్షరాలు నిలువుగా మొదలుపెట్టి, ఒకే విధంగా వ్రాసిన ఈ చేతివ్రాత వారియొక్క సాధారణతను తెలుపుతుంది. మార్పుని, వెరైటీని తట్టుకోలేక అతి మామూలు జీవితానికి అలవాటు పడిపోతారు. వీరు పెద్దయితే వ్యాపారరంగంలో రాణించలేరు.

ముద్దలుగా:

[illegible]

కొంతమంది పిల్లలు వ్రాసేటప్పుడు అక్షరాలపైన ఇంకు పులిమేస్తూ వ్రాస్తూ ఉంటారు. దీనివలన వీరు ప్రతి చిన్నపనికి

ఎక్కువ శ్రమపడుతూ, ఎప్పుడూ ఏదో తెలియని బాధతో ఉంటారు ఇల్లన్నా, పాఠశాలన్నా వీరికి ఇష్టం ఉండదు. నిశ్శబ్దంగా ఎవరికీ పట్టనట్టు ఉంటారు.

స్పష్టంగా:

కొంత ఉప్పునీరు
తీసుకుని వానిలో
పంచదార వేసి,

అక్షరాలు పెద్దవిగా, కొట్టొచ్చినట్టు, స్పష్టంగా కన్పించే విధంగా వ్రాసే ఈ విధానం వల్ల వీరికి ప్రతి విషయంమీదా శ్రద్ధ ఎక్కువగా ఉంటుంది. ప్రతిదాన్ని పొందాలని వీరు ఉబలాట పడుతుంటారు. దేన్నయినా చాలా త్వరగా అర్థంచేసుకోగలుగుతారు. గుర్తింపు కోసం తహతహలాడతారు.

అసాధారణ కోణాలతో:

వచ్చే వేసవి సెలవులకు
మేము మద్రాసు వెళతాం
తర్వాత ఊటీ వెళతాం.

వీరు శ్రద్ధగా చదువుతూ, ఆటల్లో కూడా చాలా యాక్టివ్‌గా ఉంటారు. కానీ కొన్నికొన్నిసార్లు అతిగా కూడా ప్రవర్తిస్తూ ఉంటారు.

వీరికి ఇల్లన్నా, మ్యూజిక్ అన్నా చాలా ఇష్టం. తల్లితండ్రుల పట్ల చాలా ప్రేమగా, భక్తిగా వుంటారు. అటువంటి ఆప్యాయతనే కోరుకుంటారు.

వాలుగా:

అందుకని పాప చూడ
డం వలన సాధ్యాలే
ఎక్కువ. సినిమాల్లో

ప్రతి అక్షరం పెద్దగా, సున్నాలు చుట్టినట్లు వాలుగా వ్రాసే పిల్లలకి వ్యాయామం అన్నా, పరిగెత్తడం అన్నా చాలా ఇష్టం అని తెలుసుకోవచ్చు. వీరు భవిష్యత్తులో మంచి ఆటగాళ్ళుగా తయారవుతారు. సాంకేతికజ్ఞానం వైపు మొగ్గుచూపుతారు.

దూరదూరంగా:

సెలవు కోసం దరఖాస్తు.
నాకు ఈ రోజు జ్వర
ముగా ఉండుట వలన నేను

వీరు తమకంటూ ఒక ప్రత్యేకత ఉన్నట్టు ప్రవర్తిస్తూ, సంఘంలో ప్రత్యేక వ్యక్తులుగా గుర్తింపబడతారు. వీరు ఏపని చేసినా అది ప్రత్యేకంగా కనిపిస్తుంది. పదాల మధ్య దూరం, అక్షరాల యొక్క స్పష్టత వీరియొక్క తెలివితేటల్ని తెలుపుతుంది.

వయసుకన్నా పెద్దగా:

వివిధములైన ప్రక్రియలలో
ట్రక్కులు కూడా తయారు చేయవచ్చు.
దాని ద్వారా మనము ఊపిరి పీల్చు

వీరు వ్రాయటంలో మంచి నేర్పు ఉన్నట్లు వ్రాస్తారు. వీరికి పట్టుదల అధికంగా ఉంటుంది. కానీ కొన్నికొన్నిసార్లు చాలా మూడీగా ఉంటారు. కానీ అంతలోనే నవ్వుతూ, తుళ్ళుతూ ఉంటారు. వీరు చాలా హుందాగా, చలాకీగా ఉండగలుగుతారు.

## వత్తులు-దీర్ఘాలు-సెక్స్

అక్షరాలకు పైభాగంలో వుండే ఒంపులు వ్రాసే విధానం, వత్తులు ఇచ్చే విధానం వారిలోని శృంగారపరమైన భావాలని, అంతర్గతమైన కోర్కెలని, ఉద్రేకాలని తెలియజేస్తాయి. వారు శృంగారంలో ఏమాత్రం చురుకుగా వుంటారు అనేదాన్ని దీన్నిబట్టి అంచనా వేయవచ్చు.

వత్తులు:

స్తు త్రై రై శ్ర న్ర వై

1. త్త వై ళ్ల అక్షరాల క్రింది వత్తులు బలహీనంగా వుంటే ఆ రైటింగ్ గల స్త్రీలు ఫ్రిజిడిటీ వున్నవారుగాను, పురుషులైతే తక్కువ శృంగారాభిలాష గలవారని గ్రహించాలి. వాళ్లకి ఈ లోపం శారీరకంగా, లేదా మానసికంగా, ఇతర అనారోగ్యకారణాల వల్ల వుండవచ్చు

స్తు త్రై శ్ర న్ర వై

2. ఈ వత్తులు మందంగా వుంటే, ఆ వ్రాతగల వ్యక్తులు శృంగారపరమైన ఊహలను ఎక్కువ స్థాయిలో కలిగివుంటారు.

దీర్ఘాలు:

1. దీర్ఘాలలో నిర్దిష్టమైన ఒంపులు, గుండ్రని అక్షరాలు వ్రాసే వ్యక్తులు శృంగారానికి ప్రాముఖ్యత నివ్వరు. తమ ఉద్రేకాలు, కోరికలపై మంచి కంట్రోల్ కలిగి వుంటారు.

2. ఈ ఒంపులు వెడల్పుగా వ్రాసేవారు కలల్లో తేలిపోయేవారు కావచ్చు మానసిక పరిపక్వత లేనివారై వుంటారు. అయితే శృంగారంలో వీరు చాలా ఆసక్తి కలిగి వుంటారు.

3. త్రికోణాకారంలో వుండే ఒంపులు శృంగారపరమైన నిరుత్సాహాన్ని సూచిస్తాయి. భాగస్వామితో విసిగిపోయినవారుగా గుర్తించవచ్చు. స్త్రీలలో ఇలా వ్రాసేవారు తీవ్రమైన సంఘర్షణలతో ఓడిపోయినవారు, డామినేటింగ్‌గా వుండేవారు అయివుంటారు. అదే మగవారి విషయానికొస్తే ఈ విధంగా వ్రాసేవారు విచారంగా, అలవాట్లకు బానిసలై, ఇన్‌హిబిషన్స్ వున్న వ్యక్తులై వుంటారు.

దీర్ఘాల్లో ఒంపులు ఎడమవైపు తిరిగివుంటే అలా వ్రాసేవారు ఒంటరితనంతో బాధపడేవారు, గతం గురించి బాగా ఆలోచించేవారు, పరిసరాలచే ప్రభావం చెందేవారు, మొహమాటాలను కాదనలేనివారు అయివుంటారు. వీరు నిజమైన ప్రేమకు ప్రాణాలైనా అర్పించే భావకులై వుంటారు శారీరకంగా కోర్కె అంతర్గతంగా ఎంతవున్నా, మానసికంగా దగ్గరవ్వందే తృప్తిపడలేరు

కౌ వౌ నౌ టౌ మౌ

గుణింతాల్లో చాలా పొడవైన, వన్నని ఒంపులు వ్రాసేవాళ్లు మనసులోని భావాలను ఆచరించలేనివారు కావచ్చు. వీరు ముక్కుకు సూటిగా వ్యవహరించేవారై వుంటారు. పనిని చివరివరకూ చేయటంలో వున్న శ్రద్ధ, దాని విజయాన్ని ఆస్వాదించటంలో వుండదు వీరికి. వీరిలో ఏమేరకు దొరికితే, శృంగారంలో, అంతవరకే సంతృప్తిపడే గుణం వుంటుంది.

# చేతివ్రాత - ఉద్యోగం

ఒక వ్యక్తియొక్క బలహీనతలు, స్ట్రాంగ్ పాయింట్లు, అతని యొక్క మానసిక స్థాయి, విపత్కర పరిస్థితుల్లో అతను ఎలా ప్రవర్తిస్తాడు అనేవి గ్రాఫాలజీద్వారా తెలుసుకోవచ్చుని ఇంతకు ముందు ఛాప్టర్లలో వ్రాయటం జరిగింది. తెలివితేటలు, సాంఘిక నియమాలపట్ల ఆవ్యక్తి యొక్క ప్రవర్తన, కొత్తదారులు వెతికే ఉత్సాహం, డబ్బువల్ల ఆవ్యక్తికున్న జాగ్రత్త, ఆమనిషి యొక్క అహంభావ స్థాయి, అతడు నమ్మకస్థుడా లేదా అన్నది కూడా గ్రాఫాలజీ ద్వారా తెలుసుకోవచ్చుని చెప్పటం జరిగింది.

ఒక మనిషికి మనం మనదగ్గర ఉద్యోగం ఇస్తున్నా, లేక ఒక కంపెనీ మనల్ని ఉద్యోగంలోకి తీసుకోవాలన్నా ఇటువంటి చిన్న చిన్న విషయాలకే ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తారన్న విషయం మనందరికీ తెలుసు. భారతీయ సంస్థల్లో ఉద్యోగాల కోసం, గ్రాఫాలజీని అంతగా ఉపయోగించకపోయినా, అభ్యర్థి స్వంతదస్తూరితో పెట్టుకున్న అప్లికేషన్ చూడగానే ఇంటర్వ్యూచేసే వ్యక్తికి ఆ అభ్యర్థి గురించి కొంత తెలుస్తుందనేది సత్యం.

గ్రాఫాలజీ ప్రకారం కరెక్టుగా మనిషిని అంచనా వేస్తే, అనవసరమైన అభ్యర్థుల్ని వాళ్ళ చేతివ్రాతను విశ్లేషించటం ద్వారానే తొలగించవచ్చుని నమ్ముతారు కొందరు గ్రాఫాలజిస్టులు. క్రిమినల్ మనస్తత్వాన్ని, మానసిక అనారోగ్యాల్ని కూడా చేతివ్రాత ద్వారా పట్టుకోవచ్చంటారు

కొన్ని ఉద్యోగాలలో మానసికమైన వత్తిడి చాలా ఎక్కువగా ఉంటుంది. కొన్ని ఉద్యోగాలకి ఉదయం నుంచి సాయంత్రం వరకు అసలు మెదడు అవసరం లేకుండా పని చేయాల్సిన అవసరం ఉంటుంది

ఏయే ఉద్యోగాలకి ఎలాటి మనిషి అవసరం అనేది చాలా సులభంగా చెప్పవచ్చు.

ప్రతి మనిషి ఏదో ఒక పాయింట్ దగ్గర బ్రేక్ అవుతాడు. చేతివ్రాతనిబట్టి ఏ మనిషి ఎక్కువస్థాయి మానసికవత్తిడిని తట్టుకుంటాడు, లేక ఏ మనిషి తక్కువస్థాయిలో బ్రేక్ అవుతాడు అనేది కూడా చెప్పవచ్చు. అలాగే తన మనసులో అభిప్రాయాన్ని బయటవాళ్ళకు ఎంతవరకు తెలపగలడు అన్నప్రశ్నకి కూడా ఇందులో సమాధానం దొరుకుతుంది.

ఏదైనా ఒక కంపెనీలోగానీ, సంస్థలోగానీ ఉద్యోగం కావాలనుకుంటే, యాజమాన్యం కోరుకునే అభ్యర్థి లక్షణాలు ఈ క్రింది విధంగా ఉంటాయి.

నమ్మకస్తుడేనా ?

అభివృద్ధి కోసం కష్టపడేగుణం, మేధస్సు కలవా ?

— ఆర్గనైజ్ చేయగలిగే శక్తి వుందా ?

స్నేహపాత్రుడా ? కాదా ?

— ఒక పెద్దపనిని భుజాలమీద వేసుకునే శక్తి ఉన్నదా ? లేదా ?

నాయకత్వ లక్షణాలు వున్నాయా ?

పైకి రావాలనే తపన ఎంతవరకూ వుంది ?

ప్రతీ ఉద్యోగానికి పైన చెప్పినవన్నీ అక్కరలేదు ఒక్కో ఉద్యోగ లక్షణాన్ని బట్టి ఎలాంటి లక్షణాలు కావాలి అనేది ఆధారపడి ఉంటుంది.

## ఎన్నుకునే వృత్తి:

మనం ఏ వృత్తిలో రాణిస్తామనేది భగవంతుడు మనకిచ్చిన శక్తిని బట్టి, దాని ఆధారంగా మనం మన కృషితో పెంపొందించిన ఇతర గుణగణాల్ని బట్టి ఆధారపడి ఉంటుంది ఒక ఉద్యోగంలో ఎందుకూ పనికిరానివాడిగా భావింపబడినవాడు మరో ఉద్యోగంలో పైకి రావచ్చు సినిమాఫీల్డులో చాలామంది అసిస్టెంట్ డైరెక్టర్లుగా

చేరి నటులవటం, అలాగే నటులవుదామనుకొని వచ్చినవారు దర్శకత్వం వైపు వెళ్ళటం చూస్తూనే ఉంటాం. ఏవ్యక్తి ఏ రంగంలో పైకొస్తాడు అనేది ఆ వ్యక్తి యొక్క శక్తి సామర్థ్యంమీద, అతడు పెరిగిన వాతావరణంమీద, అతడి యొక్క అభిలాషమీద, అతడు ఇష్టపడే కళలమీద ఆధారపడి ఉంటుంది. కొన్ని ఉద్యోగాలకి పొద్దున నుంచి సాయంత్రం వరకు మెదడే మాత్రం ఉపయోగించకుండా కేవలం వ్రాతపని మాత్రమే ఉండి ఉండవచ్చు ఎంతో క్రియాత్మక శక్తి ఉన్న మనిషికి ఆ ఉద్యోగమిస్తే అతడు దారుణంగా ఫెయిలవటం సహజం. అలాగే లెక్కల్లో బాగా పరిపూర్ణత్వం ఉన్న వ్యక్తి ఒక డెంటిస్ట్‌గానీ, ఒక పెయింటర్‌గానీ కావాలనుకుంటే అది దురాశే అవుతుంది.

చేతివ్రాతని బట్టి ఒక మనిషి యొక్క గుణగణాల్ని, అతడు ఏయే రంగాల్లో రాణిస్తాడు అనేది తెలుసుకోవచ్చని మనం ఇంతకుముందే చదివాం. అందువల్ల ఒక మంచి గ్రాఫాలజిస్ట్ మనం ఏయే రంగాల్లో రాణిస్తామనేది సులభంగా చెప్పగలడు మనయొక్క బలహీనతలు, మనయొక్క స్ట్రాంగ్ పాయింట్స్, ఎక్కడ మనం రాణించగలం అనేది మనం ఈ గ్రాఫాలజిస్ట్‌ల ద్వారా తెలుసుకోవచ్చు

# భార్య/భర్త-స్నేహితుడు/స్నేహితురాలు:

ఇద్దరు వ్యక్తులు స్నేహం చేయాలన్నా, లేక ప్రేమించి పెళ్ళి చేసుకోవాలన్నా వాళ్ళిద్దరిలో ఒకరికినచ్చేగుణం మరొకరిలో ఉండాలి. అంతేకాకుండా వాళ్ళిద్దరూ జీవితాంతం కలిసుండాలన్నా కూడా వాళ్ళిద్దరిలో కొన్నిలక్షణాలు కామన్‌గా ఉండాలి. అలా అనిచెప్పి అన్నీ ఒకరికి నచ్చేగుణాలు మరొకరిలో ఉంటే ఆసంసారం కూడా పేలవంగా ఉంటుంది అప్పుడప్పుడు చిన్న చిన్న ఘర్షణలు, చిలిపితగాదాలు, ఒకరితప్పుల్ని మరొకరు క్షమించేగుణం ఇవన్నీ కూడా సంసారాన్ని రంజింప చేస్తాయి.

ఏ మనిషీ పరిపూర్ణంగా మంచివాడు కాదు. ఏ మనిషి కూడా పూర్తిగా చెడ్డవాడు కాదు. ప్రతి మనిషి లోనూ కొన్నిలక్షణాలుంటాయి. ఆలక్షణాలు అవతలి వాళ్ళకి (లైఫ్‌పార్టనర్‌కి)నచ్చితే ఆ సంసారం సుఖంగా సాగిపోతుంది లేకపోతే లేదు అంతే. ఉదాహరణకి ఒక స్త్రీకి తన భర్త తనదగ్గిర చిన్నపిల్లాడిలా ప్రవర్తించాలని, ప్రతి చిన్నదానికి తన మీద ఆధారపడాలని ఉంటుంది. అలాగే మరొక స్త్రీకి తన భర్త పరిపూర్ణమైన వ్యక్తిత్వంకల వ్యక్తిగా, తన స్వంత నిర్ణయాలు తను తీసుకునే వ్యక్తిగా ఉండాలని ఉంటుంది. కాబట్టి ఒక మగవాడు చిన్న పిల్లాడిలా ప్రవర్తిస్తే మంచిదా? లేక పరిపూర్ణమైన వ్యక్తిత్వం కల వ్యక్తిగా ప్రవర్తిస్తే మంచిదా? అన్నది ఎవరూ నిర్ణయించలేరు తన కెలాటి వ్యక్తి కావాలో ఆ వ్యక్తి దొరికితే ఆ సంసారం సుఖ ప్రదం. లేక పోతే అది గతుకుల రోడ్డు మీద బండిలా నడుస్తుంది.

చేతివ్రాత బట్టి ఏయేవ్యక్తికి ఎటువంటి పార్టనర్ దొరికితే బావుంటుందో కొంతవరకు విశ్లేషించగలిగారు అలాగే బాయ్‌ఫ్రెండ్ /

గర్ల్‌ఫ్రెండ్ ఎలా ఉంటే ఆస్నేహం ప్రేమలోకిదిగి తరువాత పెళ్ళివైపు దారి తీస్తుందో కూడా కొంతవరకు వీరు విశ్లేషించగలిగారు. ఈ చాప్టర్‌లో మనం ఆ విశ్లేషణని పరిశీలిద్దాం.

ఒకజంట గ్రాఫాలజిస్టుల దగ్గరకి వచ్చి తమ భావివైవాహిక జీవితం ఎలా ఉంటుంది? అని అడిగితే ఆగ్రాఫాలజిస్ట్ ముఖ్యంగా నాలుగు విషయాలని పరిగణలోకి తీసుకుంటాడు 1.ఆ ఇద్దరి మానసికోద్వేగ స్థాయి, 2.సాంఘిక నియమాల పట్ల ఇద్దరి ఆసక్తి స్థాయి, 3.తెలివి తేటల స్థాయి, 4.సెక్స్‌పట్ల ఆసక్తి

పై నాలుగూ చాలా ముఖ్యమైన విభాగాలు. అయితే ఇందులో వేరు వేరు శాతాల నిష్పత్తి పరిగణలోకి తీసుకోవాలి. ఉదాహరణకి భార్య చాలాచిన్న స్థాయిలోనే మానసికంగా ఎక్కువ ఉద్వేగం చెందేదైతే, భర్త చాలా కంట్రోల్డ్‌గా ఉండే వాడై ఉండాలి. ప్రతీ చిన్నవిషయానికీ భార్యా భర్తలిద్దరూ బ్రేక్ అయిపోతే ఆసంసారం సుఖంగా సాగటం కష్టం.

అలాగే భర్త బాగా తెలివి తేటలున్న వాడై, భార్య కాస్త తెలివి తేటలు తక్కువ ఉన్నదైతే ఆ సంసారం ఒకరకంగా సాగిపోతుంది కానీ ఇద్దరూ అతి తెలివి తేటలతోనో, ఇద్దరూ తెలివి తక్కువగానో ఉంటేకష్టం.

పైన చెప్పినరెండు ఉదాహరణల్లో 'ఉద్వేగాల స్థాయి' 'తెలివితేటలు స్థాయి' వీటిలో తేడాలు ఉన్నా ఫరవాలేదు అని చెప్పటం జరిగింది కాని సెక్స్ పట్ల ఆసక్తి ఇద్దరికీ ఒకేరకంగా (అది ఎక్కువగానీ, తక్కువగానీ) ఉండకపోతే చాలా సమస్యలు వచ్చిపడతాయి. అలాగే సాంఘికనియమాలపట్ల కూడా ఇద్దరికీ సమానమైన ఆసక్తి లేకపోతే ఇద్దరూ ఒకరినొకరు డామినేట్ చేసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది.

కాబట్టి పై నాలుగు విభాగాల్లో ఏయే విభాగం ఇద్దరికీ ఎంత శాతం ఉండాలనేది మనం గ్రాఫాలజిస్ట్ రిపోర్టు ప్రకారం తెలుసుకోవచ్చు

సాధారణంగా వైవాహిక జీవితంలో ఒక వ్యక్తి అవతలివ్యక్తి నుంచికోరుకునేవి ఈ క్రింది రకంగా ఉంటాయి

## 1. ప్రేమించేగుణం:

ప్రతీవ్యక్తి తను ప్రేమించాలని, ఇతరులు చేత ప్రేమింప బడాలని కోరుకుంటాడు. దంపతుల్లో ఈ ఆకాంక్ష చాలా బలీయంగా ఉంటుంది. మనుషుల్లో ప్రేమించేగుణం ఎంతున్నా కూడా దాన్ని ప్రదర్శించేగుణం లేకపోతే చాలా కష్టం. మనిషి యొక్క మనస్తత్వం అతని ప్రవర్తన వల్లే బయటపడుతుందంటారు చాలామంది. లోపల భావాలు ఒకరకంగా ఉన్నా బయటికి మరోరకంగా ప్రవర్తించే వాళ్ళు కూడా ఈ ప్రపంచంలో చాలా మంది ఉంటారు. చిక్కంతా ఇటువంటి వాళ్ళతోనే వీళ్ళతో సంసారం చేయాలంటే వీళ్ళ మనసులోతుల్లోకి వెళ్ళి అసలు భావాన్ని పట్టుకోవాలి. భాగస్వామికి అంత ఓపిక లేని పక్షంలో సంసారం నరకమవుతుంది అందువల్ల గ్రాఫాలజిస్ట్లు వీరిద్దరి మనస్తత్వాన్ని పరిశీలించేటప్పుడు ఆజంటల్లో ఇటువంటి గుణం ఉందా లేదా అని నిశ్చయించుకుంటారు. ఉదాహరణకి ఒకవ్యక్తిపైకి చాలా కఠినాత్ముడి గాను, తననిర్ణయాలు ఒకరి సలహా లేకుండా అమలు జరిపేవాడిగాను ఉండవచ్చు కానీ మనసులో ఎంతో దయార్ద్ర గుణం, ప్రేమ ఉండి ఉండవచ్చు. అతడి భార్యకి అతని మనసులోని భావం తెలుసుకోగలిగిన ఓర్పు, నేర్పు లేకపోయి ఉండవచ్చు. వారిద్దరూ మంచి వారయినా సరే, ఆ సంసారం సుఖంగా జరగదు. భార్యకి భర్తని అర్థం చేసుకునేగుణం ఉందా లేదా, భర్తకి భార్యని సుఖపెట్టే అవగాహన ఉందాలేదా అనేది కూడా గ్రాఫాలజిస్ట్లు ఈ విభాగం ద్వారానే తెలుసుకుంటారు.

## 2. సిన్సియారిటీ:

అవతలి వ్యక్తి ఎంతడబ్బున్నవాడైనా, ఎంత అందగాడైనా, ఏ కళలో ప్రవేశమున్నా ..ఒక అమ్మాయి అతడు తనని సిన్సియర్గా ప్రేమించాలని మాత్రమే కోరుకుంటుంది ప్రేమకి సిన్సియారిటీయే క్వాలిఫికేషన్. అలాగే మగవాడు కూడా స్త్రీ తనని సిన్సియర్గా ప్రేమించకపోతే విలవిలలాడిపోతాడు చాలా కేసుల్లో మగవాడిలో ఏ

అర్హత లేకపోయినా స్త్రీ అతనే అంటిపెట్టుకొని మనసా, వాచా, ప్రేమించటానికి కారణం ఆ మగవాడు తనని సిన్సియర్‌గా ప్రేమిస్తున్నాడన్న భావన మాత్రమే. ఈ సిన్సియారిటీ అనేది చేతి వ్రాతలో ప్రస్ఫుటిస్తుంది అని భావిస్తారు గ్రాఫాలజిస్ట్‌లు. భార్యాభర్తలో ఒక వ్యక్తి సిన్సియర్‌గా ఉండి, మరొక వ్యక్తి సిన్సియర్‌గా లేకపోతే ఆ సంసారం పేకమేడల్లా కూలిపోతుంది కాబట్టి చేతి వ్రాతనిబట్టి సిన్సియారిటీని కనుక్కొనే విధానం ద్వారా ఆ సంసారం ముందు ముందు ఎలా సాగుతుందనేది తెలుసుకోవచ్చు

### 3. అవతలి వారిని మెప్పించే గుణం :

ఈ విభాగంలో చాలా విషయాలు చోటు చేసుకుంటాయి. భర్త ఎక్కువ 'సెన్సాఫ్ హ్యూమర్' ఉన్నవాడై ఉండవచ్చు భార్య కొంత రిజర్వ్‌డ్ టైపు అయిఉండవచ్చు అలాగే భర్త ప్రతీ చిన్న విషయానికి విపరీతంగా ఆలోచించే వాడై ఉండవచ్చు భార్య దానికి వ్యతిరేకం అయి ఉండవచ్చు

అవతలి వారిని మెప్పించాలి అంటే చాలా కమ్యూనికేషన్ అవసరం మన మనసులో భావాల్ని, మన అభిప్రాయాల్ని అవతలివారికి చెప్పేకొద్దీ, వారు మనల్ని మరింత అర్థం చేసుకుంటారు. అలా చెబుతున్నందుకు వారు మనల్ని ప్రేమిస్తారు కొంతమంది వ్యక్తులు తమచుట్టూ కోట కట్టుకొని ఉంటారు వీళ్ళని మెప్పించాలన్నా, వీరి చేత మెప్పించబడాలన్నా చాలా కష్టం. ఇటువంటి వ్యక్తులున్న ఇంట్లో నిశ్శబ్దం సదా తాండవిస్తూ ఉంటుంది. చిన్న చిన్న పొగడ్తలు, అభినందనలు, బహుమతులు, కూడా అవతలి వారిని సంతృప్తి పెడతాయి భార్యా భర్తల్లో ఈ గుణాలు ఏయే లెవల్లో ఉన్నాయనేది కూడా గ్రాఫాలజిస్ట్‌లు చేతి వ్రాతద్వారా తెలుసుకుంటారు.

### 4. బాధ్యత :

తమ జీవితభాగస్వామి తమకుటుంబంపట్ల ఎక్కువ బాధ్యతగా ఉండాలని భార్యా భర్తలిద్దరూ కోరుకుంటారు. ప్రేమికులు కూడా ఒకరిపట్ల ఒకరు బాధ్యతగా వ్యవహరించాలని కోరుకుంటారు

జీవితాన్ని తేలికగా తీసుకోవటం, సమస్యల్ని దాటవేయటం, అవతలి వ్యక్తిపట్ల నిర్లక్ష్యంగా ప్రవర్తించటం ఎవరూ ఇష్టపడరు. బాధ్యతాయుత మైన ప్రవర్తనగురించి గ్రాఫాలజీ ఏ విధంగా తెలుపుతుందో ఇంతకు ముందు ఛాప్టర్లలో చర్చించటం జరిగింది.

**5. ఇతర గుణగణాలు :**

వీటిలో చాలా వరకు వివిధరకాలైన మనస్తత్వాల గురించి గ్రాఫాలజిస్టులు పరిశీలిస్తారు ఏయే పరిస్థితుల్లో మనిషి నిజం చెబుతాడు, ఎక్కువగా అబద్ధాలు చెబుతాడా అతడిలో లౌక్యం పాలు ఎంత వరకు ఉంది డబ్బుపట్ల అతని యొక్క దృక్పథం ఏమిటి ఇలాంటివన్నీ ఈ విభాగం కిందికి వస్తాయి

1. నాలో స్నేహం చెయ[illegible]
2. [illegible]
3. నాలో స్నేహం చెయ[illegible]
4. అదృష్టంగా భావించాను
5. [illegible]
6. [illegible]
7. ఎవరైనా సరే! ఛాలెంజ్ .!!
8. నేను వాళ్ళని ఛాలెంజ్ చేస్తాను

పైన ఎనిమిది రకాల చేతివ్రాతలు ఇవ్వబడ్డాయి మీ చేతివ్రాతపై ఎనిమిది రకాల్లోనూ ఏదో ఒక దానిలో సరిగ్గా ఇమడకపోవచ్చు. మీరుగమనించవలసింది లక్షణాలని మాత్రమే. ఉదాహరణకి పైన చెప్పిన ఉదాహరణలో మీ చేతివ్రాత గొలుసు వ్రాత(7), మరియు ఎడమవైపు వంగిన అక్షరాలు(4) అయివుండవచ్చు అటువంటప్పుడు మీరు 7,4 కేటగిరీకి చెందినవారై వుంటారు అలాగే మీ అక్షరాలు గుండ్రంగా(2), పొడవాటి దీర్ఘాంతో(1) వుండి వుండవచ్చు అప్పుడు మీరు 2,1 లక్షణాలు కలిగి వుంటారు.

ఈ విధంగా మీ చేతివ్రాతని పరిశీలించి, మీరు ఏ యే కేటగిరీలకు చెందుతారో కనుక్కోవాలి. దాన్ని బట్టి మీకు ఏ కేటగిరీ చేతివ్రాతలున్న వ్యక్తులు స్నేహితులుగా (లేదా జీవిత భాగస్వాములుగా) సరిపోతారో తెలుసుకోవచ్చు.

ఇప్పుడిక పై వ్రాతల్ని పరిశీలిద్దాం. — దీర్ఘాలు, వత్తులుగానీ దీర్ఘంగా, పొడవుగా (పై వుదాహరణలో 1 మరియు 3) ఇచ్చేవ్యక్తులు సెక్స్ పట్ల ఎక్కువ వుత్సాహం వున్నవారై వుంటారు. వీరిలో రెండురకాలు. పొడవాటి వత్తుల్నీ, దీర్ఘాల్నీ చి .వ..రి .వరకూ 'బలంగా' ఇచ్చేవారు(1), దీర్ఘాల్ని పొడవుగా ఇచ్చినా, చివర్లో తేలిగ్గా తేల్చేసేవారు (3).

ఇద్దరికీ సెక్స్ కోరికలు, జీవితం మీద ఆశ ఎక్కువగా వున్నా, మొదటిరకం (1), వారు శారీరకంగా, మానసికంగా కూడా అంత బలమైన వారే అయి, తమ భాగస్వామి నుంచి అటువంటి 'బలమైన' ప్రవర్తననే ఆశిస్తారు. పొడవుగా తేలిగ్గ(3) వ్రాసేవారు కోర్కెలున్నా, శారిరక బలహీనతవల్లనైతేనేమి, మానసిక లక్షణాలవల్లనైతే నేమి తమ కోర్కెల్ని భాగస్వామి వద్ద తీర్చుకోలేని అశక్తులై వుంటారు.

ఇటువంటి వారు (1 మరియు 3) వతుల్నీ దీర్ఘాల్నీ పొట్టిగా ఇచ్చే(2) వ్యక్తుల్తో సంసారం సరీగ్గా చేయలేరు. ఈ రకం (2) వ్యక్తులు, జీవతమంటే కేవలం భౌతికమైన ఆనందాలేకాదనీ, సాధించవలసింది ఇంకా చాలా వుందని నమ్మేవారు అయివుంటారు

విచ్చలవిడితనాన్ని ఎక్కువ ఇష్టపడరు. సెక్స్ కన్నా 'రొమాన్స్'ని ఎక్కువ ఇష్టపడతారు.

1వ కేటగిరీ వ్యక్తులు '3'వ కేటగిరీ వ్యక్తుల్ని ప్రేమిస్తే, త్వరలోనే వారిని తమ పంథాలోకి తిప్పుకుని, వారి (3) మూఢనమ్మకాల్నీ, ఇన్‌హెబిషన్స్‌నీ పోగొట్టి సంసారాన్ని సుఖప్రదం చేసుకోగలరు.

2వ కేటగిరీ వ్యక్తులకి సరి అయిన జోడీ 7వ కేటగిరీ వ్యక్తులు. గొలుసు వ్రాత, అక్షరాల మీద 'కమాండు' వీరి తెలివితేటల్ని సూచిస్తుంది. వీరు 2వ కేటగిరీ వ్యక్తులకి స్నేహితులైతే, వారిని లాలించి, పాలించి, స్వర్గం చూపించగలరు.

2వ కేటగిరీకి, అదే కేటగిరీ వారు స్నేహితులైతే, వారి బాధలేవో వారు పడుతూ ఇద్దరికీ అసంతృప్తి లేకుండా సంసారాన్ని గుట్టుగా జరుపుకుంటారు.

దీర్ఘాలు, వత్తులు ఈ విధంగా మనిషిలోని అంతర్గతమైన శారీరక, మానసిక కోరికల్ని తెలియచేస్తాయి — అక్షరాలు ఎడమవైపుకి వంచి వ్రాసేవారు(4) కుడివైపుకివంచి వ్రాసేవారితో(1,3) స్నేహంచేస్తే ఆ స్నేహం సుఖప్రదం కాదు. 4వ కేటగిరీ వారు ఎక్కువ అంతర్ముఖులై, తమ ప్రపంచం తమదే అన్నట్టు వుంటారు. 1 మరియు 3 కేటగిరీ వారు ఎక్కువ పార్టీలలోనూ, బయటప్రపంచంలోనూ తిరగాలనే ఆసక్తి కలవారై వుంటారు. ఇటువంటి వారు దంపతులై, 1,3 కేటగిరీ వ్యక్తి మొగవాడైతే, రాత్రిళ్ళు ఆలస్యంగా ఇంటికి రావడం నేర్చుకుంటారు. అదే స్త్రీ అయితే మహిళా మండలాలవైపు మొగ్గు చూపుతుంది.

(ఈ వుదాహరణల్లో కేవలం అక్షరాలు ఎటువైపు వంగి వున్నాయి అన్నది మాత్రమే పరిగణనలోకి తీసుకోవాలి. వత్తులూ దీర్ఘాలకి ప్రాముఖ్యత ఇవ్వకూడదు)

అక్షరాలు నిలువుగా వ్రాసేవారు(2)(5) ఎడమవైపువంచి వ్రాసేవారికి (4)మంచి స్నేహితులవుతారు. వారి స్నేహం/సంసారం కుదురుగా వుంటుంది.

అక్షరాలు నిలువుగా వ్రాసేవారు (2)(5)కుడి వైపుకి వంచి వ్రాసేవారితో స్నేహం చేయవలసి వస్తే, వారితో (1 3) డామినేట్ చేయబడే ప్రమాదం వుంది. చిత్రమేమిటంటే, అలా చేయబడటం కూడా వీరు (5,2) ఇష్టపడతారు.

మొదటి అక్షరాన్ని నిర్లక్ష్యంగా, పెద్దగా వ్రాసే వ్యక్తుల(7)తో కేటగిరీ(2)కి పరిచయం అయితే ఇకవారి జీవితం నరక ప్రాయమే. 7-1 సంసారులైతే సామాన్లన్నీ వీధిలోనే వుంటాయి.

— పెద్ద అక్షరాలు వ్రాసేవారు (1,3,4,5) తమని తాము ఎక్కువ ప్రదర్శించుకోవాలనే గుణాన్ని, భోళా తనాన్ని కలిగి వుంటారు. వీరిలో చిన్న అక్షరాలు వ్రాసేవారి (2,6,7) స్నేహం/సంసారం. అంత సజావుగా సాగదు. ఎందుకంటే చిన్న అక్షరాలు వ్రాసేవారు, తమ ఆలోచనలని తెలివితేటలనీ, బైట పెట్టడానికి యిష్టపడరు.

— పై ఉదాహరణలో రెండవ కేటగిరీ చేతివ్రాత మగవాడిదయితే అతడు. 6,7,8 కేటగిరీ చేతివ్రాతలున్న స్త్రీలతో మానసికంగా దగ్గరవ్వలేదు. ఎందుకంటే 2.వ కేటగిరి స్త్రీత్వాన్ని , మిగతా మూడు మాస్కులినిటిని తెలియ జేస్తాయి.

— రెండు చేతివ్రాతల్లోనూ తేడా చాలా ఎక్కువవుండే ఆ స్నేహం/సంసారం అంత బాగుండదు. అలా అని రెండూ ఒకేలాగవుంటే అది ఉప్పు కారం లేని కూరలా వుంటుంది.

— పెద్ద అక్షరాలు వ్రాసేవారు (1,3,4,5) గొలుసు వ్రాతవ్రాసే వారితో(6) స్నేహం/సంసారం చేయవలసివస్తే వారితో డామినేట్ చేయబడతారు. ఈ పెద్ద అక్షరాలు వ్రాసేవారు స్నేహపాత్రులు. తమని అందరూ గుర్తించాలని కోరుకునేవారు అయివుంటారు. అక్షరాలని కోణాలుగా వ్రాసేవారు(8) అవతలి వారిని గుర్తించని

వారై వుంటారు అందువల్ల 1,3,4,5 కేటగిరీలకి 8వ కేటగిరీకి పడదు
అక్షరాలు లావుగా, బలంగా లేక పేస్ట్‌లాంటి పెన్‌తో వ్రాసేవారు సాధారణంగా తిండి, త్రాగుడు, రొమాన్స్‌లకు, ప్రాముఖ్యతనిచ్చి జీవితాన్ని తేలికగా తీసుకొని, ఆత్మాభిమానం, అహంభావం వున్నవ్యక్తులుకాని (7వ కేటగిరి) ఆకర్షించలేరు.
ఒత్తులు, దీర్ఘాలు పొడవుగాతీసేవారు,(1,3,7) చాలా ఎమోషనల్‌గా వుంటారు. కంట్రోల్ చేసుకోగలిగే శక్తిలేకపోతే, వీరిలో వీరు స్నేహించడం చాలాకష్టం.
ఎక్కువ తెలివితేటలు,(6) చొరవ, అహంభావం(7) వున్న మగవారు,బిడియం (2) భోలాతనం (5) వున్న స్త్రీలతోసుఖంగానే కాపురం చేయగలరు. రివర్స్‌తో కూడా ఈ జంట బాగానే వుంటుంది.కానీ అక్షరాల మీద కమాండ్ తో వ్రాసేవారు (6,7)త్వరలోనే తక్కువ తెలివితేటలున్న (5) ఇంట్రావర్ట్స్ (4) అయిన వ్యక్తులతో కంపెనీ బోర్‌గా ఫీల్ అవుతారు.
అక్షరాలని కోణాలుగా (8) వ్రాసేవారు, మెటీరియలిస్ట్‌లు, పనిమీద శ్రద్ధ వున్నవారు మెదడుతో పనిచేసే వారు అయివుంటారు. దీనికి వ్యతిరేకంగా, అక్షరాలని గుండ్రంగా వ్రాసేవారు (2,5) భావకులు, హృదయంతో పనిచేసేవారు అయివుంటారు. ఈరెండు గ్రూపులకి పడదు.
అక్షరాలని కోణాలతో వ్రాసేవారు (8) స్త్రీలయితే వాళ్లు ఇంటిని డామినేట్ చేస్తారు.
మొదటి అక్షరాన్ని పెద్దగా వ్రాస్తూ, మిగతా అక్షరాలని నిర్లక్ష్యంగా వ్రాసేవారు తమ చేతిలో అధికారం వుండాలనుకునేవారు, తమమీద తమకి ఎక్కువ నమ్మకం వున్నవారయి వుంటారు. వీరితో సంసారానికి/స్నేహానికి (2,5)కేటగిరి ఆడపిల్లలయితే సరిపోతారు. పొరపాటున 7వ కేటగిరీ అబ్బాయికి 8వ కేటగిరి స్త్రీ భార్య అయితే ఆ సంసారం యిక వీధిలోనే వుంటుంది.

## ఉపసంహారం

ఒక్క విషయం చెప్పి ఈ పుస్తకాన్ని ముగిస్తాను.

మీరు ఈ పుస్తకంలో రకరకాల చేతివ్రాతల్ని పరిశీలించినప్పుడు, మీ చేతివ్రాత దేనికిదగ్గిరగా వుందని 'వెంటనే' సరి చూసుకోవటం ప్రారంభించకండి. దేనికీ దగ్గిరగా వుండక పోవచ్చు.

ప్రతి చేతి వ్రాతకీ కొన్ని లక్షణాలుంటాయి. అక్షరాల వంకర, గొలుసుకట్టు వగైరా.

మీ చేతివ్రాతని, ఆ వివిధ రకాలైన లక్షణాలకి విడగొట్టి మీరు ఆ ఛాప్టర్‌లో ఏ లక్షణాలకి చెందుతారో తెలుసుకొని, దాన్ని బట్టి విశ్లేషించుకోవాలి.

విష్ యు బెస్ట్ అనాలిసిస్ ఆఫ్ యు/యువర్ ఫ్రెండ్స్

— వీరేంద్రనాథ్



# యండమూరి వీరేంద్రనాథ్

# గ్రాఫాలజీ

- అమ్మాయి చేతివ్రాతకీ - అబ్బాయి చేతివ్రాతకీ తేడా వుంటుందా?
- చేతివ్రాత బట్టి - వ్రాసే వ్యక్తి మూడ్ చెప్పొచ్చా?
- వయసు బట్టి వ్రాత మారుతుందా?
- కొంతమంది ఎందుకు ఇన్‌లాండ్ కవరు మడతమీద కూడా అక్షరాల్ని ఇరికిస్తారు?
- సంతకంబట్టి మనిషిని అంచనా వేయొచ్చా?
- ఉద్యోగాలకి ఎందుకు 'స్వంతదస్తూరీ'తో అప్లికేషన్‌లు పూర్తిచేయమంటారు?

రకరకాల చేతివ్రాతలబట్టి, వివిధ వ్యక్తుల మానసిక విశ్లేషణ, వ్యక్తిత్వ పరిశీలనల గురించి

యండమూరి వీరేంద్రనాథ్

వ్రాసిన

తెలుగులో మొట్టమొదటి సాంకేతిక పరిజ్ఞాన శాస్త్రం

గ్రాఫాలజీ



నవసాహితి బుక్ హౌస్

ఏలూరు రోడ్ • విజయవాడ-520 002